# చతుర

Entered

306వ సంచిక
జూలై 2003 ♦ రూ.7/-



రాజా రమేష్‌వర్మ **ప్రేమంటే...?**

# చతుర ప్రపంచం

## పాలు

**త**మిళనాడు రాష్ట్రం వైవిధ్యభరితమైంది. రకరకాల నమ్మకాలు, ఎన్నెన్నో విశ్వాసాలుగల ప్రజానీకం అక్కడున్నారు. గార్ధభాలంటే ఎందరికో చులకనభావం ఉంది. అదొక హీనమైన జంతువుగా భావిస్తారు. అయితే చెన్నైలోని అనేక ప్రాంతాల్లో గాడిదలపై ఎంతో అభిమానం, ఆదరణ ఉంది. అచ్చటి పాఠకజనం, విద్యావంతులు సహితం గార్ధభాలపై మక్కువ కనబరుస్తారు. అందుకు కారణం వాటి పాలు. పసిపిల్లలకు ఆ పాలు ఎంతో మేలు చేస్తాయనీ, అనేక రుగ్మతలను పారదోల్తాయనీ వారు నమ్ముతారు.

ముఖ్యంగా ఆ క్షీరం పిల్లల గొంతులు శుభ్రంచేసి వారి కంఠస్వరం వినసొంపుగా ఉండేలా చేస్తాయని తమిళనాడులోని ప్రజల విశ్వాసం. చెన్నైలోని రాయపురం, సైదాపేట్‌లో కొన్ని ఇళ్ళముందు గాడిద పాలు పిండి, పాత్రల్లో వాటిని పోస్తున్న దృశ్యం నిత్యం చూడచ్చు. రాయపురంలోని సర్‌రామస్వామి ముదలియార్ హాస్పిటల్ సమీపంలో ఓ పాల వ్యాపారి అనేక సంవత్సరాలనుంచీ ఆవులతోపాటు గాడిదపాలుకూడా పితికి అమ్ముతున్నాడు.

10 మి.గ్రా. గార్ధభక్షీరం 50 రూ.ల నుంచి 100 రూ.ల వరకూ ఉంటుంది. రోజువిడిచి రోజూ పసిపిల్లలకు 3 సార్లు 10 మి.గ్రా. గాడిదపాలు పట్టించడంవలన 'బ్లూబేబీ' కండిషన్ తొలగి, శిశువుకు భద్రత ఏర్పడుతుందని ఎగ్మూర్‌లోని 'ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ చైల్డ్ హెల్త్ అండ్ హాస్పిటల్' డైరెక్టర్ గోపాల్ అన్నారు. ఆ హాస్పిటల్ ముందు రోజూ ఉదయం గార్ధభాల పాలు పాత్రల్లో నిండుగా ఉంటాయి. ఆ పాల యొక్క ఔషధగుణాలు శాస్త్రీయంగా రుజువు కానప్పటికీ, తరతరాల నుంచీ తమిళనాడులోనే కాక, ఇంకా అనేక చోట్ల వాటిని వినియోగిస్తూనే ఉన్నారు. కొన్ని ప్రదేశాల్లో ఆవుపాలు దొరకవు. ఆ పరిస్థితిలో అచ్చటివారు తప్పనిసరిగా గార్ధభాల క్షీరాన్నే వినియోగిస్తారు.




ముఖచిత్రం ఫొటోగ్రాఫర్: రవినల్లి

# వింత వృక్షం

ప్రతీరోజూ గోల్కొండ కోట చూడడానికి అనేకమంది వెళ్తూ ఉంటారు. హైదరాబాద్ తొలిసారిగా వెళ్ళినవారందరూ తాము తిలకించే ప్రదేశాల్లో గోల్కొండ ఒకటి. అయితే ఆ చోటుకి 1 కిలోమీటరు దూరంలో వున్న ఒక అపురూపాన్ని చూడకుండా అనేకమంది తిరిగి వచ్చేస్తారు. ఆ అద్భుతం ఒక వృక్షం! ఆ చెట్టుగురించి తగిన ప్రచారం లేకపోవడంవలన జనం దృష్టిలోకి అది వెళ్ళలేదు.

వెయ్యి సంవత్సరాలనుంచీ ఆ మహావృక్షం ఉందని శాస్త్రజ్ఞులు చెప్తున్నారు. బహుకొద్దిమంది మాత్రమే వెళ్ళి ఆ చెట్టును చూడడం జరుగుతోంది. ఏనుగువలే భారీగా ఉండడంవలన ఆ చెట్టును 'ఏనుగుచెట్టు' అని ముద్దుముద్దుగా పిలుస్తారు. ఆఫ్రికాకు చెందినదది. దాని అసలు పేరు 'బోలోబా' వృక్షం. నయాకిలా ప్రాంతం లోని వారికి అది ప్రీతిపాత్రమైంది. 150 అడుగుల ఎత్తైన చెట్టది. దాని మొదలుకు అతి పెద్ద డొల్ల ఉంది. 37 చ. అడుగుల విస్తీర్ణం వరకూ వ్యాపించింది. దాని నీడలో 20 మంది హాయిగా కూర్చుని విశ్రాంతి తీసుకోవచ్చు.

ఒక కొమ్మ నిండైన ఆకులతో అచ్చు ఓ ఏనుగు తలవలే చెవులు, తొండంవలే కనిపిస్తుంది. మొదలులో వున్న డొల్ల ప్రదేశం ఓ కొండగుహవలే ఉంటుంది. దాని లోపలకు వెళ్ళినవారికి సిగరెట్ పీకలు, పాన్‌మసాలా ప్యాకెట్లు, ఖాళీ చిప్స్ ప్యాకెట్లు వంటివి చెల్లాచెదురుగా పడి కనిపిస్తాయి.

అది నిర్జన ప్రదేశంలో ఉండడంవలన అక్కడకు వెళ్ళడానికి కొందరు ఆసక్తి చూపరు. ఆ ప్రదేశంలో దెయ్యాలు సంచరిస్తాయనే ఓ వదంతి సహితం ఉంది.




అందువలన కొందరు వెళ్ళరు. సాహసప్రవృత్తి గలవారు, విదేశీయులు మాత్రం అక్కడికి వెళ్తూ ఉంటారు. 500 సంవత్సరాలక్రితం ఆలీబాబా అనే పేరుమోసిన దొంగ తన అనుచరులతో ఆ చెట్టుతొర్రలో దాగాడనీ, హైదరాబాద్‌లో ఓ అతిపెద్ద దొంగతనం చేసి అతను అక్కడ వున్నట్లుగా గైడ్ చెప్తాడు. ఆలీబాబా బెడద గురించి ప్రజలు రాజు మహమ్మద్ కులీకుతుబ్‌షాకు విన్నవించుకోగా ఆయన తన భటులతో గోల్కొండ ప్రాంతం, నగరం అంతటా ఆలీబాబాకోసం గాలించాడనీ, అతను చెట్టు లోపల నక్కి ఉండడంవలన వారికి అతడు దొరకలేదనీ గైడ్ చెప్తాడు.




## మూర్ఖశిఖామణుల వార్తలు

ఎంతటి మేధావులైనా కొన్ని విషయాల్లో చిత్రమైన తప్పులు చేసి వార్తల్లోకి ఎక్కుతుంటారు. ఇలాంటివారు ఓ దేశానికో లేదా ప్రాంతానికో సంబంధించి కాకుండా ప్రపంచంలో ఎన్నో చోట్ల తారసిల్లుతూ వుంటారు.

★ గ్రీస్ దేశానికి చెందిన ఓటర్ల జాబితాని తయారుచేసే అధికారి మార్సెల్లో తన జాబితాని పరిశీలించి 113 ఏళ్ళ వయసుగల అలెగ్జియోస్ అనే వృద్ధుడి పేరుని తొలగించాడు. అతను ఇంకా బతికి వున్నాడని నమ్మలేదతను. డెత్ రికార్డ్స్ చెక్‌చేసే టైం లేక 1893 సం. లో పుట్టిన వారి పేర్లని తన జాబితాలో నుంచి తొలగించాడు. అయితే వారిలో 10 మందిలో 9 మంది జీవించి వుండడమే కాక మార్సెల్లో తన ఓటు హక్కుని రద్దు చేసినందుకు కేసులు పెట్టారు.

★ అమెరికాలోని ఓడింగ్‌టన్ అనే ఊళ్ళో వెళ్తోన్న ఓ పెద్దమనిషిని చూసిన పోలీసులు అతను జైలునుంచి తప్పించుకున్న ఖైదీ అయి వుండచ్చన్న అనుమానంతో అరెస్ట్‌చేశారు. కారణం అతని దుస్తులు. బ్లాక్ ఆరెంజ్ చారలున్న నల్లరంగు పేంటుని ధరించడంతో ఆ అనుమానం పోలీసులకి కలిగింది. కారణం మిచిగాన్ డిపార్ట్‌మెంట్ ఆఫ్ కరెక్షన్స్ అనే జైల్లోని ఖైదీలు సరిగ్గా అలాంటి పేంటే ధరిస్తారు. అయితే దాన్ని అతను సెకండ్ హేండ్‌కి కొనుక్కుని ధరించాడే తప్ప మరేదీకాదు. ఎనిమిది గంటలు అతన్ని పోలీస్ స్టేషన్‌లో వుంచి విచారించి నిజం తెలిసి విడిచిపెట్టారు. జైలుకిచెందిన ఆ ప్యాంటుని ఎవరు అమ్మారో తెలియలేదు.

★ గత 11 ఏళ్ళలో 94 కారు ఏక్సిడెంట్లు చేసి మొత్తం 30 కార్లు పనికిరాకుండా చేసిన ఘనత ఇంగ్లండ్‌కి చెందిన 28 ఏళ్ళ ఎరిక్‌సన్‌కి చెందుతుంది. ఓసారి అతను కొత్తగా కారు కొన్న 19వ గంటకి దాంతో ఏక్సిడెంట్ చేసి అది సగం పనికిరాకుండా చేశాడు. అతని భార్య ఇందుకు కారణం చెప్తుందిలా, ఎరిక్ డ్రయివ్ చేసేప్పుడు మాట్లాడతాడు. ఎటో చూస్తుంటాడు. అతని బంధుమిత్రులెవరూ అతను డ్రయివ్‌చేసే కారు ఎక్కరు.

ఆశ్చర్యంగా అతను ఏ ఒక్క ఏక్సిడెంట్‌లోనూ చిన్న గాయం కూడా కాకుండా బయటపడుతుండడం విశేషం. మరో విశేషం అతని డ్రయివింగ్ లైసెన్స్‌ని బ్రిటీష్ ప్రభుత్వం రద్దు చేయకపోవడం. ఓ దినపత్రిక అందుకే బ్రిటిష్ ప్రభుత్వానికి మూర్ఖశిఖామణి అనే బిరుదుని కూడా ప్రసాదించింది.



# 'సేవ్ లవ్ డాట్ కామ్' పై సమీక్షలు

మే చతురలో ప్రచురితమైన వసుంధర నవల 'సేవ్ లవ్ డాట్ కామ్' పై మాకందిన ఉత్తమ సమీక్షల్ని ఈ దిగువన ప్రచురిస్తున్నాం

## సంప్రదాయానికి, ఆధునికతకీ వారధి

*(మొదటి బహుమతి రూ.100/- పొందిన సమీక్ష)*

నేటి సమాజంలో యువత ప్రేమ ప్రవాహంలో కొట్టుకుపోతోంది. దానికి తగ్గట్టుగా కంప్యూటర్ మయమయిన నేటి ప్రపంచ పోకడను సంప్రదాయానికి, నూతనత్వానికి వారధిగా మలిచారు రచయిత్రి వసుంధర. నవలలో వివరణలు ఎక్కువగా వుండి కొంచెం బోరుగా వున్నా కొత్త విషయాలతో చివరి వరకూ చదివించిందీ నవల.

భారవి, కాళిదాసు, శశాంక మధ్య స్నేహాన్ని రచయిత్రి సినిమా దృశ్యీకరణ ద్వారా సినిమా సెట్టింగులను, విలన్‌ను చొప్పించి అన్ని రంగాల మధ్యా సామరస్యం వుండేలా చిత్రీకరించారు.

శకుంతలని, దర్పణిని సినిమాహాలు దగ్గర స్నేహితులుగా కలుపుతూ సంప్రదాయానికి, నూతనత్వానికి వారధిగా మలిచారు. ఫ్రెండ్సందరినీ ర్యాగింగ్ పేరుతో రప్పించడం, కూల్‌డ్రింక్‌లో భంగు కలిపి ఇవ్వడం, భంగు ప్రభావంలో శకుంతల రాజునే ఎప్పటికీ తన భర్తగా కోరుకోవడం వగైరా సంఘటనలు ఆసక్తికరంగా ఉన్నాయి.

"దేవతలకు కీడు తలపెట్టాలనిపించదు. మంచి మాటలు చెప్పి ఆమెను నీకప్పచెబుదామనుకున్నాను" అని శశాంకతో రాజు చెప్పడంతో ఆ పాత్ర ఉన్నత స్థాయికి ఎదిగి, నిజాయితీగా నిలిచింది.

సంప్రదాయం, జాతకాలు అన్నీ ప్రేమ ముందు వీగిపోతాయన్న విషయాన్ని సందర్భోచితంగా, సమంజసంగా చిత్రీకరించారు రచయిత్రి.



చివరలో "శకుంతలకి, రాజుకీ మీరు పెళ్లి చేస్తేసరే. లేకపోతే నేను శకుంతలని పెళ్లాడి రాజుకు అప్ప చెబుతాను. అప్పుడామె పతివ్రత కాకపోయినా ప్రియవ్రతగా మిగిలిపోతుంది" అన్న కృష్ణమురళి మాటలు పాఠకులను ఆలోచింపచేస్తాయి.

"శకుంతల ఎల్లకాలం నా మనవరాలిగానే వుండిపోవాలి. అది కోరుకున్న వాడితో దాని పెళ్లి జరుగుతుంది. మా జీవితాల్లా దాని జీవితాన్ని భ్రమకానివ్వను" అంటూ తాతయ్య చూపించిన హుందాతనం ప్రశం

సనీయం. మొత్తం మీద నవల ఇతివృత్తం, నడక అన్నీ కొత్తగా వుండి, చదివింపచేస్తా యనడంలో సందేహంలేదు.

–ఎస్.లీలావతి
హైద్రాబాద్

## సమాజ వ్యతిరేక ధోరణి

*(రెండవ బహుమతి రూ.75/– పొందిన సమీక్ష)*

"అక్షరాలతో ఆకారాన్నిచ్చి ప్రాణంపోసి ఆచంద్రతారార్కం నిలిచిపోగల పాత్రల్నీ, పరిసరాలనూ, సంఘటనల్నీ సృష్టించగల అపర విశ్వామిత్రుడు ఆ రచయిత."

ఇది నవల ప్రారంభంలో రచయిత్రి ఇచ్చిన చక్కటి ఉపోద్ఘాతం. కానీ నవలంతా ఓ స్త్రీ చుట్టూ తిరుగుతుంది. ఆ స్త్రీ ఎంతో ఉదాత్తంగా, చిరస్థాయిగా నిలిచిపోగల గొప్ప వ్యక్తిత్వం కలదా! ఎందుకీ నవల ఆమె చుట్టూ తిరిగింది అని ఆలోచిస్తే ఇది చాలా సాదాసీదా, రొటీన్ ప్రేమకథ.

ఒక అందమైన అమ్మాయి. ఆ అమ్మాయిని ప్రేమించి, ఆమె కోసం తహతహలాడే పురుషుడు. ఆమె పట్ల ఆకర్షితుడై ఆ ప్రేమ నందుకోడానికి ఎదురైన అడ్డంకుల మధ్య ముందుకెళ్లలేకా వెనక్కిరాలేకా ఊగిసలాడే మరో హీరో. ప్రేమకు కులాలు, మతాలు, అడ్డురాకూడదని, ప్రేమని జయించేది, జయించాల్సింది ప్రేమేనని ఏ నిర్బంధాలూ, సంప్రదాయాలూ ప్రేమికులని విడదీయకూడదని బోధించే ప్రేమ నీతికథ. ఈ అతి సాదాసీదా కథని కొత్త పంథాలో చెప్పడానికి రచయిత్రి చాలా కృషి చేశారనిపిస్తుంది. అందుకు ఉదాహరణ చిత్రవిచిత్రమైన పాత్రల సృష్టి.

కథానాయిక తాను ప్రియవ్రతనని, ప్రేమించిన వాడినే పెళ్లిచేసుకుని ప్రియవ్రత నవుతానని అంటుంది. ఆలోచన బాగానే వున్నా ప్రయోగాత్మకంగా ఎంతమంది అలా విజయం సాధించగలరు? జీవితమంటే సర్దుబాటు తప్ప మరేం కాదు. అనేక సందర్భాల్లో, అనేక సంఘటనలలో రాజీపడి బతకడం తప్పనిసరి. రాజీయే లేకపోతే మనిషి బతుకు ఎంత దుర్భరం. అందులోనూ జీవితంలో అతి ముఖ్యమైన రాజీ వివాహం. ఈ ప్రపంచంలో ప్రేమించి పెళ్లి చేసుకున్నవాళ్లు ఎందరు? అలాగని ప్రేమ ఫలించని వాళ్లంతా దేవదాసులయారా? "ప్రేమించిన వాడిని చేసుకోవద్దన్నారు. నేనసలు పెళ్లే చేసుకోను" అని తల్లితండ్రులతో అమ్మాయిలు ఎంతమంది అంటారు. యవ్వనపు తొలి రోజుల్లో యువతీయువకులు ఒకరిపట్ల మరొకరు ఆకర్షితులవడం సహజం. అలాగని ఆ ఆకర్షణనే ప్రేమగా, అదే జీవితంగా భావిస్తే ఎంతమంది బోర్లా పడలేదూ! ప్రేమ వివాహాలు చేసుకున్న వాళ్లంతా జీవితాంతం కలిసే ఉంటున్నారా?

అయితే ఇందులో పెద్దలను నొప్పించకుండా, వారిని గౌరవిస్తూనే తమ జీవితాలను తమకు నచ్చిన విధంగా నడుపుకుంటారు శకుంతల తల్లీతండ్రీ. అది నూటికి నూరుపాళ్లు సమాజ వ్యతిరేక ధోరణే అయినా అటు పెద్దల పట్ల భయాన్ని, ఇటు ప్రేమపట్ల నిబద్ధతని అంతర్లీనంగా సూచిస్తుంది. పెద్దలని ఎదిరించలేని వాళ్ల మనస్తత్వం అద్దంలా కనబడుతుంది. స్థూలంగా మాత్రం ఆ విషయాన్ని అందరూ సమర్థించలేరు. కథనం ఆసక్తికరంగా సాగింది.

–ఎ.విజయలక్ష్మి
హైదరాబాద్

## కొరుకుడు పడని ట్విస్ట్

*(మూడవ బహుమతి రూ.50/– పొందిన సమీక్ష)*

'సేవ్‌లవ్ డాట్‌కామ్' పేరిట మే నెలలో ప్రచురితమైన నవల ఆద్యంతమూ



ఆసక్తికరంగా సాగింది. కథ, కథనం, శైలి అన్నీ ఆకట్టుకున్నాయి. అక్షరాల వెంబడి కళ్లు పరుగులు తీస్తాయి.

హఠాత్తుగా డబ్బు రావడంతో తానో హీరో కావాలనుకునే వింత కోరిక శశాంకలో పుట్టడం, ట్రూప్‌ను తయారుచేసుకోవడం, హీరోయిన్ కోసం వల పన్నడం తమాషాగా సాగింది. మరోపక్క హీరోయిన్ తాను ప్రియవ్రత ననడం, అందుకు ఇచ్చిన వివరణ కొత్తగా, ఆసక్తికరంగానే వున్నాయి. ప్రేమను త్యాగం చేసిన శశాంకది కూడా ఇందులో ఉదాత్తమైన పాత్రే అని చెప్పచ్చు.

అయితే సంభాషణల విషయంలో కొంచెం జాగ్రత్త పడి ఉంటే బాగుండేది. ముఖ్యంగా పతివ్రతలు అంటే ముందు ఒకళ్లని ప్రేమించి తర్వాత మరొకళ్లని పెళ్లి చేసుకుని అతనికే కట్టుబడి ఉంటారని రచయిత్రి ఓ చోట అన్నారు. ఇది అభ్యంతరకరంగా తోస్తుంది.

అలాగే శకుంతల తల్లికాని తల్లి, అసలు తల్లుల పెళ్లిళ్లు, పెళ్లి ఒకరితో కాపురం మరొకరితో లాంటి సంఘటనలు లేకుండా కూడా నవల ముగించచ్చు. ఈ ట్విస్ట్ కొరుకుడు పడటం కొంచెం కష్టమే. లాజికల్‌గా కూడా కరెక్ట్‌కాదు. అంతగా అయితే పెళ్లి పెద్దవారి ఇష్టప్రకారం చేసుకుని విడాకులు తీసుకున్న తర్వాత నచ్చిన వాళ్లని పెళ్లి చేసుకున్నట్టుగా రాసినా బావుండేది.

ఈవిధంగా భర్తల్ని మార్చుకోవడం నవల స్వరూపాన్ని దెబ్బతీసేదిగా అనిపించింది. ఏదిఏమైనా నిజజీవితంలో తనను తాను హీరోగా ప్రమోట్ చేసుకోవడానికి హీరో పడ్డ శ్రమ బాగా చిత్రించారు. ఏవో కొన్ని లోపాలు తప్పితే 'సేవ్‌లవ్ డాట్‌కమ్' ఆసక్తిగా ఆరంభమై ఆసక్తిగా ముగిసింది. రచయిత్రికి అభినందనలు.

– కె.బి.కామాక్షి
హైదరాబాద్

# సమాజ హితం

*(నాలుగవ బహుమతి రూ.50/– పొందిన సమీక్ష)*

కల్పన, వాస్తవం పడుగు పేకలలాగా మేళవించి నిర్మించిన వినోదభరిత నవలాంబరం 'సేవ్‌లవ్‌డాట్‌కామ్'. చాలా సినిమేటిక్‌గా ఉంది. గత శతాబ్ది అరవయిల్లో వచ్చిన సినిమాలను గుర్తు చేస్తోంది. కాసేపు చదువరులకూ భంగు పట్టించి ఏది కల్పనో, ఏది వాస్తవమో తెలియని అయోమయంలో పడేసిన కథనం వినోదభరితంగా సాగింది. ఈ వినూత్న నవలా శిల్పానికి (?) హేట్స్‌ఆఫ్.

'ప్రియవ్రత' అనే భావన చాలా నూతనంగా, ఆసక్తికరంగా ఉంది. ఎటొచ్చీ పెళ్లికి ముందు యువతి పెళ్లికొడుకును ఎట్టి పరిస్థితిలోను చూడకూడదనే షరతు ఎందుకో ఎంత యోచించినా తట్టటం లేదు. ప్రియుడే భర్త కావాలనీ, అటువంటి పతికే జీవితాంతం అంకితమవాలనే వ్రతం హర్షణీయమే.

ఇందులో ప్రధానమైన రెండు పాత్రలు శకుంతల, దర్పణి. వారి స్వభావాలను వర్ణిస్తూ రచయిత్రి ఇలా అంటారు "శకుంతల తెలివయినది. మంచిది. అమాయకురాలు. దర్పణి చెడ్డదికాదు, గడసరి." తెలివయిన శకుంతల అమాయకురాలెలా అవుతుంది? ఇవి పరస్పర విరుద్ధ లక్షణాలు. మంచిది, చెడ్డది కాదు ఈ రెండు లక్షణాలకు సూక్ష్మమయిన భేదమేమిటో అవగతం కాదు. ఇలాంటి విశ్లేషణలు దురవగాహంగా ఉన్నాయి.

ఇక నిర్వచనాలు చూస్తే "ముందొకళ్లని ప్రేమించి ఇంకొకళ్లని పెళ్లి చేసుకొని కట్టుకున్నవాడికే కట్టుబడి ఉండేవాళ్లు పతివ్రతలు" అన్నారు. పతివ్రతకు ఇలాంటిది తప్పుడు నిర్వచనం. పెళ్లికి ముందు ఎవరో ఒకర్ని ప్రేమించి ఉండటం, మరొకర్ని పెళ్లాడటం పతివ్రతకు తప్పని సరా?





"ఒకణ్ణి ప్రేమించాక పెళ్లైనా కాకపోయినా ప్రియుడికే జీవితాంతం కట్టుబడి ఉండే వాళ్లు ప్రియవ్రతలు" ఈ నిర్వచనం ప్రకారం పెళ్లికాకపోయినా కలిసి బతకటాన్ని ఈ నిర్వచనం సమర్థిస్తోందా?

హాస్యం కోసమైనా జీవితపు ముఖ్య సమస్యలైన ప్రేమా, పెళ్లిపట్ల ఇట్లాంటి అయోమయ భావాలను ప్రచారం చేయటం ప్రమాదకరం. ఇప్పటికే సినిమాలు, టీవీ సీరియల్సు ప్రేమాపెళ్లిళ్లను గురించి అతిగా చర్చించి యువతను గందరగోళ పెడుతున్నాయి. జీవితంలో ప్రేమ, పెళ్లి ముఖ్యమైన అంతర్భాగాలే. కాని జీవితం వీటికంటే విలువయినది అనే విషయాన్ని లోతుగా ఆలోచించే ధోరణిని రచయితలు యువతలో ఎంత ప్రోత్సహిస్తే వ్యక్తులకు, సమాజానికి అంత మేలు జరుగుతుంది. సాహిత్యం సమాజం హితం కోరాలికదా!

—కె.పురుషోత్తం
కాకినాడ

## అసాధారణ రూపం

*(ఐదవ బహుమతి రూ.50/– పొందిన సమీక్ష)*

మే 2003లో ప్రచురితమైన చతుర 'సేవ్ లవ్ డాట్‌కామ్' ఒక సాధారణ ప్రేమ కథకు అసాధారణ రూపం. నిర్దిష్టమైన అభిప్రాయాలున్న తన జీవితంపై, తన జీవిత భాగస్వామిపై ఖచ్చితమైన నిర్ణయాలున్న అందమైన అమ్మాయిగా 'శకుంతల' పాత్ర బాగుంది. పాత్ర చిత్రీకరణలో రచయిత్రి తన ప్రతిభను చాటుకున్నారు. కానీ నవలలో లేనిపోని పాత్రలు, అర్థంలేని సంభాషణలతో గందరగోళంగా మలిచారు. అసలు రచయిత్రి ముఖ్య ఉద్దేశ్యం ఏమిటో, ఆమె ఈ నవల ద్వారా చెప్పదలచుకున్నది ఏమిటో ఎంత చదివినా పాఠకులకు అర్థం కాదు.

శశాంక, కృష్ణమురళి పాత్రలు చిత్రీకరించడం చివరికి శశాంకను అక్రమ సంతానం అని వర్ణించి మళ్లీ అతనికి కోట్ల ఆస్తిని రప్పించడం, కథ మొత్తం ప్రత్యర్థులుగా మసలిన కృష్ణమురళి, శశాంకలు సామరస్యంగా మాట్లాడుకొని రాజీకి రావడం, చివరికి అసలు కృష్ణమురళి శకుంతలను ప్రేమించలేదనడం, శకుంతల పుట్టుక కథలు ఇవన్నీ ఈ గందరగోళాన్ని మరింత పెంచాయి.

కథలో అనేక ఉపకథలు, అక్కరలేనన్ని అనవసర పాత్రలు ఇవన్నీ కలిసి నవలను పెంచడానికి ఉపయోగపడ్డాయే కానీ కథనంలోని పట్టుని ఏమాత్రం బిగించలేకపోయాయి. రాజుని, శకుంతలని కలపాలని కృష్ణమురళి అనుకుంటే దానికి ఇంత నాటకం ఆడాల్సిన అవసరంలేదుకదా.

శకుంతల తాతయ్యచే చెప్పించబడిన హరిశ్చంద్రుడి కథ, కుంతి, గాంధారిల కథలు, నిజజీవితానికి పురాణాలని ఎలా ఉపయోగించుకోవచ్చో బాగా చెప్పడం జరిగింది. 'ప్రేమకు బలం ఉంటే ఆ ప్రేమ గెలిచి తీరుతుంది' అనే సందేశం బాగా ఇచ్చారు. కానీ సంప్రదాయం పేరిట ప్రేమకు, ప్రేమికులకు అన్యాయం చేసిన తాతయ్య మళ్లీ అదే తప్పుని మనుమరాలి విషయంలో చేయడం చివరికి సరిదిద్దుకోవడం బాగా లేదు.

మొత్తం మీద ఇది సాంప్రదాయబద్ధమైన కుటుంబంలో పెరిగిన పిల్ల తన నమ్మకమైన 'ప్రియవ్రతా' భావాన్ని అందరినీ ఎదిరించి ఎలా నిలబెట్టుకుందో చూపడంలో రచయిత్రి సఫలీకృతులయ్యారు.

—బి.అరుణ
మంగళగిరి

# చతుర

సంపుటి: 26 సంచిక: 6 జూలై: 2003
306వ సంచిక

"నీ స్థానం బలహీనమైనది కాదు. కానీ నా తల్లిదండ్రుల స్థానం మాత్రం నీకంటే బలమైనది. ఇద్దరిలో ఎవరినో ఒకరిని ఒదులు కోవలసివస్తే ఖచ్చితంగా నిన్నే వదులుకుంటాను" తెగేసి చెప్పిందా ప్రేమికురాలు తన ప్రియుడితో.

"మన పెళ్లి విషయంలో మీ అమ్మా నాన్నలే కాదు ఎవరడ్డొచ్చినా వాళ్ళని చంపయినా నిన్ను పెళ్లి చేసుకుంటాను" వీరావేశంతో భీషణ ప్రతిజ్ఞ చేశాడా ప్రియుడు.

వాళ్ళ ప్రేమకథ ఏ మలుపు తిరిగింది? ప్రేమంటే ఆకర్షణా? కొన్ని ప్రేమ పెళ్లిళ్లు సఫలం కాకపోవడానికీ, కొన్ని ప్రేమలు పెళ్లిళ్లదాకా రాకపోవడానికీ గల కారణాలకు అక్షరరూపం

రాజా రమేష్ వర్మ రచన

## ప్రేమంటే...?

ఈ నెల చతుర సమగ్ర నవల.

మంటే...!

తొలి చూపులో కలిగే ఆకర్షణా?

పరిచయంతో కలిగే అభిమానమా?

చేష్టలతో కలిగే ఇష్టమా?

ప్రేమలో మునిగి ఉన్న ఒక్కొక్క జంట ఒక్కొక్క అర్థం చెపుతుంది ప్రేమకు. ప్రేమ లేనిదే జీవితం లేదని, ప్రేమించడం తమ జన్మహక్కు అని భావిస్తోంది నేటి యువ తరం. కానీ కాలేజ్ ఏజ్‌లో ప్రారంభమైన ఎన్నో ప్రేమ కథలలో కొన్ని మాత్రమే విజయవంతమవుతున్నాయి. నూటికి పది నుండి ఇరవైవరకూ మాత్రమే ప్రేమనుండి పెళ్ళికి దారితీసి విజయవంతం అవుతున్నాయి. మిగిలిన ప్రేమకథలన్నీ ప్రేమికుల హృదయాలను కన్నీటి సాగరంలో ముంచి విరహాన్ని మాత్రమే మిగులుస్తున్నాయి.

దీనికి కారణం ఏమిటి? తల్లిదండ్రుల పెద్దరికమా? పిల్లల అవగాహన లోపమా? లేక అనాలోచితంగా ప్రేమలో పడడమా?

★ ★ ★

అది ఒక కో ఎడ్యుకేషన్ కాలేజ్.

ఎన్నో టైంపాస్ ప్రేమలకు, కొన్ని విరహ ప్రేమలకు, అతికొద్ది సక్సెస్‌ఫుల్ ప్రేమలకు నిలయం. క్లాసులు పూర్తవడంతో కొందరు ఇంటికి బయలుదేరుతున్నారు. కొందరు ఫ్రెండ్స్‌తో కలిసి క్యాంటీన్‌లో కూర్చొని కబుర్లు మొదలుపెడుతున్నారు.

క్యాంటీన్‌లో ఒక కార్నర్‌లో ఉన్న టేబిల్ వద్ద కూర్చొని ఉన్నారు శ్రీనివాస్, చైతన్య, మహేష్, సింధు, భాను. వీళ్ళంతా బి.యస్సి. చదువుతున్నారు. మంచి ఫ్రెండ్స్ కూడా.

"శ్రీనివాస్... తరువాత నీ ప్రోగ్రాం ఏమిటి?" ప్రశ్నించింది భాను.

"ఇక్కడనుండి బీచ్‌కి వెళ్ళి ఓ అరగంట ప్రశాంతంగా గడిపి ఇంటికి పోవడమే" చెప్పాడు శ్రీనివాస్.

"నేను కూడా నీకు కంపెనీగా రానా?" చాలా ఉత్సాహంగా ప్రశ్నించింది భాను.

"వద్దు తల్లీ. నేనొక్కణ్ణే వెళతాను" నవ్వుతూ అన్నాడు శ్రీనివాస్.

"మరీ మొహమాటం లేకుండా అలా ముఖం మీద చెప్పేస్తావేంటి?"

"దీనిలో మొహమాటపడడానికి ఏముంది? నేను ప్రశాంతంగా గడపడానికి వెళుతున్నాను. నువ్వు వచ్చావనుకో పెళ్ళికి వెళుతూ పిల్లిని చంకన పెట్టుకొని వెళ్ళినట్టు ఉంటుంది" నవ్వుతూ అన్నాడు శ్రీనివాస్.

"అంటే నేను మీ అందరికీ అంత చిరాకు కలిగిస్తున్నానన్నమాట. అయితే ఇక నేనెందుకు ఇక్కడ. నే వెళ్ళిపోతున్నా" అంది భాను కూర్చున్న చోటునుండి పైకి లేస్తూ.

"ఏయ్... భానూ సరదాగా అన్నాను కూర్చో... కూర్చో" అన్నాడు శ్రీనివాస్.

"నాకు తెలుసులే. నేను కూడా యాక్ట్ చేశాను" నవ్వుతూ అంది భాను.

"అబ్బో నేటి సావిత్రిగారు వచ్చారండీ. యాక్ట్ చేసిందట. చూస్తేనే భయమేసింది. ఏం ఫీలింగ్స్ అవి. నిజంగా నువ్వు కనుక సినిమాల్లో యాక్ట్‌చేస్తే ప్రేక్షకులకి జీవితం మీద విరక్తి పుట్టేసి ఆత్మహత్యలు చేసుకుంటారు" అన్నాడు మహేష్.

"నన్ను అనే అంత సీన్ నీకు లేదమ్మా. అందుకే కాలేజ్ ఫ్రెషర్స్‌డేకి నువ్వు స్టేజ్ ఎక్కితే అందరూ చెప్పులతో కొట్టారు" మూతిని వంకర్లు తిప్పుతూ అంది భాను.

"ఆ... కొట్టింది నన్నేంకాదు. నా పక్క వాణ్ణి కొడితే నాకు తగిలాయి అంతే" అన్నాడు మహేష్ కవర్ చేసుకోవడానికి ప్రయత్నిస్తూ.

"అబ్బా... ఎప్పుడూ వాదించుకోవడమే. ఆపండి మీ వాదన" అంది సింధు.

"హాయ్!" అంటూ వీళ్ళని సమీపిస్తూ విష్ చేశాడు రమేష్. రిప్లైగా అందరూ విష్ చేశారు.

రమేష్ చైతన్యకి అన్నయ్య. అదే కాలేజ్‌లో ఎమ్.ఎస్.సి. చదువుతున్నాడు. రమేష్, చైతన్య, సింధు పక్క ఊరినుండి





ప్రతీరోజూ బస్‌లో కాలేజ్‌కి వస్తారు.

"బస్ టైం అవుతోంది వెళదామా?" ప్రశ్నించాడు రమేష్.

"సరే... బై" అని అందరికీ చెప్పి అక్కడ నుంచి వెళ్ళిపోయారు రమేష్, సింధు, చైతన్య.

"రమేష్ సింధుని ప్రేమిస్తున్నాడంటావా?" వాళ్ళు వెళ్ళిన తరువాత ప్రశ్నించాడు మహేష్.

"ఏమో? అయినా ఆ అనుమానం నీకెందుకు వచ్చింది" ప్రశ్నించాడు శ్రీనివాస్.

"ఈమధ్య రమేష్, సింధు చాలా క్లోజ్‌గా మూవ్ అవుతున్నారు అందుకు"

"వాళ్ళ గురించి నీకెందుకు. నువ్వెలాగూ ఎవర్నీ ప్రేమించవు. కనీసం ప్రేమించుకునే వాళ్ళనైనా ఎంకరేజ్ చెయ్యవా?" వాళ్ళ మాటల మధ్యలో దూరుతూ అంది భాను.

"నాకూ సింధులాంటి మంచి అమ్మాయి దొరికితే నేనూ ప్రేమిస్తాను" అన్నాడు మహేష్.

"నేనున్నానుగా" అంది భాను కనుబొమలు ఎగరేస్తూ.

"నేను నిన్ను ప్రేమిస్తే ఏనుగులాంటి అమ్మాయికి ఎలకపిల్లలాంటి అబ్బాయి దొరికాడని జనం చెవులు కొరుక్కుంటారు" నవ్వుతూ అన్నాడు మహేష్.

"ఏయ్... మాటలు జాగ్రత్తగా రానీ" సీరియస్‌గా అంది భాను.

వాళ్ళిద్దరినీ చూసి నవ్వుకున్నాడు శ్రీనివాస్.

"సరే నే వెళ్తానురా" అని అక్కడినుండి బయల్దేరాడు శ్రీనివాస్.

★ ★ ★

"టైము అవుతున్నా బస్ ఇంకా రాదేంటి?" చిరాకుగా మొహం పెడుతూ ప్రశ్నించింది సింధు.

"ఎ.పి. యస్.ఆర్.టి.సి. బస్సులుకదా! టైంకి రావు" అన్నాడు చైతన్య.

"ఎ.పి. యస్.ఆర్.టి.సి.కి ఫుల్ ఫామ్ తెలుసా?" ప్రశ్నించాడు రమేష్.

"ఆంధ్రప్రదేశ్ రోడ్ ట్రాన్స్‌పోర్ట్ కార్పొరేషన్" వెంటనే చెప్పింది సింధు.

"కాదు"

"మరి ఏంటి?"

"ఎ.పి. అంటే ఆగితే పోదు, ఎస్.ఆర్. అంటే సచ్చినా (చచ్చినా) రాదు. టి.సి. అంటే టైంకి చేరదు అని" అన్నాడు రమేష్. ముగ్గురూ నవ్వుకున్నారు.

"అయినా ఒకప్పటికంటే ఇప్పుడు చాలా బెటర్. కొద్దిగా టైంకి వస్తున్నాయి" అన్నాడు చైతన్య.

"ఇది మాత్రం నిజం" వంత పాడింది సింధు.

"ఓహ్... క్లాస్‌రూంలో నోట్‌బుక్ మరిచిపోయాను. ఇప్పుడే వస్తాను" అని పరుగెత్తుకుంటూ మళ్ళీ కాలేజ్‌లోకి వెళ్ళాడు చైతన్య.

"ఏంటి సింధూ? ఏంటి ఇంట్లో విశేషాలు?" ప్రశ్నించాడు రమేష్.

"అంతా మామూలే. స్పెషల్‌గా ఏంలేదు" చెప్పింది సింధు.

"మీ బావతో నీ పెళ్ళి గురించి మళ్ళీ ఏమైనా అన్నారా?"

"ఏంలేదు. అయినా మా బావకి ఒక అన్నయ్య ఉన్నాడు. ముందు తనకి పెళ్ళి అవ్వాలి. తరువాత నా విషయం. ఇంకా టైముంది. కానీ నాకెందుకో భయంగా ఉంది. ఇంట్లో మన గురించి ఎలా చెప్పాలో అర్థం కావడంలేదు. చెప్పినా ఒప్పుకుంటారని కూడా నమ్మకం లేదు" అంది సింధు దిగాలుగా.

"ఏం? ఎందుకు ఒప్పుకోరు?"

"ఒప్పుకోరేమో అనుకుంటున్నాను. ఎందుకంటే చిన్నప్పటినుంచీ నన్ను మా బావకిచ్చి చేద్దామనే అనుకుంటున్నారు. అది కాకపోయినా ఎప్పుడు ప్రేమ టాపిక్ వచ్చినా పిల్లలంతా సినిమాలు చూసి చెడిపోతున్నారని తిడుతూ ఉంటారు నాన్న"

"సరేలే ఇప్పుడే ఎందుకంత టెన్షన్ పడడం. ఇంకా టైముందని నువ్వే అన్నావుగా. అప్పటికి అన్నీ సర్దుకుంటాయిలే"

"ఒకవేళ, మన పెళ్ళికి ఇంట్లో ఒప్పుకోక పోతే? "

"బయటకు వచ్చేసి పెళ్ళి చేసుకుందాం. అయినా మా ఇంట్లో ఏం ప్రాబ్లం ఉండదు"

"మమ్మీని, డాడీని వదిలి నేనుండలేను"

"నన్నొదిలి ఉండగలవా? "

"ఏంటలా అంటావు? మమ్మీ, డాడీ కావాలి, నువ్వూ కావాలి"

"ఒకవేళ ఎవరో ఒకర్ని వదులుకోవాల్సిన పరిస్థితి వస్తే? "

"ఆ పరిస్థితి రాకూడదనే కోరుకుంటాను"

"ఒకవేళ వస్తే? "

"ఏమో... సమాధానం చెప్పలేను"

"అలా కాదు సింధూ. ఆ పరిస్థితి రాదనే అనుకుందాం. ఒకవేళ తప్పనిసరి పరిస్థితుల్లో ఈ సమస్య ఎదురైతే ఏం చేస్తావు? " ఎలాగైనా ఆమెనుంచి సమాధానం రాబట్టాలని స్ట్రెస్ చేస్తూ మరీ అడిగాడు రమేష్.

"ప్లీజ్ రమేష్... ఆ టాపిక్ వదిలెయ్" అంది సింధు. రమేష్ మౌనంగా వుండిపోయాడు. ఇంతలో చైతన్య వచ్చాడు.

★ ★ ★

సంధ్యాసమయం.

సాగరతీరం...

పైకెగసే అలల అలజడులు. గూళ్ళకేగే పక్షుల కిలకిలలు... మనసును మురిపించే పిల్లగాలి స్పర్శలు... ప్రేమికుల ఎదురుచూపులు... ఇవి ఏవీ కొత్తకాదు శ్రీనివాస్‌కి. అతనికి ఏకాంతంగా గడపాలని అనిపించినప్పుడల్లా ఇక్కడకు వస్తాడు. తన క్రియేటివిటీకి ఇక్కడే పదును పెడతాడు. అతను రాసిన కథలు, కవితలలో చాలావరకూ ఇక్కడ రాసినవే.

శ్రీనివాస్ ఇసుకలో పడుకొని ఆకాశంలోకి చూస్తూ ఆలోచిస్తున్నాడు. అతని ఆలోచనల్ని బ్రేక్ చేస్తూ వినిపించిందొక స్వరం.

"ఏయ్... శ్రీనివాస్"

ఆ స్వరం కూడా అతనికేమీ కొత్తకాదు. ఏ స్వరంకోసమైతే అతని చెవులు ఆశగా ఎదురుచూస్తాయో, ఏ స్వరంకోసమైతే అతని మనసు పరితపిస్తుందో, ఆ స్వరం వినిపించేసరికి మనసుకు ఏదో తెలియని తియ్యటి అనుభూతి. శ్రీనివాస్ ఆ స్వరం వినిపించిన వైపు చూశాడు.

అక్కడ బ్లాక్ టైట్‌ఫిట్ కాటన్‌జీన్, రెడ్ కలర్ మెగా హ్యాండ్స్ షార్టు టీ షర్టులో ఒక అమ్మాయి నిల్చొని వుంది. తెల్లని మేని ఛాయ, ఫ్రీగా వదిలేసిన జుట్టు, మత్తెక్కించే కళ్ళు, చిలిపితనం కలగలసిన నవ్వుతో దేవతలకు సైతం కళ్ళుకుట్టే విధంగా ఉంది. ఆమె పేరు సవిత.

"హాయ్ సవితా... ఏంటి ఇలా వచ్చావు? " ప్రశ్నించాడు శ్రీనివాస్.

"నీకోసం ఇంటికి వెళ్ళాను. ఇంకా కాలేజ్ నుంచి రాలేదన్నారు. టైం దాటిపోయినా నువ్వు ఇంటికి రాలేదంటే ఇక్కడే ఉంటావని ఊహించి ఇలా వచ్చాను. నువ్వేంటి ఒంటరిగా కూర్చొని ఆలోచించేస్తున్నావ్? " అడిగింది సవిత అతనిని ఆనుకొని కూర్చుంటూ.

"నీ గురించే ఆలోచిస్తున్నాను"

"నా గురించా? ఏంటి? " ఆశ్చర్యంగా ప్రశ్నించింది సవిత.

"నిన్ను ప్రేమించాలా? వద్దా అని"

సవితకు ఏం మాట్లాడాలో అర్థంకాలేదు. శ్రీనివాస్ మొహంలోకి చూసింది. అతని మొహంలో ఎటువంటి ఎక్స్‌ప్రెషనూ లేదు. అతను స్ట్రయిట్‌గా మాట్లాడతాడని తెలుసు కానీ తనగురించి అంత డైరెక్ట్‌గా చెప్పేసరికి కాస్త కంగారుపడింది.

"అందరూ ప్రేమంటే మనకు తెలియకుండానే పుడుతుందంటారు. నువ్వేంటి ఆలోచించి మరీ ప్రేమిస్తావా? "

"అవును. ప్రేమించేముందు రెండు విష





యాల గురించి ఆలోచించాలి"

"ఏంటవి? "

"మొదటిది కులం, రెండవది డబ్బు"

శ్రీనివాస్ మాటలకు సవితకు తెలియకుండానే కోపం వచ్చేసింది.

"నీకేమైనా పిచ్చా? వేటికైతే ప్రేమ అతీతం అంటారో వాటిగురించి నువ్వు ఆలోచిస్తానంటావేంటి? కులం, డబ్బు చూసి ప్రేమిస్తే అది ప్రేమకాదు వ్యామోహం అవుతుంది" ఆవేశంగా అంది సవిత.

"నీ ఇష్టం నువ్వు ఎలాగైనా అనుకో. కానీ నాకు సంబంధించినంతవరకూ నా అభిప్రాయం కరెక్టు. ప్రేమించడంకంటే ఆ ప్రేమను సుఖమయం చేసుకోవడం ముఖ్యం. ఇంట్లో తల్లిదండ్రులు ప్రేమవివాహాలు వద్దనడానికి ముఖ్యకారణం ఇద్దరి కులం ఒకటి కాకపోవడం. అలా అని తల్లిదండ్రులను వదులుకోవడం నావల్లకాదు. సో కులం చూసి ప్రేమిస్తే ఆ ప్రాబ్లమ్ తప్పుతుంది. రెండవది డబ్బు. నేను మిడిల్ క్లాస్‌వాణ్ణి. నేను నాకంటే పేద అమ్మాయిని చేసుకుంటే నేనూ కష్టపడాలి. ఆమె కూడా కష్టపడాలి. అదే కొద్దిగా డబ్బు ఉన్న అమ్మాయిని చేసుకుంటే నేను కష్టపడినా కనీసం ఆమె కష్టాన్నయినా తగ్గించగలుగుతాను" అన్నాడు శ్రీనివాస్.

"ప్చ్.. నేను నీమాట ఒప్పుకోను. ఇష్టపడిన వాడితో కలిసి కష్టపడినా మనసుకు ఆనందం కలుగుతుందే తప్ప బాధ కలుగదు. అప్పుడే ప్రేమంటే ఏమిటో తెలుస్తుంది. అంతేగానీ నువ్వు చెప్పినట్టు చేస్తే అది మనిషిని కాక కులాన్ని, డబ్బుని ప్రేమించినట్టవుతుంది"

"నువ్వు తప్పుగా అర్థం చేసుకున్నావు. నేను చెపుతున్నది కులం, డబ్బు చూసి ప్రేమించమని కాదు. ప్రేమించేటప్పుడు వాటిని చూడమని"

"ఏంటి రెండింటికీ తేడా? "

"చాలా ఉంది. మనం మనకు కాబోయే జీవిత భాగస్వామి గురించి ఎన్నో కలలు కంటాం. అందంగా ఉండాలని, పొడవుగా ఉండాలని ఏవో కొన్ని లక్షణాలను ఊహించుకుంటాం. అలాగే వీటిని కూడా అబ్జర్వ్ చేస్తే తప్పులేదని అంటున్నాను"

"అంటే ఒకవేళ ఆ అమ్మాయి నచ్చి వేరే కులం అయితే వదిలేస్తావా? "

"తప్పకుండా! నేను పెళ్ళిచూపుల్లో ఒక అమ్మాయిని చూశాననుకో, ఆమె నాకు బాగా నచ్చిందనుకో కానీ కట్నం విషయంలోనో లేక వేరే ఏదో విషయంలోనో తేడా వచ్చిందనుకో వేరే సంబంధంకోసం వెతుకుతామా లేమా? ఇదీ అంతే. ఒకవేళ ఆ అమ్మాయికి నా ప్రేమ విషయం చెప్పిన తరువాత ఆమె నేను కోరుకున్న లక్షణాలకు వ్యతిరేకంగా ఉందని తెలిస్తే తరువాత వచ్చే ఏ ప్రాబ్లమ్‌నైనా సాధ్యమైనంతవరకూ ఫేస్ చేయడానికి నేనూ సిద్ధమే"

"ఒకవేళ ఆ అమ్మాయి కూడా నీలానే ఆలోచిస్తే"

"ఖచ్చితంగా ఆలోచించదు. నా అభిప్రాయాన్ని ఇంతకాలం ఫ్రెండ్‌షిప్ చేసిన నువ్వే ఒప్పుకోలేదు. నువ్వూ ఆడదానివేగా. ఇలా ఆలోచించే అమ్మాయిలు ఉంటారంటావా? ఒకవేళ ఆలోచించినా కొన్ని ట్రిక్స్ ఉపయోగించి ఆమెను నావైపుకు తిప్పుకుంటాను. నేను ఆమెను ఇష్టపడ్డానంటే కులం గొడవ క్లియర్ అయినట్టే. ఇక పోతే డబ్బు. ఆమె డబ్బు ఉన్నదే కాబట్టి నా టాలెంట్‌తో ఆ డబ్బుని వృద్ధి చేయగలనని, ఆమెను సుఖపెట్టగలనని నమ్మకం కలిగిస్తాను"

"అంటే ఆ అమ్మాయిని మోసం చేస్తావా? "

"లేదు... నాకు ఆమెపై ఉన్న ప్రేమని ఆమె మనసుకి సూటిగా తాకేలా చేస్తాను. అలా ఆమె మైండ్‌ని ట్యూన్ చేస్తాను. ఒక ఉదాహరణ చెప్తాను విను. రష్యావాళ్ళు తల వెంట్రుకని నిలువుగా నాలుగు

భాగాలు చేశారట. జపాన్‌వాడు వాటిలో ఒక భాగానికి రంధ్రం చేశాడట. ఇండియా వాడు వచ్చి దానిపై 'మేడ్ ఇన్ ఇండియా' అని వేసుకున్నాడట. దీనినిబట్టి నీకేం అర్థం అయ్యింది? "

"ఇండియా వాళ్ళు పక్కదేశాలవాళ్ళు తయారుచేసిన వాటిని తమవిగా చెప్పుకుంటారని" అతను ఆ ప్రశ్న ఎందుకు అడిగాడో అర్థం కాకపోయినా జవాబు చెప్పింది సవిత.

"మనవాళ్ళు ఇతరులనుంచి కాపీ కొడతారని మన మనసులో బాగా నాటుకుపోయినందువల్ల అలా అనిపిస్తుంది. అయితే మెదడుకు పదును పెట్టే 'చదరంగం' వంటి ఆట పుట్టింది ఇక్కడే. గణితానికి మూలమైన 'సున్న'ని కనిపెట్టింది భారతీయుడే అని, అంకెలతో ఆటలాడుకుంటూ, కంప్యూటర్ల కంటే వేగంగా లెక్కలు చేయగల శ్రీనివాస రామానుజమ్, శకుంతలాదేవి వంటి మేధావులు భారతీయులే అని ఆలోచిస్తే ఆ వెంట్రుకపై మేడ్ ఇన్ ఇండియా అని రాయడం అన్నింటికంటే గొప్ప అని తెలుస్తుంది. అలాగే ముందుగా ఒక అమ్మాయికి నేను ఆమెను ప్రేమిస్తున్నానని తెలిస్తే నేను తరువాత ఏ పనిచేసినా అది ఆమె గురించే చేశాననే ఫీలింగ్ ఆమెకు తెలియకుండానే వచ్చేస్తుంది. కరెక్ట్‌గా ప్రయత్నిస్తే ఆ ఫీలింగ్‌నే ప్రేమగా మార్చొచ్చు"

"నువ్వు ప్రతిదానికీ ఏదో ఒక లాజిక్ చెప్పి ఒప్పించేస్తావు. అయినా నేను నీ అభిప్రాయాన్ని అంగీకరించను"

"సరేలే మన మధ్య వాదన ఎందుకు? నీ అభిప్రాయం నీది. నా అభిప్రాయం నాది. నా గురించి నీ అభిప్రాయం మార్చుకోవాల్సిన అవసరంలేదు"

"ఇంతకీ నన్ను ప్రేమించాలని డిసైడ్ చేశావా? లేక మానెయ్యాలనా? "

"ప్రేమించాలనే" వెంటనే అన్నాడు శ్రీనివాస్.

ఆ మాట వినగానే ఆమె మనసులో సంతోషం వెల్లివిరిసింది. అయినా ఎలాగైనా శ్రీనివాస్‌కి బుద్ధి చెప్పాలంటే తను బయటపడకూడదనుకొని మౌనంగా ఉండిపోయింది.

"నువ్వు నన్ను ప్రేమించకూడదనుకున్నా ఉండలేవు. నేను నీతోనే 'ఐ లవ్ యూ' అని చెప్పిస్తాను" అన్నాడు శ్రీనివాస్ ఆమె మనోభావాలను చదివినట్టుగా.

తన ఆలోచనలను అతను ఎలా కనిపెట్టగలిగాడు అని ఆశ్చర్యపోయింది సవిత. వెంటనే తేరుకొని, "సరే చూద్దాం" అంటూ అక్కడనుంచి వెళ్ళిపోయింది.

వెళుతున్న ఆమెను చూస్తూ మనసులోనే నవ్వుకున్నాడు శ్రీనివాస్.

★ ★ ★

"హాయ్ సింధు" అంటూ బస్‌స్టాప్‌లో ఉన్న సింధుని పలుకరించాడు రమేష్.

"హాయ్... చైతన్య ఏడి? " అడిగింది సింధు.

"వాడికి ఫీవర్‌గా ఉంది. అందుకే రాలేదు"

"నిన్న బాగానే ఉన్నాడుగా. సడన్‌గా జ్వరం ఏంటి? "

"వైరల్ ఫీవర్. రాత్రే వచ్చింది. అయినా వాడికేం? కావాలనుకుంటే హాయిగా ఇంటి దగ్గర ఉండిపోవచ్చు. నాలా కంపల్సరీగా కాలేజ్‌కి రావాల్సిన అవసరంలేదుగా"

"అదేం పాపం. నిన్ను మాత్రం ఎవరు రమ్మన్నారు. నువ్వు కూడా ఇంట్లో పడుకోవచ్చుగా"

"ఇంట్లో పడుకుంటే నిన్ను చూడడం కుదరదుగా"

"ఛ... మరీ ఎక్కువ చేస్తున్నట్టున్నావు. నన్ను చూడకుండా ఒక్కరోజు కూడా ఉండలేవా? మరీ జీవించొద్దు బాబూ"

"నీకు అలాగే ఉంటుందమ్మా. కానీ నా బాధ నాకు తెలుసు. సాయంత్రం ఇంటికి వెళ్ళిన దగ్గర్నుంచీ ఎప్పుడు చీకటి పడు

తుందా, ఎప్పుడు తెల్లవారుతుందా, ఎప్పుడు నిన్ను చూస్తానా అని ఉంటుంది తెలుసా"

"ఛ... నిజంగా?" దిక్కులు చూస్తూ అంది సింధు.

"ఏం చేసి నిన్ను నమ్మించగలను?" అంటూ నుదిటిపై చేయి పెట్టుకుని ఆలోచనలో పడ్డాడు రమేష్.

"వద్దు మహానుభావా! నన్ను నమ్మించడానికి నువ్వు ఎటువంటి సాహసాలూ చేయాల్సిన అవసరంలేదు. నేను నిన్ను నమ్ముతున్నాను" అంది సింధు.

ఇద్దరూ అలా మాట్లాడుకుంటుండగా ఒక వ్యక్తి వాళ్ళ దగ్గరకు వచ్చాడు.

"హలో... రమేష్. బాగున్నావా?" ప్రశ్నించాడా వ్యక్తి.

"హాయ్ రాజూ నువ్వా? ఏంటి చాలా కాలం తర్వాత కనిపించావు. ఎలా వున్నావు? ఏం చేస్తున్నావు?" ప్రశ్నించాడు రమేష్.

"కంప్యూటర్ ఫేకల్టీగా చేస్తున్నాను. నెలకు నాలుగువేలు ఇస్తున్నారు. ఏదో జీవితం వెళ్ళిపోతోంది. నువ్వేం చేస్తున్నావ్?"

"ఎమ్.ఎస్.సి." చెప్పాడు రమేష్.

"ఎవరు? ఫ్రెండా?" సింధుని చూస్తూ కాస్త వెటకారంగా ప్రశ్నించాడు రాజు.

పెద్దగా పరిచయంలేని వ్యక్తి. అతనికి అవసరంలేని విషయం అడిగేసరికి రమేష్‌కి కోపం వచ్చింది. అతను రమేష్‌ని ఇంటరాగేట్ చేస్తున్నట్టుగా అడిగిన పద్ధతి రమేష్‌లో కోపాన్ని ఇంకా పెంచింది.

"ఇప్పుడు నీకు అదంత అవసరమా?" సీరియస్‌గా ప్రశ్నించాడు రమేష్.

"ఎందుకంత కోపం. నేను కామన్‌గా అడిగాను, సీరియస్‌గా తీసుకోకు. సరేలే నే వస్తాను" అని అతను అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు.

"రమేష్... అతను నీకు క్లోజ్ ఫ్రెండా?" ప్రశ్నించింది సింధు.

"క్లోజ్ కాదు. ఏదో కొద్దిపాటి పరిచయం అంతే. ఏం ఎందుకు?"

"క్లోజ్ ఫ్రెండ్ కానప్పుడు అతను నన్ను ఫ్రెండా అని అడిగినపుడు అవునంటే సరిపోతుంది కదా. అనవసరంగా అతనిమీద ఎందుకు కోప్పడడం?" చాలా కూల్‌గా అంది సింధు.

"వాడికి అవసరంలేని విషయాలు ఎందుకు?" కాస్త సీరియస్‌గా అన్నాడు రమేష్.

"మన ఊరు పెద్ద పట్టణం కాదు. ఇక్కడ ఒక అమ్మాయి, ఒక అబ్బాయి మాట్లాడుకుంటే వాళ్ళు ఎవరు అన్నది తెలుసుకోవాలని అందరికీ ఉంటుంది. అలాగే అతనూ అడిగి ఉండొచ్చుకదా. అనవసరంగా అతన్నెందుకు బాధపెట్టడం. అదే మన క్లోజ్ ఫ్రెండ్ అయితే మన గురించి తెలుస్తుంది కాబట్టి ఈజీగా తీసుకుంటాడు"

"నువ్వెందుకు వాడిగురించి బాధపడతావు. వాడు ఈరోజు కనిపించాడు మళ్ళీ ఎప్పుడు కనిపిస్తాడో తెలియదు. అటువంటి వాడి గురించి ఆలోచించడమే అనవసరం" చాలా సీరియస్‌గా అన్నాడు రమేష్.

"నేను చెప్పేదీ అదే. ఎప్పుడో కనిపించే వాడిదగ్గర ఎందుకు చెడ్డపేరు అని" కూల్‌గానే చెప్పింది సింధు.

"ఇప్పుడేమంటావు? నేను తప్పుచేశాను. అంతేనా?" సీరియస్‌గా అడిగాడు రమేష్.

"నా ఉద్దేశం అదికాదు. సరేలే... ఆ టాపిక్ వదిలెయ్" అంది తల విదిలిస్తూ. రమేష్ ఏం మాట్లాడలేదు. అతని ముఖం ఇంకా సీరియస్‌గానే ఉంది.

ఇంతలో బస్ వచ్చింది. ఇద్దరూ బస్ ఎక్కారు. బస్ ఎక్కిన తరువాత కూడా చాలాసేపటివరకూ రమేష్ మౌనంగానే కూర్చున్నాడు.

"ఏంటి? మాట్లాడవా నాతో? కోపమా?" అతని మొహంలోకి చూస్తూ ప్రశ్నించింది సింధు.

"ఏంలేదు" ఆమెవైపు చూడకుండా ముక్త సరిగా సమాధానంచెప్పాడు.

"సారీ! బాబా... సారీ. నన్ను క్షమించు. ఇంకెప్పుడూ నీతో వాదించను సరేనా" అంది సింధు లెంపలు వేసుకుంటూ.

"అది కాదు. వాడెవడి గురించో మనమి ద్దరం..." ఇంకా అతనిమాటలు పూర్తికాక ముందే అడ్డుపడింది సింధు.

"మళ్ళీ ఆ టాపిక్ వద్దు. ఆ విషయం మరిచిపో. ప్లీజ్... నవ్వవా" అంది దిగా లుగా ముఖం పెడుతూ. ఆమె అడిగిన పద్ధ తికి ఆపుకుందామనుకున్నా నవ్వు ఆగలేదు రమేష్‌కి. శబ్దం రాకుండా చిన్నగా నవ్వాడు.

"హమ్మయ్య... ఇప్పుడు చూడగలుగు తున్నాం ఆ ఫేస్‌ని" అంది సింధు. ఆమె ఏమందో మొదట అర్థంకాలేదు రమేష్‌కి.

"ఏయ్ ఏంటి? కోపంగా ఉంటే అంత దరిద్రంగా ఉన్నానా నేను" నవ్వులోనే కోపాన్ని కలిపి ప్రశ్నించాడు రమేష్.

"సారీ... సారీ... సరదాగా అన్నాను" అంది సింధు.



"క్యాంటీన్‌లో మీటింగ్ పెట్టారేంటి? క్లాసులు లేవా?" క్యాంటీన్‌లో కూర్చుని ఉన్న శ్రీనివాస్, మహేష్, భానులను సమీ పిస్తూ ప్రశ్నించింది సింధు.

"ఫస్ట్ అవర్ లీజర్" చెప్పింది భాను.

"అయితే ఈ గంటసేపు సుత్తి కొట్టుకోవ డమేనా?"

"వండర్‌ఫుల్ ఐడియా. ఓ పనిచే ద్దామా?" చాలా ఉత్సాహంగా ప్రశ్నించింది భాను.

"ఏంటది" అంతే ఆత్రంగా ప్రశ్నించారు ముగ్గురూ.

"మార్నింగ్ షో సినిమాకి పోదామా?" అంది తన తెలివితేటలకు తనే మురిసి పోతూ.

"ఇదెలా ఉందంటే బొత్తం దొరికిందని కోటు కుట్టించుకున్నట్లు ఉంది. పదకొండు గంటలకు మన క్లాసు స్టార్ట్ అవుతుంది. సినిమా ఏమో పదకొండున్నరకి" అన్నాడు శ్రీనివాస్.

"ఏంటమ్మా మెదడు మోకాలులోకి వస్తోందా?" గట్టిగా నవ్వుతూ అన్నాడు మహేష్.

"ఆ... ఆల్‌రెడీ మోకాలులో ఉన్నవా ళ్ళతో తిరిగితే రాక ఏం చేస్తుంది" అంది భాను. మహేష్ వెంటనే నవ్వు ఆపేశాడు. ఇంతలో వాళ్ళ దగ్గరకు వచ్చింది సవిత.

"అందరూ మంచి హుషారుగా ఉన్నా రేంటి?" ప్రశ్నించింది సవిత.

"ఏముంది. భాను జోకులేసి నవ్విస్తోంది" అంది సింధు.

"మీకూ క్లాసులు లేవా?" సవితను ప్రశ్నిం చాడు మహేష్.

"వాళ్ళకా. ఆర్ట్సువాళ్ళు కదా. క్లాసుల్లో కంటే రోడ్లమీదే పని ఎక్కువ" అన్నాడు శ్రీనివాస్.

"జోకా! కితకితలు పెట్టుకున్నా నవ్వు రావడంలేదు" అంది సవిత శ్రీనివాస్ పక్కనే ఉన్న ఛైర్లో కూర్చుంటూ. వెంటనే శ్రీనివాస్ తను కూర్చున్నచోటునుంచి లేచి సరిగ్గా సవితకు ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చున్నాడు.





"ప్లేస్ ఎందుకు మారినట్టు?" అనుమానంగా ప్రశ్నించింది భాను.

"ఇక్కణ్ణుంచయితే సైట్ కొట్టడానికి బావుంటుందని" అన్నాడు శ్రీనివాస్. ఆ మాటలకు సవిత కంగారుపడింది.

"చైతన్య ఏడీ కనిపించడంలేదు" టాపిక్ డైవర్ట్ చేయడానికి ప్రయత్నిస్తూ అడిగింది సవిత.

"ఫీవర్‌గా ఉందట. కాలేజ్‌కి రాలేదు" చెప్పింది సింధు.

"మరి ఇంటికెళ్ళి చూసి వచ్చావా?" ప్రశ్నించాడు మహేష్.

"లేదు"

"అవునులే రమేష్‌ని చూడగానే అన్నీ మరిచిపోతావు. ఇక వాణ్ణి ఇంటికి వెళ్ళి చూడాలని మాత్రం ఎందుకు అనిపిస్తుంది"

"ఛీ... అదేంలేదు. నేను బస్‌స్టాప్‌కి వచ్చిన తరువాతే నాకు ఈ విషయం తెలిసింది. మళ్ళీ వెనక్కి ఏం వెళతాం అని వెళ్ళలేదు"

"అదేం కాదులే. మాకు తెలియదనుకుంటున్నావా? నువ్వు ఈమధ్య మా దగ్గర చాలా విషయాలు దాస్తున్నావు. అవునా?"

"నేనా! నేను మీ దగ్గర ఎందుకు దాస్తాను?"

"అబద్ధాలెందుకమ్మా? మళ్ళీ భానులాంటి ఆడపిల్లలు పుడతారు. తరువాత జీవితం అంతా నరకమే"

"ఓయ్... నన్నెందుకు మధ్యలోకి లాగుతావ్?" కాస్త కోపంగా అంది భాను.

"సారీ" అని చెప్పి "మాకు చెప్పకూడదనుకున్నావా?" అన్నాడు మహేష్ సింధువైపు తిరిగి.

"అటువంటిదేం లేదు. నేను మీ దగ్గర దాచింది ఒకే ఒక్క విషయం. అది కూడా నేను కావాలని దాచిపెట్టలేదు. ఎప్పటికప్పుడు చెపుదామనే అనుకొంటున్నాను. కాని టైమ్ కుదరటంలేదు. ఇప్పుడు ఎలాగూ ఆ టాపిక్ వచ్చింది కాబట్టి చెప్పేస్తా"

"సినిమాలో హీరోయిన్ ఎంట్రన్స్‌లో కాళ్ళు, చేతులు, చెవులు, ముక్కు చూపించి ఊరించి తరువాత మనిషి మొహం చూపిస్తారు చూడు అలా ఉంది. ముందు మేటర్‌లోకి రా తల్లీ" అన్నాడు మహేష్.

"ఆ... చెప్తున్నాను. నేను... నేను... రమేష్‌ని ప్రేమిస్తున్నాను. తన సైడ్‌నుంచి కూడా ఓ.కే." సిగ్గుపడుతూ చెప్పింది సింధు.

"ఇంట్రస్టింగ్. ముందు ఎవరు ప్రపోజ్ చేశారు? చెప్పు ప్లీజ్ ప్లీజ్" చాలా ఆత్రంగా అడిగింది భాను.

"తనే ప్రపోజ్ చేశాడు. రమేష్ బర్త్‌డేకి తను, నేను, చైతన్య కలిసి సినిమాకి వెళ్ళాం. అక్కడ చెప్పాడు. నేను వెంటనే ఓ.కె. చెప్పేశాను"

"కంగ్రాట్స్" అంటూ షేక్‌హ్యాండ్ ఇచ్చారు శ్రీనివాస్ తప్ప మిగిలినవాళ్ళంతా. సింధు, శ్రీనివాస్‌వైపు చూసింది. శ్రీనివాస్ మౌనంగా వీళ్ళందరినీ చూస్తున్నాడు.

"శ్రీనివాస్ నేనేమన్నా తప్పు చేశానా?" ప్రశ్నించింది సింధు. ఆమెకు తెలుసు శ్రీనివాస్ ఏ విషయంలోనూ ఎవ్వరినీ ఎంకరేజ్ చేయకుండా ఉండడు, అది చెడ్డ విషయం అయితే తప్ప.

"నా గురించి నీకు తెలుసు కాబట్టి స్ట్రయిట్‌గా అడిగేస్తున్నాను. తరువాత నువ్వు బాధ పడకూడదు"

"ఫరవాలేదు చెప్పు" అంది సింధు.

"రమేష్‌లో ఏం నచ్చి నువ్వు అతనిని ప్రేమించావు?"

ఆ ప్రశ్న వినగానే సింధుకి ఏం మాట్లాడాలో అర్థం కాలేదు. భాను, మహేష్‌లకు మాత్రం శ్రీనివాస్ అనవసరంగా ఈ ప్రశ్న అడుగుతున్నాడని అనిపించింది. సవిత సింధు సమాధానం కోసం ఎదురుచూస్తోంది. ఆమెకు శ్రీనివాస్‌పై అపారమైన నమ్మకం. అతను అలా అడిగాడంటే దానికి

తప్పకుండా ఏదో కారణం ఉంటుందని ఆమె నమ్మకం.

"ఏం నచ్చి..." అంటే ముందు తనే నాకు చెప్పాడు" అంది సింధు ఏం చెప్పాలో అర్థం కాక.

"ముందు అతను చెప్పాడు. నువ్వు కాదంటే అతను బాధ పడతాడు. అదే జాలితో నువ్వు ఒప్పుకున్నావు అంతేనా? "

సింధు ఆలోచనలో పడింది. "అవును... తను రమేష్‌లో ఏం చూసి ఇంత ఇంప్రెస్ అయ్యింది. రమేష్ తనతో సరదాగా మాట్లాడతాడు. అతని మాటల్లో తనపై అభిమానాన్ని చూపిస్తాడు. వీటిని చూసి తను రమేష్‌ని లవ్ చేశానంటే వీళ్ళు ఎలా రియాక్ట్ అవుతారు. అయినా ఒక మనిషిలో ఇంతకంటే అబ్జర్వ్ చెయ్యాల్సిన లక్షణాలు ఏం ఉంటాయి? "

"ఏం శ్రీనివాస్? రమేష్ మంచివాడు కాదా? " ఆలోచనల్లోంచి బయటకు వస్తూ దీనంగా ప్రశ్నించింది సింధు.

"ఇక్కడ మంచి, చెడు సమస్య కాదు. ఎవరి ప్రవర్తన వారికి కరెక్టుగానే అనిపిస్తుంది. కానీ మనం ఎదుటివాళ్ళ ప్రవర్తనకు సర్దుకుపోగలమా లేదా అన్నదే సమస్య. ఏ మాట మాట్లాడినా ఎదుటివారు బాధ పడకూడదని ఆలోచించి మరీ మాట్లాడే స్వభావం నీది. కానీ రమేష్ స్వభావం పూర్తిగా నీకు విరుద్ధమైనది. ఏదయినా మొహంమీదే చెప్పేస్తాడు. తొందరగా కోపం వచ్చేస్తుంది, తను అనుకున్న పని ఎలాగయినా జరిగి తీరాలనే మొండి పట్టుదల ఉన్నవాడు. ఇవేమీ చెడు లక్షణాలు కాదు. కానీ అతని స్వభావం నీకు సరిపడుతుందా అన్నదే నా అనుమానం" అన్నాడు శ్రీనివాస్.

శ్రీనివాస్ మాట్లాడటం పూర్తయిన తరువాత ఎవరూ పెదవి విప్పలేదు. అందరూ మౌనంగా ఆలోచిస్తున్నారు. శ్రీనివాస్ చెప్పింది హండ్రెడ్ పర్సంట్ కరెక్ట్. మరి ఇప్పుడు సింధు ఏం చెయ్యాలి? రమేష్‌ని మరిచిపోవటమా లేక ఇక ఈ జీవితానికి అతనే తోడు అనుకొని అడ్జస్ట్ అయిపోవటమా? సింధుతో సహా అందరి మనసులోనూ అదే ఆలోచన.

అక్కడ వాతావరణం అంతా చాలా భారంగా తయారయ్యింది. ఎవరూ ఎవ్వరితోనూ మాట్లాడటంలేదు. ఒకవైపు ఆలోచిస్తున్నా అందరూ సింధు ఏం సమాధానం చెపుతుందా అని ఎదురుచూస్తున్నారు.

"సారీ సింధూ. నా మాటలవల్ల నీ మనసు బాధపడితే అయామ్ రియల్లీ వెరీ సారీ. కానీ ఆలోచించు" అని అక్కడనుంచి లేచి బయటకు వచ్చేశాడు. సవిత కూడా అతని వెనుకే వచ్చింది.

"సవితా... నా అభిప్రాయం తప్పంటావా? " ప్రశ్నించాడు శ్రీనివాస్ సవితని.

"నువ్వు మాట్లాడింది తప్పు కాదు. కానీ తను ఓ.కె. చెప్పేసిన తరువాత చెప్పడం మంచిదేనా అని నా అనుమానం"

"అంటే ఐ లవ్ యు అని చెప్పేసింది కాబట్టి చచ్చినట్టు ఎడ్జస్ట్ అవ్వాల్సిందేనా? ఈ కాంప్రమైజేషనే ఎన్నో జీవితాలను నాశనం చేసేస్తోంది. ఇవన్నీ ప్రేమించే ముందే ఆలోచించాలి. సరదాగా కబుర్లు చెప్పుకొని, ఆ కబుర్లు చెప్పుకున్నంతసేపు హాయిగా నవ్వుకుని ఆ ఆనందంలోనే ఇష్టాన్ని ఏర్పరుచుకొని, ఆ ఇష్టాన్నే ప్రేమ అనేసుకుంటే ఎలా? ఏదో ఒక గంట సరదాగా కలిసి నవ్వుకున్నంత మాత్రాన జీవితం అంతా అంతే సరదాగా గడిచిపోతుందనుకుంటే ఎలా? ఎవరితోనయినా రోజుకి ఒకసారి కలుస్తూ ఉండటానికి, రోజులో ఇరవైనాలుగు గంటలూ కలిసి బతకటానికి చాలా తేడా ఉంది.

ఎప్పుడయితే ప్రతి నిమిషం కలిసి ఉన్నారో ఒకరిలో లోపాలు మరొకరికి తెలుస్తాయి. అవి నెమ్మదిగా పెరిగి పెరిగి ఒకరిని చూస్తే మరొకరికి అసహ్యం కలిగేస్థా

యికి వస్తాయి. దానితో జీవితమే నరకంగా మారిపోతుంది. ముందు నుండే ఇద్దరి స్వభావం, అభిరుచులు ఒక్కటే అయినా పెళ్ళయిన తరువాత అభిప్రాయభేదాలు వస్తూ ఉంటాయి. అటువంటప్పుడు ఇద్దరు విరుద్ధ స్వభావాలు కలిగిన వ్యక్తులు ఎలా కలిసి బతకగలరు. వారి ప్రేమ ఎంత గొప్పదయినా అది కొంతవరకే వారిని కలిపి ఉంచగలుగుతుంది.

"మరి ఇప్పుడు సింధు ఏం చెయ్యాలి?"

"ఫ్యూచర్‌లో వీళ్ళిద్దరూ కనుక విడిపోతే అందుకు నేనే బాధ్యుణ్ణి అవుతాను. ఎందు కంటే ఇప్పుడు సింధు రమేష్ గురించి ఆలో చించటం మొదలు పెడుతుంది. కాబట్టి ఇప్పుడు రమేష్‌లో తన స్వభావానికి విరు ద్ధంగా ఉన్న లక్షణాలు సింధుకి తెలు స్తాయి. వాటికి సర్దుకుపోగలనా లేదా అని ఆలోచిస్తుంది. సర్దుకుపోగలను అనుకుంటే పెళ్లికి సిద్ధమవుతుంది. లేదంటే ఇప్పుడే ప్రేమకు బ్రేక్ పడుతుంది"

"ఇప్పుడు రమేష్‌తో సింధు 'నేను నిన్ను పెళ్ళి చేసుకోను' అని చెప్పటం ఎంతవరకు కరెక్టు. రమేష్ గురించి కూడా ఆలోచించాలి కదా. అసలే అతనికి ఆవేశం ఎక్కువ అని నువ్వే చెప్పావు. అటువంటప్పుడు అతని రియాక్షన్ ఏమయినా దారుణంగా ఉంటే?"

"తొందరపడి జీవితాంతం కష్టాలు పడటం కంటే, ఇప్పుడు కొద్దిగా బాధపడినా జీవి తాంతం సుఖంగా ఉండటం మంచిదికదా"

"అవును: నువ్వు చెప్పింది కరెక్ట్. నువ్వు చాలా బ్రాడ్‌గా ఆలోచిస్తావే. రియల్లీ యు ఆర్ గ్రేట్. అందుకే నువ్వంటే నాకిష్టం"

"అంటే నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా?"

"నిన్నా! ఛీ... నిన్నెవడు ప్రేమిస్తాడు?" అని అతనివైపు చూడకుండా అక్కడ నుండి వెళ్ళిపోయింది.

"ఓయ్... చూసుకో. నువ్వు నా వెనకాల తిరిగేలా చేస్తాను. చూసుకో" గట్టిగా అరి చాడు శ్రీనివాస్.

"అంత సీన్ లేదులే..." అంది ఆమె వెన క్కితిరిగి చూడకుండానే.

శ్రీనివాస్ అలా ఆమెనే చూస్తూ ఉండిపో యాడు.

★ ★ ★

ఫోన్ రింగ్ అవుతుండటంతో రిసీవర్ అందుకున్నాడు శ్రీనివాస్.

"హలో..."

"హాయ్... నిద్ర లేచావా?" అటువైపు నుంచి ప్రశ్నించింది సవిత.

"నువ్వు నిద్రమొహంతో ఫోన్ చేశావా? టైమెంతయ్యిందో చూడు" అన్నాడు శ్రీని వాస్.

"టైమెంతయ్యిందో మాకు తెలుసు సార్. కానీ తమరు అంత తొందరగా మంచం దిగరుకదా. అందుకే అడిగాను"

"నీకున్న అలవాట్లే అందరికీ ఉంటాయను కుంటే ఎలా?"

"సరేలే... ఇంతకీ ఏం చేస్తున్నావు?"

"డ్రస్‌అప్ అవుతున్నాను"

"కాలేజ్‌కి బయలుదేరుతున్నావా?"

"కాలేజ్‌కి కాదు. సినిమాకి వెళుతున్నాను"

"ఎగ్జామ్ పెట్టుకొని సినిమాకేంటి? నీకే మయినా బుద్ధుందా?"

"ఇంటర్నల్ ఎగ్జామ్స్ కదా. రాయకపో యినా నష్టంలేదు. కానీ చిరంజీవి సినిమా మొదటిరోజు మొదటి షో చూడకపోతే మాత్రం వేస్ట్"

"ఏం చూస్తావు సినిమాలు. అన్నీ ఒకటే స్టోరీ. బోర్ కొట్టడం లేదూ. సినిమా మానేసి కాలేజీకి రా"

"కాలేజీకి వచ్చి మాత్రం చేసేదేముంది. ఎప్పుడూ మీ మొహాల్నే చూసి చూసి బోర్ కొట్టేసింది. ఈరోజు మా మెగాస్టార్ స్టైల్ చూసి రావాలి"

"నోరు మూసుకొని కాలేజీకి రా! సినిమా సన్‌డే చూద్దువుగాని"

"అది కాదు సవితా" అంటూ ఏదో చెప్ప బోయాడు.

"ఏదీ కాదు. నువ్వు కాలేజ్‌కి రావాలి అంతే" అంది సవిత.

"సారీ ఈ ఒక్క విషయంలో మాత్రం నా నిర్ణయం మారదు" ఖచ్చితంగా చెప్పేశాడు శ్రీనివాస్.

"ఇదిగో... చివరిసారిగా చెపుతున్నాను. నువ్వు సినిమాకి వెళ్ళొద్దు. వెళితే అంతే..." అని ఫోన్ పెట్టేసింది సవిత. శ్రీనివాస్ చిన్నగా నవ్వుకొని ఫోన్ పెట్టేశాడు. తరువాత తల దువ్వుకొని బయటకు వచ్చాడు.

"మమ్మీ బయటకు వెళ్తున్నా"

"ఎక్కడికి? " ప్రశ్నించింది శ్రీనివాస్ తల్లి పుష్ప.

"సినిమాకి"

"మరి కాలేజీకి వెళ్ళవా? "

"లేదు. ఈరోజు పిక్చర్ రిలీజ్ కదా వెళ్ళాలి"

"ఒరేయ్..." అంటూ పిలవబోయింది పుష్ప. కానీ శ్రీనివాస్ ఆమె కేకకు అంద లేదు. శ్రీనివాస్ బయటకు వచ్చి బైక్ స్టార్ట్ చేస్తుండగా అతని ఫ్రెండ్ రవి వచ్చాడు.

"ఏరా టికెట్స్ ఏవి? " ప్రశ్నించాడు శ్రీనివాస్.

"నేను రాననుకొని వేరే ఎవరికో ఇచ్చేశాడట" చెప్పాడు రవి.

"అదేంటి. నువ్వు థియేటర్ దగ్గరకు ఎన్ని గంటలకు వెళ్ళావు"

"ఎనిమిది"

"నేను ఏడు గంటలకి వెళ్ళమంటే నువ్వు ఎనిమిది గంటలకి వెళ్ళటం ఏమిటి? అసలు టికెట్స్ నిన్ను తెమ్మని చెప్పటమే పెద్ద తప్పు"

"నేను లేచేసరికే ఎనిమిదయ్యింది. మొహం కూడా కడుక్కోకుండా థియేటర్ దగ్గరకు వెళ్ళాను తెలుసా? " అన్నాడు రవి ఏదో ఘనకార్యం చేసినట్టు ఫీల్ అవుతూ.

"అఘోరించావులే. ముందు వెళ్ళి మొహం కడుక్కొని కాలేజీకి రా" అని బైక్ స్టాండ్ వేసి ఇంట్లోకి వెళ్ళి బుక్ తెచ్చుకొని కాలేజీకి బయలుదేరాడు.

కాలేజ్‌కి వచ్చి బైక్‌ని పార్క్ చేసి క్లాసుకి వెళ్తుంటే సవిత ఎదురువచ్చింది.

"ఏం సినిమాకి వెళ్ళలేదా" ప్రశ్నించింది సవిత.

"నువ్వు వెళ్ళొద్దన్నావుగా" ఆమె కళ్ళలోకి చూస్తూ చెప్పాడు శ్రీనివాస్.

"నిజంగా నా మాటకి అంత విలువ ఇస్తావా నువ్వు"

"నేను విలువ ఇచ్చేది నీ ఒక్కదాని మాటలకే"

ఆ మాటలు ఆమె హృదయానికి సూటిగా తాకాయి.

"నమ్మొచ్చా? " అనుమానంగా ప్రశ్నించింది సవిత.

"అది నీ నమ్మకంమీద ఆధారపడి ఉంటుంది" అని చెప్పి చకచక క్లాసు రూమ్‌లోకి వెళ్ళిపోయాడు.

అతని మాటలకు ఆమె పూర్తిగా కరిగిపోయింది. అతనిపై ఆమెకు ఉన్న ప్రేమ అతను తనను మాటలతో మోసం చేస్తున్నాడేమోనన్న ఆలోచన రాకుండా కట్టిపడేసింది. 'ఐ లవ్ యు' శ్రీనివాస్ అనుకుంది మనసులోనే.

★ ★ ★

క్లాసులు పూర్తయిన తరువాత శ్రీనివాస్, మహేష్, చైతన్య, భాను బస్‌స్టాప్‌లో చెట్టు కింద కూర్చొని కబుర్లు ప్రారంభించారు.

"ఈరోజు సింధు రాలేదేంటి" ప్రశ్నించాడు శ్రీనివాస్.

"వాళ్ళ మమ్మీ, డాడీతో కలిసి ఊరు వెళ్ళింది. రేపు కాలేజీకి వచ్చేస్తుంది" చెప్పాడు చైతన్య.

"అంతేనా? " కాస్త అనుమానంగా అన్నాడు శ్రీనివాస్. అతను అలా ఎందుకు అన్నాడో మహేష్, భానులకు అర్థం అయింది.

"అంతేనా ఏంటి? నువ్వేమనుకొన్నావు" శ్రీనివాస్ అలా ఎందుకు అన్నాడో అర్థంకాక

ప్రశ్నించాడు చైతన్య.

"ఏంలేదు. అయినా నీకు నిన్న అంత సడన్‌గా జ్వరం ఎలా వచ్చేసింది" మాట మారుస్తూ ప్రశ్నించాడు శ్రీనివాస్.

"జ్వరమా? పాడా? నిన్న ఊరునుండి మా మరదలు వచ్చింది. మామూలుగా క్లాసు మానేశాననుకో తన గురించే అని ఇంట్లో అనుమానం వచ్చేస్తుంది. అందుకే ఉల్లిపాయ జ్వరం. నిన్నంతా హ్యాపీగా టైమ్ పాస్ అయిపోయింది" అన్నాడు చైతన్య.

"అబ్బో నీలోనూ చాలా టాలెంట్ ఉందే. ఇంతకీ ఏంటి... లవ్వా? " ప్రశ్నించింది భాను.

"ఛీ... అలాంటి చెత్తపనులు చేయం మనం. జస్ట్ టైం పాస్"

"ఓరి దుర్మార్గుడా. నీకు అసలు బుద్ధుందా. ఒక అమ్మాయి మనసుతో ఆటలు ఆడుకుంటున్నావా. పుట్టగతులు లేకుండా పోతావు" అంటూ శాపనార్థాలు పెట్టటం ప్రారంభించింది భాను.

"హలో... భాను మేడమ్ తమరు కాస్త తగ్గుతారా. ఏంటి... మనసు... ఆటలు అని సినిమా భాష మాట్లాడుతున్నావు. ఆ అమ్మాయి గురించి నీకేం తెలుసు. నాకంటే పెద్ద జాదూ ఆమె. హైదరాబాద్ వెళ్లిం దంటే రోజుకి ఒకడి బైక్‌మీద తిరుగుతూ ఉంటుంది తెలుసా? " కాస్త గట్టిగా అన్నాడు చైతన్య.

"ఇంక భాను సైలెంట్ అయిపోయింది. వీళ్ళు ఇలా మాట్లాడుకుంటుండగా సవిత వచ్చింది. సవిత దూరం నుంచే శ్రీనివాస్‌ని చూసి చిన్నగా నవ్వి వెంటనే ఫేస్ సీరియ స్‌గా మార్చేసి వచ్చి వాళ్ళ దగ్గర కూర్చొంది.

"సవితా... నువ్వు ఈమధ్య ఎక్కువగా మా గ్యాంగ్‌తో కలుస్తున్నావేంటి" చేతితో గడ్డాన్ని రాసుకుంటూ అనుమానంగా అడి గాడు మహేష్.

"అంటే మీ దగ్గరకు రావద్దని ఇన్‌డైరె క్ట్‌గా చెపుతున్నావా? " ఏమాత్రం తడుము కోకుండా అడిగింది సవిత.

"ఆహా... అలా అని కాదు. ఇంతకు ముందు కంటే ఎక్కువగా వస్తున్నావుకదా అని"

"అప్పుడంటే క్లాసెస్ ఎక్కువసేపు జరి గేవి. అందుకు కలవటం కుదిరేది కాదు. ఇప్పుడు పెద్దగా క్లాసులు జరగటంలేదు. అందుకనే వస్తున్నాను"

"అంతేనా... నేనింకా ఎవరిమీదయినా స్పెషల్ ఇంటరెస్ట్‌తో వస్తున్నావేమోనని అనుకొన్నాను"

"స్పెషల్ ఇంటరెస్ట్ ఏంటి. నాకు మీరం దరూ ఒకటే..."

"ఓహో... ఒకటేనా! శ్రీనివాస్... నువ్వు ఉదయం సినిమాకి వెళ్తానన్నావు. ఎందుకు వెళ్ళలేదురా? " ప్రశ్నించాడు మహేష్.

"ఎందుకు వెళ్ళలేదు అంటే... సవిత వెళ్ళొద్దంది" చెప్పాడు శ్రీనివాస్ క్రీగంట సవి తను చూస్తూ. అప్పుడు అర్థమయింది. ఆమెకు ఇదంతా శ్రీనివాస్ చేయిస్తున్నాడని. దాంతో ఆమె మొహం ఎర్రగా అయిపో యింది. కోపంగా శ్రీనివాస్‌వైపు చూసింది. శ్రీనివాస్ వెంటనే మొహం తిప్పేసుకుని ఎటో చూస్తున్నట్టు నటించాడు.

"ఏంటో నీ మీద సబితకు అంత స్పెషల్ కేర్"

"ఏమో నాకేం తెలుసు. తననే అడగండి" అన్నాడు శ్రీనివాస్ అమాయకంగా మొహం పెట్టి.

"స్పెషల్ కేర్ ఏం కాదు. ఆ ప్లేస్‌లో నా ఫ్రెండ్స్ ఎవరున్నా అలాగే చెప్పేదాన్ని" కాస్త కోపంగా అంది సవిత.

"అంతేనా... లేక ఇంకా ఏమయినా..." అంటూ ఆగిపోయాడు మహేష్.

"నన్ను ఇక్కడ ఉండమంటారా? వెళ్ళిపొమ్మంటారా? " ఆవేశంగా ప్రశ్నించింది సవిత. ఊహించని పరిణామానికి మహేష్ కంగారు పడిపోయాడు.



"ఏయ్... సవితా ఎందుకంత కోపం? నేను సరదాగా అన్నాను కూర్చో" అన్నాడు మహేష్! సవిత సీరియస్‌గా శ్రీనివాస్‌వైపు చూసింది.

"ప్లీజ్... క్షమించు" అన్నట్టు జాలిగా మొహం పెట్టాడు శ్రీనివాస్. అతని ఫేస్ ఎక్స్‌ప్రెషన్స్ చూసి సవిత ఒక్కసారిగా నవ్వేసింది. ఇంతలో చైతన్య దూరంగా కని పిస్తున్న ఒక వ్యక్తివైపు తదేకంగా చూస్తు న్నాడు.

"చైతన్యా... ఏంటి అలా చూస్తున్నావ్" ప్రశ్నించాడు శ్రీనివాస్.

"వాడు యశ్వంత్‌కదూ. మనవైపే వస్తు న్నట్టున్నాడు" అన్నాడు చైతన్య.

"అవును... అయితే ఏంటి? "

"వీడు నాకు పెద్ద తలనొప్పిలా తయార య్యాడు. వీడు, అన్నయ్య ఎదురయితే ఎప్పుడు ఏ గొడవ జరుగుతుందోనని భయంగా ఉంటుంది"

"అవును... ఇంతకీ మీ అన్నయ్యకి, వీడికి ఎందుకు గొడవ? "

"సిల్లీ రీజన్‌రా బాబూ. ఒకరోజు ఆ యశ్వంత్ క్లాసులో సిగరెట్ తాగుతున్నా డంట. అప్పుడు క్లాస్‌లో ఎవ్వరికీ రాని ఆవేశం మా వాడికి వచ్చింది. దాంతో వెళ్ళి ప్రిన్సిపాల్‌కి కంప్లైంట్ చేశాడు. వాడు ఎమ్.ఎల్.ఏ. కొడుకు, వాణ్ణి ప్రిన్సిపాల్ మాత్రం ఏం చేయగలడు? మరీ బావుండ దని క్లాసులో చిన్న వార్నింగ్ ఇచ్చి వదిలే శాడు. ప్రిన్సిపాల్ వెళ్ళగానే అన్నయ్యను యశ్వంత్ కొట్టబోయాడు. మావాడు కూడా తిరగబడ్డాడు. లెక్చరర్స్ వచ్చి ఆపారు. ఆరోజు నుంచి ప్రతీరోజు నాకు టెన్షనే"

"రమేష్ చేసింది కరక్టేకదా" అంది భాను.

"కరక్ట్ కావచ్చు అయినా మనకెందుకు ఈ గొడవలన్నీ. వీడొక్కడే ఏమీ ఉద్ధరించ లేడుకదా. పైగా పొలిటికల్ ఇన్‌ఫ్లుయెన్స్ ఉన్నవాడు యశ్వంత్. వాడితో గొడవలెం దుకు? అంతవరకు ఎందుకు ఆ యశ్వంత్ గాడి బాడీ చూశావా. వాడు గట్టిగా కొట్టా డంటే మా వాడు కోమాలోకి వెళ్ళిపోతాడు"

"ఎవడికి వాడు నేనొక్కడినే ఏమీ ఉద్ధరిం చలేను అనుకుంటూ కూర్చుంటే మార్పు ఎలా వస్తుంది. ఎవరో ఒకరు ఇనీషియేటివ్ తీసుకోవాలికదా" అంది భాను.

"మన వెనుక ఏమయినా ఉంటే ఎన్ని పనులయినా చెయ్యొచ్చు ఏమీ లేనప్పుడు కాస్త సైలెంట్‌గా ఉండటం మంచిది కదా"

అతనికి సమాధానంగా భాను ఏదో చెప్ప బోయింది. కానీ వాళ్ళ దగ్గరికి యశ్వంత్ వచ్చేసరికి తన ప్రయత్నం విరమించు కొంది.

"రమేష్ ఎక్కడ? " చైతన్యను ప్రశ్నించాడు యశ్వంత్.

"ఎందుకు? "

"చిన్నపనుంది. ఎక్కడ? "

"లైబ్రరీలో ఉన్నాడు ఎందుకు? " కంగారు పడుతూ ప్రశ్నించాడు చైతన్య.

"ఎందుకు చైతన్యా అంత కంగారుపడ తావు. గొడవేం కాదులే. మామూలు విష యమే" అని వాళ్ళ దగ్గరనుంచి కాలేజీ వైపుకి బయలుదేరాడు. కాలేజీ గేటు దగ్గర రమేష్ ఎదురయ్యాడు.

ఇక్కడ చైతన్యకు మాత్రం చాలా భయంగా ఉంది.

"గొడవేమయినా జరుగుతుందేమో! మనం కూడా వాళ్ళ దగ్గరకు వెళదామా? " శ్రీనివా స్‌ని ప్రశ్నించాడు చైతన్య.

"ముందే వెళితే బాగోదు. ఏం జరుగు తుందో చూద్దాం. నువ్వు కంగారుపడకు" అన్నాడు శ్రీనివాస్.

★ ★ ★

"హాయ్... రమేష్! ఫైనల్ ఎగ్జామ్స్‌కి ఇప్పట్నించీ ప్రిపరేషనా? " కాస్త ఎగతాళిగా ప్రశ్నించాడు యశ్వంత్.

"యశ్వంత్‌ని చూడగానే రమేష్‌కి కోపం పొంగుకొస్తోంది. అయినా బలవంతంగా కోపాన్ని అణచుకోవటానికి ప్రయత్నిస్తు




న్నాడు. యశ్వంత్ మాటలకు ఏం సమాధానం చెప్పకుండా యశ్వంత్‌వైపు సీరియస్‌గా చూస్తూ ఉండిపోయాడు.

"ఆ చూపేంట్రా? భయపెడదామనుకొంటున్నావా? అవునురా... ఈమధ్య క్రికెట్ ఆడుతున్నట్టు కనిపించటంలేదు. క్రికెట్ ఆడటం మానేశావా? "

"క్రికెట్ ఆడటం నేను ఎప్పుడూ మానను. నీ టీమ్‌ని ఎప్పుడూ ఓడించటం కోసమయినా నేను క్రికెట్ ఆడతాను" చాలా కసిగా అన్నాడు రమేష్.

"ఊ... ఆ విషయం నాకు తెలుసు. అందుకే నీకో విషయం చెప్పటానికి వచ్చాను. నెక్స్ట్‌మంత్‌లో ఇంటర్ యూనివర్సిటీ క్రికెట్ టోర్నమెంట్ ఉంది. దానికి మన కాలేజీనుంచి ఒక్క టీమ్ మాత్రమే వెళ్ళాలి" ఇంకా యశ్వంత్ మాటలు పూర్తికాకముందే రమేష్ అతని మాటలకు అడ్డు తగిలాడు.

"మన గొడవలు మన కాలేజీకే పరిమితం. మన టీమ్స్ కలిసి మంచి టీమ్ ఫామ్ అయితే బావుంటుంది. ఈ విషయంలో నాకేం అభ్యంతరం లేదు"

"ఛ.. నీలా కాంప్రమైజ్ అయిపోవటానికి నేను నీ అంత పిరికివాణ్ణి కాదు. ఈ టోర్నమెంట్‌కి నా టీమ్‌తో వెళ్తున్నాం. నీ టీమ్ రావటానికి వీల్లేదు. అలా కాదు, కూడదు అని ప్రిన్సిపాల్ దగ్గరకు వెళ్తే మళ్ళీ క్రికెట్ ఆడటానికి మీరు ఉండరు" అని చెప్పి రమేష్ జవాబుకోసం ఎదురుచూడకుండా అక్కడనుండి వెళ్ళిపోయాడు.

రమేష్ మనసులోనే యశ్వంత్‌ని తిట్టుకుంటూ శ్రీనివాస్ వాళ్ళ దగ్గరికి వచ్చాడు.

"మళ్ళీ ఏంటి వాడితో గొడవ? " ప్రశ్నించాడు చైతన్య. రమేష్ జరిగినదంతా వివరించి చెప్పాడు.

"ఏం చేస్తారు? టోర్నమెంట్‌కి వెళ్ళటం మానేస్తారా? " మళ్ళీ ప్రశ్నించాడు చైతన్య.

"ఎందుకు మానాలి? వాడేదో బెదిరించాడని మనం బెదిరిపోవాలా? రేపే ప్రిన్సిపాల్ దగ్గరకు వెళ్ళి మా టీమ్ టోర్నమెంట్‌కి వెళ్తుందని చెప్పేస్తాను"

"అనవసరంగా వాడితో గొడవలు ఎందుకురా? మానెయ్యొచ్చుగా" అన్నాడు చైతన్య.

"అనవసరం ఏంటి? నేనేమయినా వాడిని పిలిచి మరీ గొడవ పెట్టుకుంటున్నానా? వాడే పదే...పదే నామీద గొడవకు వస్తున్నాడు. దానిని చూస్తూ పిరికివాడిలా వెనక్కి పారిపోవాలా? "

"అదికాదు..." అంటూ చైతన్య సర్దిచెప్పబోయాడు. కానీ రమేష్ చైతన్య మాట పట్టించుకోలేదు.

"ఇక ఆర్గ్యుమెంట్స్ వద్దు. బస్ వస్తోంది. ముందు బయలుదేరు" అన్నాడు రమేష్.

★ ★ ★

శ్రీనివాస్ మంచి నిద్రలో ఉండగా ఫోన్ రింగ్ అయ్యింది. బద్ధకంగా కళ్ళు తెరచి టైమ్ చూశాడు. గడియారం పదకొండు గంటలు అయినట్టు సూచిస్తోంది. ఇంత రాత్రివేళ ఎవరు ఫోన్ చేసుంటారా అనుకుంటూ రిసీవర్ ఎత్తాడు.

"హలో..." అన్నాడు శ్రీనివాస్.

"హలో శ్రీనివాస్... నేను సింధుని" అటువైపునుంచి చెప్పింది సింధు.

"సింధూ... నువ్వా? ఏంటి ఈ టైమ్‌లో" ఆశ్చర్యంగా అడిగాడు శ్రీనివాస్.

"సారీ... డిస్టర్బ్ చేశానా? "

"ప్రతీ విషయానికీ సారీ. ఫ్రెండ్స్ మధ్య కూడా ఏంటి ఈ ఫార్మాలిటీస్. ఎప్పుడూ ఈ టైమ్‌లో ఫోన్ చేయవుకదా అని అలా అడిగాను"

"నిన్న నువ్వు చెప్పిన దగ్గరనుంచి ఆ విషయం గురించే ఆలోచిస్తున్నాను. నిద్ర పట్టక నీకు ఫోన్ చేశాను"

"అనవసరంగా నీ మనసును గజిబిజి చేసినట్టున్నానుకదా"

"లేదు. నేను ఆలోచించేలా చేశావు. ఇప్పుడు ఆలోచిస్తుంటే నువ్వు చెప్పింది

కూడా నిజమేననిపిస్తోంది... ఇప్పుడు నేనేం చెయ్యాలి? "

"ఒకరు తీసుకున్న నిర్ణయాన్ని విమర్శించటం చాలా తేలిక. కానీ దానికి రెక్టిఫికేషన్ చెప్పటం చాలా కష్టం. ఇప్పుడు ఆలోచించి నిర్ణయం తీసుకోవాల్సిన బాధ్యత పూర్తిగా నీదే. ఎందుకంటే... నువ్వు ఎంత వరకూ అతని ప్రవర్తనకు అడ్జస్ట్ కాగలవు? నీ ఇంటి పరిస్థితులు ఏమిటి? వాళ్ళింటి పరిస్థితులు ఏమిటి? అన్నది నీకే పూర్తిగా తెలుస్తుంది కాబట్టి"

"ఇంటి పరిస్థితులు అంటే గుర్తుకు వచ్చింది. మొన్న ఒకరోజు రమేష్ నన్నొక ప్రశ్న వేశాడు. తనా లేక తల్లిదండ్రులా అని తేల్చుకోవాల్సిన పరిస్థితి వస్తే ఏం చేస్తావు? అని అడిగాడు. అప్పుడు తను ఫీల్ అవుతాడని చెప్పలేకపోయాను. నిజంగా అదే సిట్యుయేషన్ వస్తే నేను తనని వదులుకోవటానికే సిద్ధపడతాను. ఎందుకంటే నేను అమ్మా, నాన్నను వదిలి ఉండలేను. నీకు తెలుసుగా మాది కంబైన్డ్ ఫ్యామిలీ. ఇంట్లో ఇంచుమించు పదిమంది ఉంటారు.



అయినా ఇన్ని సంవత్సరాలలో ఏ గొడవా జరగలేదు. ఒకరినొకరు తిట్టుకోవడం, ఇన్ డైరెక్ట్‌గా మాటలు విసురుకోవడం కూడా ఎప్పుడూ జరగదు. మా ఇంట్లో ప్రతిరోజూ ఒక పండుగలా ఉంటుంది. అందుకే నేను ఏదైనా ఊరెళ్ళినా ఒకటి రెండురోజులకు మించి ఉండలేను"

"ఇప్పుడు నువ్వు రమేష్‌తో అడ్జస్ట్ అవ్వగలవా లేదా అన్నది ఆలోచించుకో. నువ్వు రమేష్‌తో ఉండగలను అనుకుంటే అప్పుడు ఇంట్లోవాళ్ళని ఎలా ఒప్పించాలి అని ఆలోచించవచ్చు"

"ఇంకా నాకేం చెయ్యాలో అర్థంకావడం లేదు"

"ఇంకా అర్థం కాకపోవటానికేముంది. రమేష్‌ని బాగా స్టడీ చెయ్యి. నీతో ఉన్నపుడేకాదు నువ్వు లేనప్పుడు అతని ప్రవర్తన ఎలా ఉన్నది అబ్జర్వ్ చేయి. అప్పుడు ఆలోచించుకుని ఒక నిర్ణయానికి రా. తొందరపడి ఏ నిర్ణయమూ తీసుకోవద్దు"

"ఓ. కే. థాంక్యూ శ్రీనివాస్"

"నీకు ఆల్ రెడీ ఒకసారి చెప్పాను. కృతజ్ఞతలు, క్షమాపణలు ఫ్రెండ్స్‌మధ్య కాదు అని మరిచిపోయావా? "

"ఓ... నో థాంక్స్. ఉంటాను బై"

"బై" అని రిసీవర్ క్రెడిల్ చేశాడు. ఒళ్ళు విరుచుకుని మంచంమీదకు వాలబోయాడు. ఇంతలో మళ్ళీ ఫోన్ రింగ్ అయ్యింది. రిసీవర్ చేతిలోకి తీసుకున్నాడు.

"హలో..." అన్నాడు చిరాగ్గా.

"హాయ్...!" అటువైపునుంచి వినిపించింది.

"సవితా!" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు శ్రీనివాస్.

"ఊ... బాగానే గుర్తుపట్టావ్"

"నువ్వేంటి? ఇంత రాత్రి టైంలో"

"ఏం... ఎవరి ఫోన్ కోసమైనా వెయిట్ చేస్తున్నావా? అవును, ఏంటి ఫోన్ చాలా సేపట్నుంచి ఎంగేజ్ వస్తోంది"

"నేను నీకు ట్రై చేస్తున్నాను. నువ్వు నాకు ట్రై చేస్తున్నావు. ఎంగేజ్ రాక ఏం చేస్తుంది? " అన్నాడు ఈ విషయాన్ని కూడా తనకు ఫేవర్‌గా మార్చుకుందామని ట్రై చేస్తూ.

"నువ్వు నాకు ట్రై చేస్తున్నావా? కహానీలు వద్దు బాబూ? "

"నిజంగా! నమ్ము పాపా"

"ఏంటి నమ్మేది. నేను నీకు ఇదే ఫోన్ చేయడం. ఇంతకుముందు ట్రై చేయలేదు. ఫోన్ ఖాళీగానే ఉంది. ఏదో సరదాగా వల విసిరాను, దొరికేశావు. నీ పప్పులు నా దగ్గర ఉడకవు" అంది సవిత.

'ఛ' తనని తానే తిట్టుకున్నాడు శ్రీనివాస్.

"ఎంగేజ్ వచ్చిందనగానే కమిట్ అయిపోయావు. ఎవరితో మాట్లాడుతున్నావ్? " ప్రశ్నించింది సవిత.

"సింధుతో"

"సింధుతోనా! ఈ టైంలో ఏంటి? ఏదైనా సీరియస్ మేటరా? "

"అదేంలేదు. నిన్న నేను చెప్పిన విషయం గురించి ఆలోచిస్తుంటే నిద్ర పట్టలేదట. అందుకే చేసింది"

"పాపం... మైండ్ పాడయిపోతోందేమో"

"అది సరే. ఈ టైంలో నువ్వెందుకు ఫోన్‌చేశావు? "

"నేనా? నేనూ... ఊరికినే సరదాగా ఫోన్ చేశాను"

"సరదాగానా? "

"నిద్రపట్టలేదు. ఎవరి బుర్ర తిందామా అని ఆలోచిస్తే నువ్వు గుర్తొచ్చావు. అందుకే చేశాను"

"ఇంకేంటి విశేషాలు"

"ప్రస్తుతానికి నిద్రవస్తోంది. అదొక్కటే విశేషం. బై"

"బై" అని రిసీవర్ క్రెడిల్ చేశాడు.

సవిత గురించి ఆలోచిస్తూ నెమ్మదిగా నిద్రలోకి జారుకున్నాడు.



"హలో అత్తయ్యా" అని వినిపించేసరికి కిచెన్‌లో పనిచేసుకుంటున్న పార్వతి, ఆ మాటలు వినిపించిన వైపుగా చూసింది. అక్కడ నిలబడి ఉన్న వ్యక్తిని చూసి ఆశ్చర్యపోయింది.

"రాఘవా? నువ్వా? రా... రా" ఆశ్చర్యంగా అంది పార్వతి.

"అత్తయ్యా. బావున్నావా? " ప్రశ్నించాడు రాఘవ.

"నాకేం నిక్షేపంగా ఉన్నాను. కానీ నువ్వేంట్రా. ఇంత అకస్మాత్తుగా..."

"అందరినీ ఒకసారి చూసిపోదామని వచ్చాను. ఇంతకీ అమ్మమ్మ ఎలా ఉన్నారు? "

"బాగానే ఉన్నారు. కానీ వయసు అయిపోయిందికదా. ఆరోగ్యం సరిగా ఉండడం లేదు. డాక్టర్లకు చూపించినా వయసుమీద పడిందికదా అంతే అంటున్నారు"

"ఏదీ పిల్లరాక్షసి ఎక్కడా కనిపించదే? "

"ఎవరు సింధునా? ఇంకా లేవలేదు"

"టైం ఏడవుతోంది. ఇంకా లేవలేదా? "

అంటూ ఇంటి లోపలికి వెళ్ళాడు రాఘవ. అప్పటికింకా సింధు నిద్రపోతూనే వుంది.

రాఘవ గదంతా కలియచూశాడు. టేబుల్‌పై గ్లాసుతో నీళ్ళు కనిపించాయి. తనలో తనే నవ్వుకుంటూ ఆ గ్లాసు అందుకున్నాడు. దానిలోని నీటిని సింధు మొహం మీద పోశాడు. అంతే మంచి నిద్రలో ఉన్న సింధు ఒక్క ఉదుటున లేచి కూర్చుంది. తనపై నీళ్ళు పోసింది ఎవరా అని చాలా కోపంగా చూసింది సింధు.

రాఘవను చూడగానే ఆమె కోపం కాస్తా ఆశ్చర్యంగానూ, ఆశ్చర్యం ఆనందంగానూ మారిపోయింది.

"ఛీ... మంచి కల పాడుచేశావ్" చిరుకోపాన్ని నటిస్తూ అంది సింధు.

"ఏంటో... అంత మంచి కల? " ప్రశ్నించాడు రాఘవ.

"ఇండియా వరల్డ్‌కప్ గెలిచినట్టు కల వచ్చింది"

"అవునులే అటువంటివి కలలు కనే ఆనందించాలి"

"ఏం లాభం. కరెక్టుగా కప్ తీసుకొంటుండగా లేపేశావు. అది సరే... నువ్వేంటి ఇలా ఊడిపడ్డావ్? "

"మళ్ళీ అదే ప్రశ్న. అక్కడ అత్తయ్యా అదే అడిగింది. నువ్వూ అదే అడిగావు. ఏం, నేను మీ ఇంటికి రావడం అంత ఇబ్బందిగా ఉందా? "

"ఛ... అదేంకాదు. అప్పుడప్పుడూ వస్తూ ఉండేవాడివైతే ఎవరూ అడగరు. నువ్వు మా ఇంటికి వచ్చి దాదాపు రెండు సంవత్సరాలు అయ్యింది. సడన్‌గా వచ్చేసరికి ఎవరయినా అదే అడుగుతారు" మంచంమీద నుంచి కిందకు దిగుతూ అంది సింధు.

"సరేలే... ఆ విషయం వదిలేయి. నువ్వేంటి ఇంకా నిద్రలేవలేదు... ఈరోజు కాలేజ్ లేదా? "

"ఎందుకు లేదు...? ఉంది"

"నీతో నేను కూడా కాలేజ్‌కి వస్తాను"

"మా కాలేజ్‌కా! ఎందుకు?" చాలా ఆశ్చ ర్యంగా అడిగింది సింధు.

"ఏంటి అంత రియాక్షన్ ఇచ్చావు. మీ కాలేజ్‌కి బయటవాళ్లు రాకూడదా!"

"రాకూడదని కాదు. ఎందుకు... అని"

"నీ ఫ్రెండ్స్ అందరినీ పరిచయం చేసు కుందామని. చేస్తావా?"

"తప్పకుండా! కానీ నువ్వు ఏ పనీ లేకుండా కాలేజ్‌కి వస్తావా... అన్నదే నా అనుమానం"

"అంత అనుమానం ఏంటే నామీద"

"చిన్నప్పటినుంచీ నీ గురించి తెలిసిన దాన్ని. నువ్వు ఏ పనీ లేకుండా బయటకు కదలవన్న విషయం నాకు తెలియదా... ఏంటి"

"ఫరవాలేదు... నన్ను బాగానే అర్థం చేసుకున్నావు. నా ఫ్రెండ్ ఒకడు మీ కాలే జ్‌లోనే ఎమ్.ఎస్.సి చదువుతున్నాడు వాడిని కలవాల్సిన పనుంది"

"అదీ... అందుకు వచ్చావు. లేకపోతే నువ్వెందుకు వస్తావు? ఇంతకీ... ఎవర తను. నాకు ముందే చెప్పుంటే నేను పరి చయం చేసుకొనేదానినిగా!" నవ్వుతూ అంది సింధు.

"వద్దులే... అంత గొప్ప వ్యక్తేం కాదు. ఆ పరిచయాన్ని అడ్డుపెట్టుకొని తరువాత నన్ను టీజ్ చేసేటటువంటి కారెక్టర్"

"అటువంటి వాడితో నువ్వెందుకు మాట్లా డటం"

"తప్పదు. అవసరం వస్తే ఎటువంటి వాడితో అయినా మాట్లాడాలి"

"వాడి పేరు యశ్వంత్‌గానీ కాదుకదా" అనుమానంగా ప్రశ్నించింది సింధు.

"కాదు... ఏం?"

"ఏం లేదులే. ఒక వెధవ ఉన్నాడు మా కాలేజ్‌లో. వాడేమోనని అడిగాను"

"నువ్వు త్వరగా రడీ అవ్వు వెళదాం"

"బాబూ కాలేజ్ పదిగంటలకు. మనం తొమ్మిది గంటలకు వెళితే సరిపోతుంది. అంటే ఇంకా చాలా టైముంది. నువ్వు నన్ను కంగారు పెట్టకు" అని గదిలోనుంచి బయటకు వచ్చింది.

★ ★ ★

సింధు, రాఘవ బైక్‌మీద కాలేజ్‌కి బయ లుదేరారు. బైక్ బస్‌స్టాప్‌కి కొద్దిదూరంలో ఉండగానే బస్‌స్టాప్‌లో ఉన్న రమేష్‌ని గమ నించింది సింధు. వెంటనే రాఘవను పరి చయం చెయ్యాలా? వద్దా? అన్న ఆలోచ నలో పడింది.

పరిచయం చేస్తే రమేష్ ఎలా రియాక్ట్ అవుతాడోనని ఆమెకు భయంగా ఉంది. పరిచయం చెయ్యకపోతే పరిస్థితి మరోర కంగా ఉంటుంది. అతనితో మాట్లాడకుండా వెళ్ళిపోతే చూసి చాలా ఫీలవుతాడు. ఏం చెయ్యాలా అని ఆలోచించి చివరకు పరి చయం చేద్దామనే నిర్ణయించుకుంది.

"రఘూ బస్‌స్టాప్‌లో ఇద్దరు అబ్బాయిలు కనిపిస్తున్నారే. వాళ్ళ దగ్గర ఆపు" చెప్పింది సింధు రమేష్ వాళ్ళని చూపిస్తూ.

"సరే..." అని రఘు బైక్‌ని రమేష్ వాళ్ళ దగ్గర ఆపాడు.

సింధు, మొదట చైతన్యని తన క్లాస్‌మేట్ అని పరిచయం చేసింది. తరువాత రమే ష్‌ని చైతన్య అన్నయ్య అని పరిచయం చేసింది.

చైతన్య నవ్వుతూ రాఘవకు షేక్‌హ్యాండ్ ఇచ్చాడు. రమేష్ మాత్రం తప్పదన్నట్టుగా చేతిని కలిపి దిక్కులు చూడసాగాడు. అతను సింధుకి బావ అని తెలిసిన దగ్గర నుంచీ రమేష్‌కి చాలా అసూయగా ఉంది. సింధు అతనితో కలిసి రావడం అతనిలో మరింత బాధను కలిగించింది.

రమేష్ ఫీలింగ్స్ అన్నీ సింధూకి తెలు స్తూనే ఉన్నాయి.

"సరే అయితే... కాలేజ్‌లో కలుద్దాం" అని సింధు బైక్ ఎక్కింది. రాఘవ బైక్‌ని ముందుకి పోనిచ్చాడు.





"ఆ... రమేష్ పరిస్థితి ఏంటి? చాలా ఇబ్బందిగా షేక్‌హ్యాండ్ ఇచ్చాడు. నీతో ఎలా మాట్లాడతాడతను?" ప్రశ్నించాడు రాఘవ చాలా కూల్‌గా.

రాఘవ వద్దనుంచి ఆ ప్రశ్న వస్తుందని ఊహించలేదు సింధు. అందుకే సమాధానం చెప్పడానికి కాస్త తడబడింది.

"బాగానే మాట్లాడతాడు. బహుశా ఏదో మూడ్‌లో ఉండుంటాడు. అందుకే సరిగా మాట్లాడలేదు" సర్ది చెప్పింది సింధు.

రాఘవ ఏం మాట్లాడకుండా మౌనంగా బైక్ డ్రైవ్ చేయసాగాడు.

కాలేజ్‌కి చేరుకోవడానికి ఇరవై నిమిషాలు పట్టింది వాళ్ళకి. అప్పటికే శ్రీనివాస్, మహేష్, భాను క్యాంటీన్‌లో కూర్చొని ఉన్నారు. సింధు రాఘవని అందరికీ పరిచయం చేసింది.

"సో... మీ బ్యాచ్‌కి శ్రీనివాస్ లీడర్‌లాంటివాడన్నమాట" అందరికీ షేక్‌హ్యాండ్ ఇచ్చిన తరువాత అన్నాడు రాఘవ.

"మీరెలా చెప్పగలిగారు? సింధు చెప్పిందా?" ప్రశ్నించాడు మహేష్.

"లేదు. హ్యాండ్ గ్రిప్‌వల్ల చెప్పగలిగాను"

"అదెలా?" ప్రశ్నించింది భాను.

"మీరందరూ నాకు షేక్ హ్యాండ్ ఇచ్చారు. అందరికంటే శ్రీనివాస్ చేతి గ్రిప్ కాస్త గట్టిగా ఉంది. అది అతనిలో సెల్ఫ్‌కాన్ఫిడెన్స్‌కి నిదర్శనం. అటువంటివారిలోనే నాయకత్వ లక్షణాలు ఎక్కువగా ఉంటాయి"

"గ్రేట్... మీకెలా తెలుసు ఈ విషయం?" ప్రశ్నించింది భాను.

"కొంత మనుషుల్ని అబ్జర్వ్ చేయడంవల్ల, కొంత పుస్తకాలు చదవడంవల్ల"

"ఇప్పుడు నాకీ విషయం తెలిసిందికదా! తరువాత ఎవరికైనా షేక్‌హ్యాండ్ ఇచ్చేటప్పుడు నేను కాస్త గట్టిగా పట్టుకుంటే నాలో ఆత్మవిశ్వాసం వచ్చేసినట్టేనా?" ప్రశ్నించాడు మహేష్.

"ఇటువంటి విషయాలు కేవలం తెలియని వాళ్ళదగ్గరే పనికొస్తాయి. ఈ విషయం వాళ్ళకు తెలుసుంటే మనం కనిపెట్టడం కుదరదు"

"మీరు సైకాలజీలో గ్రాడ్యుయేషన్ చేశారా?" ప్రశ్నించింది భాను.

"లేదు... నేనూ మీలాగే సైన్సు స్టూడెంట్‌నే" అన్నాడు రాఘవ.

ఇంతలో సవిత వాళ్ళ దగ్గరకు వచ్చింది. సింధు రాఘవని సవితకు పరిచయం చేసింది. అందరూ కబుర్లలో పడ్డారు. మరో పది నిముషాల తరువాత రమేష్, చైతన్య బస్సుదిగి అక్కడకు వచ్చారు.

"సింధూ! ఒక్కసారి ఇలా వస్తావా?" వీళ్ళందరికీ కాస్త దూరంగా నిల్చొని ప్రశ్నించాడు రమేష్.

అక్కడ రమేష్, సింధుని పిలవడం ఎవరికీ నచ్చలేదు. సింధుకి కూడా. ఆమె వెంటనే రాఘవవైపు చూసింది. రాఘవ చిన్న నవ్వు నిండిన ముఖంతో ఆమెవైపు చూస్తున్నాడు. ఎంత ప్రయత్నించినా సింధుకి అతని ముఖంలో ఎటువంటి ఎక్స్‌ప్రెషన్నూ కనిపించలేదు.

"సింధూ! ప్లీజ్" కాస్త గట్టిగా అన్నాడు రమేష్.

అందరూ సైలెంట్‌గా సింధువైపే చూస్తున్నారు. సింధు కాస్త ఇబ్బందిగానే అక్కడ నుంచి కదిలింది.

సింధు వెళ్ళిన తరువాత అక్కడ వాతావరణం అంతా నిశ్శబ్దంగా మారిపోయింది. ఎవరూ... ఎవరితోనూ మాట్లాడడంలేదు.

"ఏంటి? అందరూ అంత సైలెంట్ అయిపోయారు. సింధు లేకపోతే నాతో ఎవరూ మాట్లాడరా?" నవ్వుతూ అన్నాడు రాఘవ.

"ఆ నవ్వు మీ ముఖంమీదనుంచి ఎప్పుడూ పోదా?" కాస్త దూరంలో సింధు రమేష్‌తో మాట్లాడుతున్నా ఆ విషయం ఏమాత్రం పట్టించుకోకుండా అతను చాలా కూల్‌గా ఉండటాన్ని అర్థం చేసుకోలేక తికమక పడుతూ ప్రశ్నించాడు మహేష్.

"నా దృష్టిలో దేవుడు మనిషికి ఇచ్చిన ఒకే ఒక వరం నవ్వు. కాబట్టి ఎంత కష్టస మయంలోనైనా ఆ వరాన్ని వదులుకోకూడ దని నా అభిప్రాయం"

"మనకి దక్కాల్సిన వస్తువు మన ఎదుటే వేరేవాడి చేతిలోకి వెళ్ళిపోతోందనుకోండి. అంటే మనం ఓడిపోతున్నట్టేగా. ఆ ఓటమి సమయంలో కూడా నవ్వడం... ఎంతవ రకూ కరెక్ట్?"

"మనం ఎప్పటికీ జయించలేని ఓటమి మనముందు ఉంది. అదే చావు. దానితో పోలిస్తే ఇవన్నీ చాలా చిన్నవి"

"మరి అటువంటప్పుడు జీవితంలో ఇన్ని ఎమోషన్స్ ఎందుకు? అన్నీ అనవసరమ యినవేనా?"

"ఎమోషన్స్ జీవితంలో చాలా అవసరం. వాటివల్ల ఉపయోగం ఉంటుంది అనుకున్న ప్పుడు వాటిని ఉపయోగిస్తేనే వాటికి విలువ. ఒక ఉదాహరణ చెప్తాను వినండి. మీరు మీ ఫ్రెండ్స్ మధ్యలో ఉండగా లెక్చ రర్ వచ్చి ఏదో విషయంమీద బాగా తిట్టా డనుకుందాం. నిజానికి ఆ విషయంలో మీ తప్పు ఏమాత్రంలేదు. అయినా మీరు ఆ లెక్చరర్ ఎదురుగా ఏమీ మాట్లాడలేక ఆయన వెళ్ళిపోయిన తరువాత కోపంగా ఫ్రెండ్స్ దగ్గర ఆ లెక్చరర్‌ని తిడుతూ జరి గిందీ చెపుతారు. మధ్యలో మీ ఫ్రెండ్స్ ఎవరో మిమ్మల్ని కూల్ చేయలేక వాళ్ళ మీద చిరాకుపడతారు. దానివల్ల మీ ఫ్రెండ్ షిప్ పాడవడం తప్ప ఎటువంటి ఉప యోగం ఉండదు. అది అనవసరమైన ఎమోషన్.

అదే మీరు లెక్చరర్ దగ్గరే ఆయన తిట్ట డంవల్ల మీరు ఎంత బాధపడిందీ, అసలు ఏం జరిగిందీ అన్నది చెప్తే ఆయన మిమ్మల్ని అర్థం చేసుకునే అవకాశం ఉంది. ఇది అవసరమైన ఎమోషన్, అర్థమైందను కుంటాను" అలా నవ్వుతూనే చెప్పాడు రాఘవ.

ఇక మహేష్ ఏం మాట్లాడలేకపోయాడు.

"ఏంటి మహేష్ సైలెంట్ అయిపో యారు. బాధపడుతున్నారా? ఇదంతా నేను సరదాగా చెప్పాను. మిమ్మల్ని హర్ట్ చెయ్యాలని కాదు. టేక్ ఇట్ ఈజీ" అన్నాడు రాఘవ.

"ఛ...ఛ... నేనేం బాధపడడంలేదు" అన్నాడు మహేష్.

"ఓ.కే. మహేష్... ఇంకేంటి విశే షాలు... మీ హాబీస్ ఏమిటి?"

"నా హాబీ కథలు రాయడం"

"కథలా?" ఒక్కసారిగా ఆశ్చర్యంతో గట్టిగా అన్నారు రాఘవ తప్ప మిగిలినవా రంతా.

"ఏంటి? అందరూ అంత రియాక్షన్ ఇచ్చారెందుకు?" ప్రశ్నించాడు రాఘవ.

"వీడు కథలు రాస్తాడని ఇప్పటివరకూ మాకు కూడా తెలియదు" చెప్పింది భాను.

"రాత్రినుంచే నేను రచయితగా మారాను" సిగ్గుతో మెలికలు తిరిగిపోతూ చెప్పాడు మహేష్.

"రాత్రినుంచే రచయిత...! ఇదేదో తెలుగు సినిమా టైటిల్‌కి బావుండేలా ఉందే" గట్టిగా నవ్వుతూ అన్నాడు చైతన్య.

అతనితోపాటు అందరూ నవ్వులు కలి పారు.

"మీకు ఇప్పుడు ఎగతాళిగానే ఉంటుంది. రేపు నేను రాసిన స్టోరీతో సినిమాతీసి అది పెద్ద హిట్ అయితే అప్పుడు తెలుస్తుంది ఈ రచయిత మహేష్ అంటే ఏమిటో... అయినా మీకో విషయం తెలుసా... చాలా మంది నిద్రలో వచ్చిన ఐడియాలతోనే పెద్ద పెద్ద సైంటిస్ట్‌లు అయ్యారు"

"నిద్రలో వచ్చిన ఐడియాలతో ఏ వెధవా సైంటిస్ట్ అయిపోలేదు. మేధావులయిన వాళ్ళంతా రాత్రీపగలూ తమ పని గురించే ఆలోచిస్తారు. అందుకే నిద్రలో కూడా వాళ్ళకు అవే ఆలోచనలు వస్తాయి" అన్నాడు చైతన్య.





# రచయితలకు మనవి

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతుర కతలు', 'చతుర ప్రపంచం' వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత (త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆ మేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండే సైజులో పంపడం మంచిపద్ధతి.**

★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ **ప్రతి నవలకు అందజేసే రూ. 3000/- పారితోషికం ఏ నెల 'చతుర'లో ప్రచురిస్తే ఆ నెల మొదటివారం లోనే పంపబడుతుంది.**




ఎడిటర్:

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్,

హైదరాబాద్ 500 482.




ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.

2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.

3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.

4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్ హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

★ మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ. 100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని పఠనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

జూలై చతుర నవల 'ప్రేమంటే'

సమీక్షకుని పేరు: ..............................

చిరునామా: ..............................

..............................

..............................

"అంటే నేను వెధవననా నీ ఉద్దేశం" కోపంగా అన్నాడు మహేష్.

"ఛ... అలా అని నేనెందుకు అంటాను? "

"నువ్వు అనకపోయినా నాకు అర్థమవు తూనే ఉంది"

"సరే... ఆ విషయం వదిలేసి నీకు రాత్రికి రాత్రి జ్ఞానోదయం కలిగించిన ఆ స్టోరీని మాకు కూడా వినిపించు నాయనా" అన్నాడు శ్రీనివాస్.

"అలాగే చెప్తాను. అందరూ గుండెను రాయి చేసుకొని జాగ్రత్తగా వినండి"

"ఏం లేకపోతే హార్ట్ ఎటాక్ వచ్చి పోతామా? " ప్రశ్నించాడు చైతన్య.

"కాదు... సెంటిమెంటు తట్టుకోలేక ఏడు స్తాదు" సీరియస్‌గా అన్నాడు మహేష్.

"ఛ... అంతుందా" అన్నాడు చైతన్య.

"చైతన్యా... నువ్వు ఆగు. మహేష్ నువ్వు చెప్పరా" అన్నాడు శ్రీనివాస్.

"ఈ కథ ముగ్గురు అమ్మాయిల చుట్టూ అల్లుకున్న అద్భుత సెంటిమెంట్ కథ"

"బాబూ... అద్భుతం అని మేం చెప్పాలి. నువ్వుకాదు" అంది భాను.

"కథ విన్న తరువాత మీరు ఎలాగూ అదేమాట చెప్తారుకదా. అందుకే ముందే నేను చెప్పేశాను" అన్నాడు మహేష్.

"సరే... ఇక కథలోకి రా"

"వచ్చేస్తున్నా... ఆ ముగ్గురు అమ్మాయిల పేర్లు, కవిత, రాగిత, ఊహిత" అంటూ తన కథని కంటిన్యూ చేయబోయాడు మహేష్. ఇంతలో అతని మాటలకు అడ్డుతగిలాడు చైతన్య.

"ఆగాగు... ఏంటీ పేర్లు? కవిత అంటే మంచి పేరే. రాగిత అంటే ఏదో పరవా లేదు అడ్జస్ట్ అవ్వచ్చు మరి ఈ ఊహిత ఏంట్రా? " ప్రశ్నించాడు మహేష్.

"చూశావా అప్పుడే థ్రిల్లింగ్‌గా ఫీల య్యావు. నా కథలో పేర్లు చదివితే మనుషుల స్వభావాలు తెలిసిపోతాయి. మొదట కవిత. అంటే ఆ అమ్మాయి చాలా అద్భుతమైన కవితలు రాస్తుంది. తరువాత రాగిత. ఆమె ఎప్పుడూ రాగాలు తీస్తూ ఉంటుంది. రాగాలంటే ఏడుపు కాదురోయ్. పాటలు పాడుతుంటుందని అర్థం. ఇక మిగిలింది మీరంతా డిఫరెంట్‌గా ఫీల్ అయిన ఊహిత. ఈమె ఎప్పుడూ ఊహల్లో విహరిస్తూ ఉంటుంది. ఆమె ఊహల్లో విహరిస్తూ కథలు రాస్తూ ఉంటుంది. అంటే ఆమె కూడా నాలా క్రియేటివ్ రైటర్ అన్నమాట.

ఇక అసలు కథ ఏమిటంటే ఈ ముగ్గురు అమ్మాయిలూ మంచి స్నేహితులు. కాక పోతే ఆ ముగ్గురూ కాలేజ్‌కి కూడా వెళ్ళకుండా చదువుని పక్కన పెట్టేసి ఇష్టం వచ్చినట్లుగా తిరుగుతూ ఉంటారు. అందువల్ల ఇంట్లోవాళ్ళతో తిట్లు తింటారు. చివరికి ఒక రోజు వాళ్ళకి జ్ఞానోదయం అవుతుంది. అందరూ కలిసి ఎన్నో కష్టాలుపడి ఒక సినిమా తీస్తారు. అది అన్ని రికార్డుల్నీ బ్రేక్ చేస్తుంది. ఇదీ స్టోరీ! ఎలా వుంది" చాలా గర్వంగా ప్రశ్నించాడు మహేష్.

అందరూ మౌనంగా కళ్ళు పెద్దవిచేసి ఆశ్చర్యంగా మహేష్‌వైపు చూస్తున్నారు.

"ఏంట్రా? అందరూ అలా ఉండిపోయా రేంటి? నా క్రియేటివిటీకి ఆశ్చర్యపోతున్నారా? " నవ్వుకుంటూ ప్రశ్నించాడు మహేష్.

"ఛీ..." అందరూ గట్టిగా ఒకేసారి అన్నారు.

"ఇదొక స్టోరీ... దీంతో రాత్రికి రాత్రి నువ్వు రచయితవి అయిపోయావా? " వెటకారంగా నవ్వుతూ అన్నాడు చైతన్య.

"అంతేరా... గొప్ప గొప్ప రచయితలు రాసేవి మీలాంటి పిల్లకాకులకి అర్థంకావు. అది మీ ఖర్మ" అన్నాడు మహేష్.

అంతా మళ్ళీ నవ్వేశారు.

ఇక్కడ వీళ్ళంతా కబుర్లతో కాలక్షేపం చేస్తుంటే వీళ్ళకు కొద్దిదూరంలో రమేష్, సింధుతో చాలా సీరియస్‌గా మాట్లాడుతున్నాడు.

"సింధూ! నీకు మీ బావంటే ఇష్టమా?" సూటిగా ఆమె కళ్ళలోకి చూస్తూ ప్రశ్నించాడు రమేష్.

"అదేం ప్రశ్న..." అర్థంకానట్టు మొహం పెడుతూ అంది సింధు.

"నేను తెలుగులోనే అడిగానుకదా. మీ బావని నువ్వు ఇష్టపడుతున్నావా?"

"అమ్మ అంటే ఇష్టం, నాన్న అంటే ఇష్టం. అలాగే బావంటే ఇష్టం"

"అంతేనా?"

"అసలు నీ అనుమానం ఏమిటి?"

"నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా? లేక మీ బావని ప్రేమిస్తున్నావా?"

అసలు రమేష్ అటువంటి ప్రశ్న అడుగుతాడని ఊహించని సింధు షాక్ తింది. రమేష్ తనని అనుమానించడాన్ని ఆమె మనసు తట్టుకోలేకపోయింది. ఆమాట విన్న వెంటనే ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి. అది రమేష్‌కి తెలియకుండా ఉండడంకోసం

తన చూపుని అతని మీదనుండి మరల్చుకొని నేల చూపులు చూడసాగింది. ఆమె మౌనాన్ని అతను వేరే విధంగా అర్థం చేసుకున్నాడు.

"ఏం... మాట్లాడవేం? ఏం చెప్పాలో అర్థం కావటంలేదా?" కాస్త వ్యంగ్యంగా అడిగాడు రమేష్.

"కాదు... ఎలా చెప్తే నువ్వు నమ్ముతావో తెలియక ఆలోచిస్తున్నాను"

"నిజం చెప్తే ఎందుకు నమ్మను. నీమీద నాకు ఆమాత్రం నమ్మకముంది"

"నామీద ఏ మాత్రం నమ్మకం ఉన్నా నువ్వు ఈ ప్రశ్న అడగవు"

"మరి నీ బావతో అంత సరదాగా నవ్వుతూ ఎలా ఉండగలుగుతున్నావు?

"అదేంటి రమేష్... అలా మాట్లాడుతున్నావు. నిన్ను ప్రేమించాను కాబట్టి ఇక ఎవ్వరితోనూ నవ్వుతూ మాట్లాడకూడదా?"

"అందరితోనూ కాదు, మీ బావతో మాత్రం మాట్లాడకూడదు"

"మూర్ఖంగా మాట్లాడతావేంటి నువ్వు. బావతో మాట్లాడితే ఏంటి తప్పు" కాస్త కోపంగానే ప్రశ్నించింది సింధు.

"క్షణక్షణానికీ ఆమెలో సహనం చచ్చిపోతోంది. ఇలా పక్కకు వచ్చి మాట్లాడుకుంటే తన బావ ఎలా ఫీలవుతాడోనని ఒకవైపు భయంగా ఉంది.

"నేను నన్ను ఇష్టపడే వ్యక్తిని కోరుకోవటంలేదు. నన్ను మాత్రమే ఇష్టపడే వ్యక్తిని కోరుకుంటున్నాను" అన్నాడు ఆ 'మాత్రమే' అన్న పదాన్ని నొక్కి పలుకుతూ.

"రమేష్... నువ్వేదో కోపంలో ఉన్నట్టున్నావు. మనం తరవాత మాట్లాడుకుందాం. ప్లీజ్ నువ్వేం అనవసరమైన అనుమానాలు పెట్టుకోవద్దు" అని అతని సమాధానం కోసం ఎదురుచూడకుండా అక్కడనుండి శ్రీనివాస్ వాళ్ళ వద్దకు వచ్చేసింది.

రమేష్ అసహనంగా కాలితో నేలను తన్ని కాలేజ్ లోపలికి వెళ్ళిపోయాడు.

"సింధు, రాఘవకు ఎదురుగా కూర్చొని అతని ముఖంలో ఫీలింగ్స్ కోసం చూసింది. రాఘవ మాత్రం సింధువైపు చూసి ఓ చిన్న నవ్వు నవ్వి మళ్ళీ కబుర్లలో మునిగిపోయాడు.

"క్లాసుకి టైమ్ అవుతోంది. పదండి వెళదాం" అంది భాను.

"సరే..." అని అందరూ కబుర్లకి ఫుల్ స్టాప్ పెట్టేసి క్లాసుకి బయలుదేరారు.

"శ్రీనివాస్... మీరు నాకు ఎమ్.ఎస్.సి. క్లాస్‌రూమ్ ఎక్కడో చూపిస్తారా?" అడిగాడు రాఘవ.

"ష్యూర్... పదండి" అని శ్రీనివాస్, రాఘవ వాళ్ళనుండి విడిపోయారు.

"రాఘవ... చాలా సరదాగా ఉన్నాడు కదా" రాఘవ వాళ్ళ దగ్గరనుండి వెళ్ళిపోయిన తరువాత అంది భాను.

"సరదాగా ఉన్నాడా?... అందంగా ఉన్నాడా?" అనుమానంగా చూస్తూ ప్రశ్నించాడు మహేష్.




"రెండూనూ..." సిగ్గుపడుతూ చెప్పింది భాను.

"అయిపోయింది... సింధూ! మీ బావను జాగ్రత్తగా ఉండమను. భాను కళ్లు పడ్డాయంటే ఆ వ్యక్తిపని అయిపోయినట్టే"

"నా గురించి నీకేం తెలుసు. నేనెవరయినా అబ్బాయికి ఐ లవ్ యు అని చెప్పాననుకో వాళ్లు నో అనలేరు. తెలుసా!" కనురెప్పలను ఎగరేస్తూ అంది భాను.

"అవునులే... ఓ.కే. అనకపోతే నువ్వు కొడతావేమోనని భయం. మామూలు పర్సనాలిటీనా మనది..."

"దేని గురించయినా కామెంట్ చెయ్యి... కానీ నా పర్సనాలిటీ గురించి మాత్రం మాట్లాడకు" సీరియస్‌గా ముఖం పెట్టి అంది భాను.

మహేష్‌తో సహా అందరూ నవ్వేశారు. సింధు మాత్రం ఇవేమీ ఎంజాయ్ చేసే మూడ్‌లో లేదు. ఆమె మనసంతా గజిబిజిగా ఉంది. ఆలోచనలన్నీ రమేష్ చుట్టూ తిరుగుతున్నాయి.

★ ★ ★

"శ్రీనివాస్, రాఘవ కాలేజ్ కారిడార్లో నడుస్తున్నారు.

"శ్రీనివాస్... మీరు నాకో విషయం చెప్పాలి" చాలా క్యాజువల్‌గా అడిగాడు రాఘవ.

"అడగండి" అన్నాడు శ్రీనివాస్.

"సింధు, రమేష్‌ని ప్రేమిస్తోందా?"

ఆ ప్రశ్నకు శ్రీనివాస్ ఆశ్చర్యపోలేదు. రాఘవ ఆ ప్రశ్న అడుగుతాడని శ్రీనివాస్ ఊహించటమే అందుకు కారణం. కానీ శ్రీనివాస్ మాత్రం ఇప్పటికీ ఏం సమాధానం చెప్పాలో నిర్ణయించుకోలేకపోతున్నాడు.

"ఏంటి శ్రీనివాస్? సమాధానం చెప్పడం లేదు...?" మళ్ళీ ప్రశ్నించాడు రాఘవ.

"నాకు తెలిసినంతవరకూ అటువంటిదేం లేదు. అయినా మీకు ఆ అనుమానం ఎందుకు వచ్చింది"

"సింధు, రమేష్‌ని ప్రేమిస్తోందో లేదో తెలియదుగాని రమేష్ మాత్రం సింధుని ప్రేమిస్తున్నాడని నేను ఖచ్చితంగా చెప్పగలను. అందుకే సింధు నాతో కలిసి ఉండటాన్ని అతను సహించలేకపోతున్నాడు"

"ఏమో! నేను ఇంతవరకూ గమనించలేదు"

"మీకు నిజంగానే తెలియదో లేక తెలిసినా తెలియనట్టు మాట్లాడుతున్నారో తెలియదు. నేను ఒక విషయం అడుగుతాను. కనీసం దానికయినా సమాధానం చెప్పండి"

"తప్పకుండా..."

"సింధు, రమేష్‌ని ప్రేమించిందనే అనుకుందాం! తను నన్ను కాకుండా రమేష్‌ని ప్రేమించడానికి కారణం చెప్పగలరా!"

"నాకు తెలిసినంతవరకూ ఒకటే కారణం... కమ్యూనికేషన్ గ్యాప్. తను సరిగ్గా లైఫ్ గురించి ఆలోచించే సమయంలో తనతో మీకు కమ్యూనికేషన్ లేదు. బహుశా మీరు కూడా తనంటే ఇష్టమని తనకి ఎప్పుడూ చెప్పి ఉండరు"

"అవును. ఎప్పటికయినా తను నా సొంతమే అని అనుకొన్నాను. కానీ తను వేరే ఎవరినయినా ఇష్టపడుతుందేమోనని ఎప్పుడూ ఆలోచించలేదు. అందుకే నాలో ఎంత ప్రేమ ఉన్నా దానిని మనసులోనే దాచుకున్నాను. కానీ ఎప్పుడూ పైకి చెప్పలేదు"

"ఇదే ఎమ్.ఎస్.సి. క్లాస్ రూమ్" రాఘవ మాటలకు అడ్డుపడుతూ చెప్పాడు శ్రీనివాస్.

"ఇద్దరూ క్లాస్ లోపలికి వెళ్ళారు. రాఘవను చూడగానే రమేష్ ముఖం కాంతివిహీనమైపోయింది. వీళ్ళిద్దరూ ఆ విషయాన్ని చాలా తేలికగా గమనించగలిగారు.

రాఘవకు తనకు కావలసిన వ్యక్తి కనిపించకపోయేసరికి, నేరుగా రమేష్ వద్దకు వెళ్ళి అతని గురించి వివరాలు కనుక్కున్నాడు.

"పదండి వెళదాం..." శ్రీనివాస్‌తో

అన్నాడు రాఘవ.

ఇద్దరూ బయటకు వచ్చారు.

"శ్రీనివాస్... ఇప్పుడు గమనించారా? నన్ను చూడగానే రమేష్ ముఖం ఎలా మారి పోయిందో. నేను మాట్లాడుతున్నప్పుడు కూడా అలాగే సమాధానం చెప్పాడు"

శ్రీనివాస్, రాఘవకు ఎటువంటి సమాధానం చెప్పలేదు. చిన్న నవ్వు మాత్రం నవ్వాడు.

"ఆ నవ్వుకి అర్థం ఏమిటి శ్రీనివాస్? " ప్రశ్నించాడు రాఘవ.

"నేను అంత కేర్‌ఫుల్‌గా అబ్జర్వ్ చేయలేదు కానీ ఏదో కొద్దిగా తేడాగా అనిపించింది. కాకపోతే ఈ విషయం మీరు డైరెక్ట్‌గా సింధుతో మాట్లాడటమే మంచిదని నా ఉద్దేశం"

"లేదు... ఈ విషయం తన దగ్గర మాట్లాడను. నేను సింధుని మనస్ఫూర్తిగా ఇష్టపడుతున్నాను. తను కూడా నన్ను అలాగే ఇష్టపడాలని కోరుకొంటున్నాను. ఇప్పుడు నేను తనతో మాట్లాడితే ఒకవేళ తను రమేష్‌ని ప్రేమించినా ఆ విషయం నాకు ఖచ్చితంగా చెప్పదు. ఎందుకంటే నేను ఇంట్లో చెప్తాననే భయం ఉంటుంది కాబట్టి. అలాకాకుండా తనే ఈ విషయం ఇంట్లో చెప్పినా వాళ్ళు ఆమె ప్రేమను అంగీకరించరు. నామీద వాళ్ళకున్న అభిమానం అటువంటిది. ఇలా బలవంతంగా సింధుని సొంతం చేసుకోవటం నాకు ఇష్టంలేదు"

"మీరు తప్పుగా ఆలోచిస్తున్నారని నేను అనుకొంటున్నాను. మీరు సింధుని అడగకపోవటంవల్లే ఆమెను ఇంట్లోవాళ్ళు బలవంతం చేసే అవకాశం ఎక్కువ"

"అవును ఆ విషయం నాకూ తెలుసు. ఈ విషయం గురించి సింధుని నేను అడగను. మీరే తనని అడగాలి"

"నేనా...? ఇటువంటి విషయాల్లో మధ్యవర్తిత్వం మంచిది కాదు"

"ఫరవాలేదు. నేను మిమ్మల్ని నమ్ముతున్నాను. ఈ విషయం నేనే సింధుని డైరెక్ట్‌గా అడిగితే తను సమాధానం చెప్పలేదు. అది నామీద జాలివల్ల కావచ్చు, పెద్దల నిర్ణయంమీద గౌరవంవల్ల కావచ్చు. అదే మీరయితే ఫ్రెండ్ కాబట్టి తను ఫ్రీగా చెప్పగలుగుతుంది. ఈ విషయం మీరు వెంటనే అడగొద్దు. టైమ్ చూసి నెమ్మదిగా అడగండి. నేను అడగమన్నట్టు మాత్రం తనకు తెలియకూడదు. తెలిస్తే మరలా మొదటికే వస్తుంది విషయం అంతా... ఏమంటారు? "

"సరే..." రెండు నిమిషాలు ఆలోచించిన తరువాత చెప్పాడు శ్రీనివాస్.

"ఇక నేను వెళ్తాను"

"ఓ. కే... బై"



ప్రతి చిన్న విషయానికీ కోపగించుకొంటే ఎలా? " కాస్త సీరియస్‌గా ప్రశ్నించింది సింధు.

"లేకపోతే ఏంటి? మీ బావ రాగానే నాతో సరిగా మాట్లాడకపోతే ఎలా? " అదే రీతిలో ప్రశ్నించాడు రమేష్.

రమేష్, సింధు మిగిలినవాళ్ళకు కాస్త దూరంగా ఉన్న టేబుల్ వద్ద క్యాంటీన్‌లో

కూర్చొని ఉన్నారు.

"అలా అనుకోవటం నీ భ్రమ మాత్రమే"

"భ్రమ కాదు నిజం"

"సరే... నిజమే అనుకుందాం. ఒక్కరోజు మాట్లాడనంత మాత్రాన ఏమైపోతుంది. అసలే బావ ఉన్నాడు. తనకి మనమీద అనుమానం వస్తే ఇంకేమైనా ఉందా? ఇంట్లో తెలిసిపోతుంది"

"ఎప్పటికయినా తెలియాల్సిందేగా!"

"ఎప్పుడయినా నేను చెప్పటం వేరు... బావ ద్వారా ఇంటిలో తెలియటం వేరు. అయినా ఇంకా మా వాళ్ళు నా పెళ్ళి గురించి ఆలోచించటంలేదు. కాబట్టి నెమ్మదిగా మంచి అవకాశం చూసుకొని నాన్నకు చెప్పటానికి టైమ్ దొరికింది. ఇప్పుడు మనం తొందరపడితే మన గొయ్యి మనమే తవ్వుకున్నట్టు అవుతుంది"

"నాకయితే ఈ విషయం ఎంత త్వరగా ఇంట్లో చెప్తే అంత మంచిదనిపిస్తోంది"

"ఆ ఆవేశమే వద్దు"

"అలా అని ఆలస్యం చేయడం కూడా మంచిది కాదు"

"సరే... ఇప్పుడు ఇంట్లో ఈ విషయం చెప్పాననుకో వాళ్ళు అడిగే మొట్టమొదటి ప్రశ్న. ఆ అబ్బాయి నిన్ను ఎలా పోషిస్తాడు అని? ఏం సమాదానం చెప్తాం దానికి? "

"ఎమ్.ఎస్.సి. పూర్తవగానే నేను ఉద్యోగం సంపాదిస్తాను"

"సంపాదిస్తాను కాదు... సంపాదించిన తరువాతే వాళ్ళకు చెప్పాలి. అప్పటివరకూ ఈ విషయం ఇంట్లో తెలియకుండా చూసుకోవటమే మంచిది"

సింధు చెప్పినదానికి ప్రతిగా రమేష్ ఏమీ మాట్లాడలేదు. అతను మౌనంగా ఉండటం చూసి ఆమె తేలికగా ఊపిరి పీల్చుకుంది. ఇప్పటివరకూ అతను ఆవేశంలో ఈ విషయం ఇంట్లోగాని చెప్పేస్తాడేమోనని ఆమె చాలా కంగారుపడింది.

"సమయం చూసి నాన్నకు నేనే చెప్తాను. అంతవరకూ నువ్వు తొందరపడకు. తొందరపడి ఇంటికి ఫోన్ చేయటమో, నాన్నతో మన విషయం చెప్పటమో చేసి నన్ను రిస్క్‌లో పెట్టొద్దు. సరేనా? !" ప్రాధేయపడుతున్నట్టుగా అంది సింధు.

కానీ రమేష్ సమాధానం చెప్పలేదు.

"మాట్లాడవేంటి? సమాధానం చెప్పు" అతని చేతులను పట్టుకొని అడిగింది సింధు.

"సరే..." అన్నాడు రమేష్.

"అబ్బ... ఇప్పుడు నాకు ఆనందంగా ఉంది" అంది సింధు నవ్వుతూ.

"నాకు మాత్రం మన పెళ్ళయితేనే ఆనందం"

"మళ్ళీ ఆ విషయానికే వచ్చావు. చెప్పానుగా. ప్రస్తుతానికి ఆ విషయం గురించి ఆలోచించవద్దని. బస్ వచ్చే టైమ్ అవుతోంది. పద బస్‌స్టాప్‌కి వెళదాం" అని మిగిలిన వాళ్ళను కూడా పిలిచింది సింధు.

అందరూ బస్‌స్టాప్‌కి చేరుకున్నారు.

"మేమంతా కలిసి రేపు పిక్నిక్‌కి వెళదామని ప్లాన్ వేశాం. మీరిద్దరూ కూడా వస్తారుకదా? " ప్రశ్నించింది భాను.

"ఎక్కడికి? " వెంటనే ప్రశ్నించింది సింధు.

"ఇక్కడికి పదిహేను కిలోమీటర్ల దూరంలో గోదావరి ఒడ్డున ఒక బ్యూటిఫుల్ గార్డెన్ ఉంది. అక్కడికి" చెప్పింది భాను.

"నేనెప్పుడూ వినలేదే? !"

"ఎవరికీ తెలియదు. ఎందుకంటే ఆ గార్డెన్ మాదే. అమ్మమ్మ, తాతయ్య అక్కడ ఉంటారు. వాళ్ళే పెంచుతారు మొక్కల్ని. తాతయ్యకు మొక్కలంటే ప్రాణం"

"మనం ఎంజాయ్ చేయటానికి బావుంటుందా? "

"చాలా బావుంటుంది. ఆ గార్డెన్ ఒకటే కాదు. గోదావరి గట్టుకదా. ఆ ఏరియా అంతా కూడా చాలా చాలా బావుంటుంది"

"సరే... నేను వస్తాను" అంది సింధు.

"నేను... రాను" నెమ్మదిగా అన్నాడు రమేష్.

"ఏం... ఎందుకు రావు?" ప్రశ్నించింది భాను.

"నాకు రేపు మా ఊరిలో క్రికెట్ మ్యాచ్ ఉంది"

"ఒకరోజు క్రికెట్ ఆటడం మానేసినంత మాత్రాన ఏం నష్టం ఉండదు. అయినా ఫ్రెండ్స్‌తో కలిసి ఎంజాయ్ చేయటం మానేసి క్రికెట్ అంటావేంటి?"

"నాకు క్రికెట్ ఆడటంలోనే ఎక్కువ ఆనందం దొరుకుతుంది"

"వాడిని నేను తీసుకొస్తానుకదా. మీకెందుకు. మీరందరూ రెడీగా ఉండండి చాలు" అన్నాడు చైతన్య.

ఇంతలో బస్ వచ్చింది. సింధు, రమేష్, చైతన్య బస్ ఎక్కారు. తరువాత అందరూ ఎవరి దారిన వాళ్ళు విడిపోయారు.

శ్రీనివాస్, సవిత మాత్రమే బస్‌స్టాప్‌లో మిగిలిపోయారు.

"పద... మీ ఇంటికి వెళదాం" అంది సవిత.

"ఇప్పటివరకూ నా మెదడు తిన్నావు సరిపోదా! ఇంకా ఇంటికి వచ్చి కూడా తింటావా? వద్దు ప్లీజ్..." భయం నటిస్తూ అన్నాడు శ్రీనివాస్.

"నేను ఆంటీకోసం వస్తున్నాను. నీ కోసం కాదు. పద" అని శ్రీనివాస్ బైక్ వెనుక కూర్చుంది.

శ్రీనివాస్ చిన్నగా నవ్వుకొని బైక్‌ని ముందుకి దూకించాడు.

★ ★ ★

"హలో ఆంటీ... బావున్నారా!" అంటూ పలకరించింది సవిత శ్రీనివాస్ తల్లి పుష్పని.

"బావున్నానమ్మా. మమ్మీ, డాడీ ఎలా ఉన్నారు?" ప్రశ్నించింది పుష్ప.

"ఎదురుగా ఉన్న నా గురించి వదిలేసి మమ్మీ, డాడీ గురించి అడుగుతున్నారా! మీ పెద్ద వాళ్ళంతా ఇంతే. పిల్లల గురించి పట్టించుకోరు"

"నీ గురించి వాడు రోజూ చెప్తూనే ఉంటాడుకదా!" అంది పుష్ప నవ్వుతూ.

"మీరు మాట్లాడుకుంటూ ఉండండి" అని శ్రీనివాస్ ఫాస్ట్‌గా తన రూమ్‌లోకి వెళ్ళిపోయాడు.

శ్రీనివాస్ రూమ్‌లోకి వచ్చిన రెండు నిమిషాలకే సవిత వచ్చేసింది.

"ఆంటీ కోసం వచ్చానన్నావుకదా! మరి ఇలా వచ్చేశావేంటి?" ప్రశ్నించాడు శ్రీనివాస్.

"మాట్లాడటం అయిపోయింది. అందుకే వచ్చాను"

"ఈ మాత్రం మాట్లాడటానికి ఇక్కడ వరకూ రావాలా?"

"నేను మీ ఇంటికి రావటం ఇష్టం లేదంటే చెప్పు. వెళ్ళిపోతాను" సీరియస్‌గా అంది సవిత.

"ఏంటి... కోపమే? నువ్వు కోపంలో బలే అందంగా వుంటావు" అన్నాడు శ్రీనివాస్ చిలిపిగా నవ్వుతూ.

"అంటే మామూలుగా ఉన్నప్పుడు బావుండనా?" చిరుకోపాన్ని నటిస్తూ అంది సవిత.

"రాజుగారి రెండో భార్య మంచిది అంటే మొదటి భార్య చెడ్డది అని అర్థం కాదు"

"గొప్ప సామెత చెప్పావులే..." అంటూ శ్రీనివాస్ రూమ్‌లో ఉన్న నోట్‌బుక్స్ అన్నీ చూడటం మొదలుపెట్టింది.

"ఏంటి... నా బుక్స్ అన్నీ వెతుకుతున్నావు. ఎక్కడయినా ఏ అమ్మాయి గురించయినా రాసి ఉంటుందేమోనని అనుమానమా?" నవ్వుతూ ప్రశ్నించాడు శ్రీనివాస్.

"అమ్మాయిల గురించి బుక్స్‌లో రాసుకొనేటంత ధైర్యం ఎక్కడిది నీకు. పుస్తకాలలో కవితలు రాస్తూ ఉంటావుకదా. వాటికోసం చూస్తున్నాను"




"అలా ఎక్కడపడితే అక్కడ రాయటం మానేశాను. సెపరేట్‌గా నా పర్సనల్ డైరీలో రాసుకుంటున్నాను"

"అదేంటి సడన్‌గా అంత మార్పు? నీ కవితలు అందరూ చదివేస్తున్నారనా? "

"అవును. నేను కవితలు రాసుకునేది కేవలం నా తృప్తికోసమే. వాటిమీద ఎవరి అభిప్రాయం నేను కోరుకోవటంలేదు."

"మనం రాసినదానిని ఎవరైనా మెచ్చుకుంటేనే కదా ఆనందం, తృప్తి కలిగేది" శ్రీనివాస్ అభిప్రాయం అర్థంకాక ప్రశ్నించింది సవిత.

"అది డబ్బుకోసం, ఫేమ్ కోసం రాసే వాళ్ల పరిస్థితి. అదే తనకోసం మాత్రమే రాసుకునే వ్యక్తి ఎదుటివాడి పొగడ్తలకంటే తనకు కలిగే ఫీలింగ్‌కే ఎక్కువ విలువ ఇస్తాడు"

"ఏమో... నీ భాష నాకు అర్థంకాదు..." ఆమె మాటలు పూర్తవుతూండగానే ఫోన్ మోగింది. శ్రీనివాస్ లిఫ్ట్ చేశాడు.

"హలో..."

"హలో... శ్రీనివాస్! నేను సింధుని"

"హాయ్! ఇంటి దగ్గరనుంచేనా? "

"అవును. నీతో పనుండి ఫోన్ చేశాను. నువ్వు ఖాళీగానే ఉన్నావా? లేక ఏమయినా పనుందా? "

"పనేంలేదు. సవిత వచ్చింది. ఇద్దరం సుత్తి కొట్టుకుంటున్నాం"

"ఓ.. సవిత ఉందా? సారీ... డిస్టర్బ్ చేసినట్టున్నాను. నేను మళ్లీ ఫోన్ చేస్తానులే"

"మరేం ఫరవాలేదు, చెప్పు"

"బావగానీ నిన్నేమయినా అడిగాడా? "

"బాగానే గెస్ చేశావు. 'సింధు రమేష్‌ని ప్రేమిస్తోందా? ' అని అడిగాడు"

"నువ్వేం చెప్పావు? "

"నాకు తెలియదని చెప్పాను. తను మాత్రం రమేష్ నిన్ను ప్రేమిస్తున్నాడని నిర్ణయించేసుకున్నాడు. ఇంకో విషయం. మీ బావకి నువ్వంటే చాలా ఇష్టం. తనుకూడా నిన్ను ప్రేమిస్తున్నాడు. కాకపోతే నువ్వో లాగూ తన సొంతమే కదా అనే ఉద్దేశంతో ఈ విషయం నీకెప్పుడూ చెప్పలేదు."

"నీకు తెలియదని చెప్పి మంచి పని చేశావు. కానీ నాకు ఇప్పుడు ఒక విషయం అర్థం కావటం లేదు. నాకు తెలిసినంతవరకూ బావలో ఎటువంటి చెడు లక్షణాలూ లేవు. అయినా నేను బావని కాదని రమేష్‌ని ఎలా ప్రేమించాను? నిజంగానే నేను ఆవేశంలో ఈ నిర్ణయం తీసుకున్నానా? "

"అది నీ తప్పు కాదు. సరిగ్గా ప్రేమ, పెళ్లి వంటి విషయాలు ఆలోచించే మెచ్యూరిటీ నీకు వచ్చేసరికి మీ బావ నీకు దగ్గర్లో లేడు. అదే సమయంలో రమేష్‌లో ఏదో ఒక చిన్న విషయం నిన్ను ఆకర్షించి ఉండచ్చు. కానీ ఇక మీదట ఏ నిర్ణయం తీసుకున్నా జాగ్రత్తగా ఆలోచించి తీసుకో. అదే సమయంలో మీ బావ కూడా నిన్ను ఇష్టపడుతున్నాడని మరిచిపోకు"

"అలాగే... నాకు మాత్రం ఈ విషయంలో చాలా టెన్షన్‌గా ఉంది. ఇప్పటివరకూ నాన్న ఒప్పుకుంటారో లేదో అని మాత్రం ఆలోచించేదాన్ని. నువ్వు చెప్పిన తర్వాత రమేష్‌తో నేను అడ్జెస్ట్ అవగలనా అని ఆలోచిస్తున్నాను. ఇప్పుడు మళ్లీ బావ విషయం రోజురోజుకీ పెద్ద సుడిగుండంలా తయారవుతోంది. అమ్మో.. అమ్మ వస్తోంది. రేపు కలుద్దాం" అని ఫోన్ పెట్టేసింది సింధు.

శ్రీనివాస్ కూడా ఫోన్ క్రెడిల్ చేశాడు.

"కానీ రమేష్ ఉదయం అలా చేయటం మంచిపనికాదు" ఏదో ఆలోచిస్తూ యథాలాపంగా అంది సవిత.

"ఎలా? " ప్రశ్నించాడు శ్రీనివాస్.

"సింధు వాళ్ళ బావ ఉండగా సింధుని దూరంగా తీసుకొని వెళ్ళి మాట్లాడటం"

"అందులో తప్పేముంది? "

"తప్పు లేదా? నువ్వేంటి రెండు రకా

లుగా మాట్లాడుతున్నావు. ఒకసారి రమేష్‌ని సపోర్ట్ చేసినట్టు మాట్లాడతావు. మరో సారి వ్యతిరేకంగా మాట్లాడతావు"

"రమేష్‌కి సింధు అంటే చాలా ప్రేమ. దానిని ప్రేమ అంటే సరిపోదేమో! పిచ్చి అనాలి. అందుకే అతను సింధు తన బావతో మాట్లాడటం తట్టుకోలేకపోయాడు. అది సింధుకి, నీకు, నాకు తప్పుగా కనిపించవచ్చు కానీ రమేష్‌లా స్ట్రయిట్ ఫార్వర్డ్‌గా ఉండే వ్యక్తికి అదే కరెక్టు. అందుకే రమేష్‌కి, సింధుకి సరిపడదని నేను చెప్పింది"

"అవును. అదీ కరక్ట్" అని చేతికున్న వాచ్‌వైపు చూసింది. టైము ఏడుగంటల ముప్ఫై నిమిషాలు అయినట్టు సూచిస్తోంది.

"అమ్మో చాలా టైమ్ అయ్యింది. నే వెళ్తున్నా... బై" అని సవిత అక్కడనుండి వెళ్ళిపోయింది.

"ఆగు. నీ బండి తీసుకొని రాకుండా వచ్చావు. ఎలా వెళ్తావు. నేను డ్రాప్ చేస్తాను"

"ఆ విషయమే మరిచిపోయాను. అలాగే రేపు మార్నింగ్ పిక్‌నిక్‌కి వెళ్ళేముందు ఇంటికొచ్చి నన్ను పికప్ చేసుకో" సర్వెంట్‌కి ఆర్డర్ జారీ చేసినట్టు చెప్పింది సవిత.

"ఎలా కనిపిస్తున్నాను నేను నీ కంటికి? అయినా రేపు నీ బండి తీసుకొని రాకపోతే నువ్వూ, సింధూ ఇక్కడ ఉండిపోతారు"

"మరి భాను?"

"భాను ఎవరిదో కెనిటెక్ హోండా తీసుకొస్తానంది"

"ఇంత బాధెందుకు. నేను డాడీతో చెప్పి కారు తీసుకుంటాను. నువ్వు పొద్దున్నే మా ఇంటికి రా"

"సరే" అన్నాడు శ్రీనివాస్.

★ ★ ★

చిరు చిరు సవ్వడులను సృష్టిస్తూ గోదావరి పరుగులు తీస్తోంది. పడమటకి జారుకుంటున్న సూర్యుని కిరణాలు ఏటవాలుగా నీటిపై పడి నీటిబిందువులు ముత్యాల్లా కనిపిస్తున్నాయి. గోదావరి పైనుండి వీస్తున్న పిల్లగాలి అక్కడి పూల సువాసనలతో కలిసి తోటలో నడుస్తున్న వారి మనసును పరవశింపజేస్తోంది.

"బ్యూటిఫుల్... చాలా అందంగా ఉంది భానూ ఈ ప్రదేశం. ఇంతకాలం ఎంతో దగ్గర్లో ఉండికూడా ఇంత అందాన్ని మిస్ అయినందుకు చాలా బాధపడుతున్నాను" ఆనందంలో తేలిపోతూ చుట్టూ చూస్తూ అన్నాడు శ్రీనివాస్.

క్రమపద్ధతిలో పెరిగి నిండుగా పూలతో ఉన్న మొక్కల మధ్య నడుస్తున్నారంతా. ఆ ప్రదేశం ఊరికి చాలా దూరంలో ఉండటంతో అక్కడ అంతా చాలా ప్రశాంతంగా ఉంది.

"ఇటువంటి ప్లేస్‌కి ఉదయాన్నే వచ్చి ఉంటే ఎంత బావుండేది. సాయంత్రం వరకూ సరదాగా గడిపేవాళ్ళంకదా! అయినా అంత అకస్మాత్తుగా సాయంత్రానికి వచ్చేశారేంటి?" కాస్త బాధగా ప్రశ్నించింది సింధు.

"ఇదిగో ఈ మేడంగారికి కుదరలేదట" సవితవైపు చూస్తూ అన్నాడు శ్రీనివాస్.

"ఐయామ్ వెరీసారీ... అనుకోకుండా డాడీ కోసం బయటకు వెళ్ళవలసివచ్చింది. అక్కడికీ నా కోసం మీరెందుకు ఆగిపోవటం. మీరు వెళ్ళండి, అని చెప్పాను నేను. కానీ శ్రీనివాస్ ఒప్పుకోలేదు" అంది సవిత.

"అవునులే... నువ్వు లేకుండా వాడెలా వస్తాడు?" లోగొంతుతో అన్నాడు చైతన్య.

"రేయ్..." చైతన్యవైపు సీరియస్‌గా చూస్తూ అన్నాడు శ్రీనివాస్.

"మీరు మాట్లాడుకుంటూ ఉండండి. నేను వెళ్ళి మా తాతయ్యను తీసుకొని వస్తాను" అని భాను తోటలో ఒక మూలగా ఉన్న పెంకుటింటి వైపు వెళ్ళింది. రెండు నిమిషాల్లో దాదాపు అరవై సంవత్సరాలు వయసున్న ఒక ముసలి వ్యక్తితో తిరిగివచ్చింది.





ఆయన దాదాపు ఆరు అడుగుల పొడవు ఉన్నారు. అంత వయసులో కూడా చాలా ఆరోగ్యంగా, చాలా చురుకుగా ఉన్నారు. భానుకి తాతయ్య అనగానే ఒక ముసలివ్యక్తి కర్రపట్టుకొని, కళ్ళజోడుతో భాను సాయంతో నెమ్మదిగా నడుచుకుంటూ వస్తారని ఊహించినవాళ్ళు ఆయనను చూసి ఆశ్చర్యపోయారు.

భాను ఫ్రెండ్స్‌నందరినీ తన తాతయ్యకు పరిచయం చేసింది.

"తాతగారూ... మీరు ఈ వయసులో కూడా ఇంత ఆరోగ్యంగా ఉండటానికి రహస్యం" సినిమా యాక్టర్‌ల చర్మసౌందర్యాన్ని అడిగే విలేకరిలా ప్రశ్నించాడు చైతన్య.

"కాలుష్యానికి దూరంగా... ప్రశాంతమైన వాతావరణంలో ఉండటమే" చెప్పాడాయన.

"ఈ వయసులో ఇంత దూరంలో ఉండటమెందుకు? మీరు కూడా భానూ వాళ్ళతోనే ఉండొచ్చుకదా!"

"నేను ఎన్నిసార్లు చెప్పానో... నా మాట వింటేకదా" చైతన్యతో తనూ గొంతు కలిపింది భాను.

"ఒకసారి మానవ సంబంధాలమీద నమ్మకం పోయింది. ఇప్పుడు సంతోషంగా ఉన్నాను. మరలా అటువంటిది ఏదయినా జరిగితే నేను తట్టుకోలేను బాబూ!" అన్నాడా పెద్దాయన.

"తాతయ్యా! ఇంతవరకూ నేనెప్పుడు అడిగినా 'నా మొక్కలే నా ప్రాణం. వాటిని వదిలి రాలేను' అనేవారు. ఈ రోజేంటి...?"

"ఇంతమంది పిల్లల్ని చూసేసరికి చెప్పాలని అనిపించింది. నా కొడుకు నన్ను వదిలి వెళ్ళిపోయేసరికి ఇంచుమించుగా మీ వయసువాడే. అందుకే ఈ విషయం మీకు చెప్తే మీరు అర్థం చేసుకుంటే నాకు కలిగిన బాధ మీ తల్లిదండ్రులకు కలగకుండా ఉంటుందని చెప్తున్నాను"

"అసలేం జరిగింది తాతయ్యా?"

"నా కొడుకు డిగ్రీ చదివే రోజుల్లో ఎవరో అమ్మాయిని ప్రేమించాడు. అదీ కులంగానీ అమ్మాయిని. అందుకు నేను ఒప్పుకోలేదు. దాంతో వారిచేత ప్రేమగా గుండెలమీద తన్నించుకొని పెంచిన ఈ ముసలి తండ్రి ప్రేమను కాదని... క్షణకాలంలో ఏర్పడిన ప్రేమే శాశ్వతం అనుకొని నన్నొదిలి వెళ్ళిపోయాడు"

"అందులో తప్పేముందండి? అయినా మీరు కులంవల్ల-వాళ్ళ పెళ్లికి అభ్యంతరం పెట్టి ఉండాల్సింది కాదు" అందరి మనసుల్లో ఉన్నమాట రమేష్ నోటినుంచి వచ్చింది.

"కులం అనేది మన పూర్వీకులు మనుషుల్ని విడదీయటానికి ఏర్పాటుచేసింది కాదు. భిన్న అభిరుచులు ఉన్న వ్యక్తులు ఒకచోట ఉండటం కష్టం. అందుకే ఒకేపని చేసేవారిని, ఒకే అలవాట్లు ఉన్నవారిని కొన్ని వర్గాలుగా పిలిచారు. అవి మనుష్యుల మధ్య సంబంధాలని పెంచుతాయని వారు ఊహించారు. అటువంటప్పుడు మనం వాటిని పాటించడంలో తప్పులేదు. కాకపోతే ఆ కులాలను అడ్డుగా పెట్టుకొని మారణకాండను సృష్టించటం మాత్రం తప్పు"

"మీరు ఎన్ని చెప్పినా... కులం అనేది ఇద్దరు వ్యక్తుల మధ్య పుట్టిన ప్రేమను వేరు చేయకూడదు"

"కులం ప్రసక్తి వదిలేయండి. మా కాలానికీ, మీ కాలానికీ పొంతన లేదు. నేను వాడి ప్రేమను కాదన్నాను. కొన్ని నెలల పాటు ప్రేమించిన అమ్మాయిని వాడు వదులుకోలేకపోయాడు. ఇరవై సంవత్సరాల నుంచి వాడిని ప్రేమిస్తున్న ఈ తండ్రి గురించి ఎందుకు ఆలోచించలేదు? ప్రేమ కోసం తల్లిదండ్రుల ప్రేమనే వదులుకోవాలా? మా కోసం ఒక అమ్మాయి ప్రేమను వదులుకోలేరా మీరు?" ఆయన చివరిమాటలు పలుకుతుంటే గొంతు తడబడటం స్పష్టంగా తెలుస్తూనే ఉంది. ఆయ

నలో బాధ పెరిగింది. ఇక అక్కడ ఉండ లేక ఇంటివైపు కదిలాడాయన.

"అక్కడ వాతావరణం భారంగా తయార య్యింది. అందరూ ఎవరి ఆలోచనల్లో వారు ఉన్నారు. సరదాగా గడపటానికని వచ్చి వాతావరణం అంత డల్‌గా ఉండటం నచ్చలేదు భానుకి.

"ఏయ్... ఏంటంతా అలా అయిపో యారు. తాతయ్య మాటలేం సీరియస్‌గా తీసుకోకండి. ఆయనకి కులాభిమానం ఎక్కువ. అయినా మా తాతయ్య చాలా తెలి వయినవాడు. ఆ తెలివితేటలు నాకు వచ్చా యంటారంతా!" నవ్వుతూ అంది భాను.

ఆమెకి తెలుసు తను ఏదయినా అంటే మహేష్ దానికి కౌంటర్‌గా ఏదో ఒకటి మాట్లాడతాడని. అలాగయినా వాతావరణం తేలిక పడుతుందని ఆమె ఉద్దేశం.

"అంటే... నువ్వు చాలా తెలివైనదానినం టావ్? " ఆమె ఉద్దేశాన్ని నిజం చేస్తూ ప్రశ్నించాడు మహేష్.

"అందులో నీకు ఎటువంటి అనుమానం అవసరంలేదు"

"అయితే సరే... ఇప్పుడు నేను నీకో చిన్న క్విజ్ పెడతాను"

"సారీ... ఇటువంటివన్నీ నాకు ఇష్టం ఉండదు. నాకున్న అపూర్వమైన తెలివితే టల్ని ఇటువంటి చిన్న విషయాలకోసం వృధా చెయ్యను"

"క్షమించండి మేడం... నేను పొరపా టున క్విజ్ అన్నాను. నాకు కొన్ని ధర్మసం దేహాలు ఉన్నాయి. మీరు వాటిలో కనీసం రెండింటినయినా తీరిస్తే మీరు ప్రజ్ఞా వంతులని మేం నమ్ముతాం"

"మొత్తం నీ సందేహములు ఎన్ని శిష్యా? "

"మూడు మాతా!"

"మూడు మాత! ఆమె ఎవరు? " వీళ్ళిద్దరి మధ్యలోకి ఎంటర్ అవుతూ అన్నాడు చైతన్య.

"రేయ్... నువ్వు మధ్యలోకి రాకు" అన్నాడు మహేష్.

"రెండేమిటి శిష్యా... మూడు సందేహ ములనూ నివృత్తి చేసేదము. అడుక్కో నుము. చీ...చీ... అడుగుకొనుము"

"అడుగు కొనటానికి నా దగ్గర డబ్బులు లేవు కానీ ముందు మీరు ఈ ప్రశ్నలకి సమాధానం చెప్పండి" అని గొంతు సవరిం చుకొని ప్రశ్నలు అడగటం మొదలు పెట్టాడు.

"ఒక ఫ్రిజ్‌లో బాటిల్‌ని మూడు స్టెప్స్‌లో పెట్టాలి. ఎలా? "

"ఛీ... ఇటువంటి చచ్చు ప్రశ్నలకి సమా ధానం చెప్పి మా మేధస్సుని మేం కించప రుచుకోలేం" గంభీరంగా ఫోజు పెడుతూ చెప్పింది భాను.

"నీకు అంత అవసరం లేదుగానీ... సమా ధానం చెప్పు"

"ఈ మాత్రం తెలియదా? ఫ్రిజ్ డోర్ తీస్తాం, బాటిల్ అందులో పెడతాం. ఫ్రిజ్ డోర్ మూసేస్తాం. త్రీ స్టెప్స్ వెరీ సింపుల్" అందరి వైపుగా గర్వంగా చూస్తూ చెప్పింది భాను.

"అందరూ అభినందన పూర్వకంగా తప్పట్లు కొట్టారు.

"ఇంకా రెండు ప్రశ్నలున్నాయి. ఆ రెండింటిలో ఏ ఒక్కటి చెప్పినా నువ్వు తెలి వైన దానివని ఒప్పుకుంటాను"

"చెప్పినమాటే మళ్ళీ మళ్ళీ ఎందుకు చెప్తావు. ముందు ప్రశ్నలు అడుగు"

"ఒంటెని ఫ్రిజ్‌లో నాలుగు స్టెప్స్‌లో పెట్టాలి. ఎలా? ఇంకో విషయం ఫ్రిజ్‌లో ఒంటె ఎలా పడుతుంది. అని దీర్ఘంగా ఆలోచించకు. ఫ్రిజ్ ఒంటె పట్టేటంత పెద్దదే"

"అయినా నాలుగు స్టెప్స్ ఎందుకు? మూడు సరిపోతాయిగా? " అమాయకంగా ఫేస్ పెట్టి ప్రశ్నించింది భాను.

"ఛా... అలాగా! మాకు తెలియదులే.




నేను అడిగింది ఎలా చెప్తావో చెప్పటమే నీ బాధ్యత"

"ఆ... ముందు ఫ్రిజ్ డోర్ తీసి తరువాత డీప్ ఫ్రీజర్ డోర్ తీసి, ఒంటెను అందులో పెట్టి డోర్ వెయ్యాలి"

"ఏ డోర్ వేస్తావు? రెండు డోర్‌లూ వేస్తే ఐదు స్టెప్‌లు అవుతాయి"

"ఫ్రిజ్ డోర్ వేస్తే, డీప్ ఫ్రీజర్ డోర్ ఆటోమేటిక్‌గా మూసుకుపోతుందిగా? "

"లాజిక్‌లు వద్దమ్మా! డోర్ తీస్తే డోర్ వెయ్యాలి. అంతెందుకు ఆ ఫ్రిజ్‌కి డీప్ ఫ్రీజర్ లేదు" ఆమె అనుమానాన్ని నివృత్తి చేశాడు మహేష్.

భాను ఐదు నిమిషాలు చాలా తీవ్రంగా ఆలోచించి ఇక తన వల్ల కాదని పెదవి విరిచింది. అక్కడ మిగిలిన వారి పరిస్థితి కూడా అలాగే ఉంది.

"అయితే నేనే చెప్పేస్తున్నా. భానూ మరి నీకు ఛాన్సెస్ తగ్గిపోతున్నాయి"

"అంత ఫోజు వద్దమ్మా! ఈ ప్రశ్న పోయినా మూడో ప్రశ్న ఉందిగా. దానికి గ్యారంటీగా సమాధానం చెప్పేస్తాను. ముందు నువ్వు ఈ ప్రశ్నకి సమాధానం చెప్పు"

"సరే... జాగ్రత్తగా విను. మొదట ఫ్రిజ్ డోర్ తీస్తాం. తరువాత ఫ్రిజ్‌లో ఇందాక పెట్టిన బాటిల్‌ని బయటకు తీస్తాం. ఇప్పుడు ఒంటెను లోపల పెట్టి డోర్ మూసేస్తాం. ఫోర్ స్టెప్స్ సరిపోయాయికదా!"

"వింటున్న వాళ్ళకి మొదట అర్థం కాలేదు. అర్థమైన తరువాత నవ్వకుండా ఉండలేకపోయారు.

"ఇది అన్యాయం... మొదటి ప్రశ్నకి, రెండో ప్రశ్నకి సంబంధం ఉందని నువ్వు చెప్పలేదు. నేను ఒప్పుకోను" చిన్నపిల్లలా తల అడ్డంగా ఊపుతూ అంది భాను.

"అటువంటివి చెప్పరమ్మా... నువ్వే ఆలోచించాలి. అప్పుడేకదా నీ తెలివితేటలు తెలిసేది. ఫరవాలేదులే నీకో ఇంకొక ఛాన్స్ ఉంది. ఈ ఆఖరి ప్రశ్నకి సమాధానం చెప్పినా చాలు. నువ్వు తెలివైనదానివని ఒప్పుకుంటాను"

"సరే... అడుగు"

"ఒక అడవిలో కుందేలు బర్త్‌డే పార్టీ చేసుకుంటోంది. ఆ పార్టీకి ఒక్క జంతువు తప్ప అన్నీ వచ్చాయి. ఏ జంతువు రాలేదు? ఎందుకు రాలేదు? "

"తాబేలు రాలేదు" వెంటనే చెప్పింది భాను.

"ఎందుకు? "

"రన్నింగ్ రేస్‌లో కుందేలుని ఓడించింది కదా! ఆ కోపంలో కుందేలు, తాబేలుని పిలిచి ఉండదు. ఇప్పటికయినా ఒప్పుకుంటావా నేను తెలివైనదాన్నని"

"ఏంటి... ఒప్పుకునేది? నువ్వు చెప్పిన సమాధానం తప్పు. తాబేలు కూడా ఆ పార్టీకి వచ్చింది"

"తాబేలు కూడా వచ్చిందా! అయినా అసలు కుందేలు బర్త్‌డే చేసుకోవటం ఏమిటి? అంతా సుత్తి. అసలు ఇటువంటి ప్రశ్నలు ఏమిటి? "

"అబ్బా... ఇప్పటికి వచ్చిందా తెలివి. తెలిస్తే సమాధానం చెప్పు. లేదంటే ఓడిపోయానని ఒప్పుకో. అంతేగానీ అడ్డంగా మాట్లాడకు"

"అయితే నేనే కాదు. ఇక్కడ ఎవర్నయినా చెప్పమను చూద్దాం" చాలెంజ్ చేస్తున్నట్టు అంది భాను.

"ఒరేయ్... ఇది ప్రెస్టేజ్ ఇష్యూ. ఎవరో ఒకరు. సమాధానం చెప్పండ్రా"

"నేను చెప్తాను" అన్నాడు చైతన్య.

"చెప్పు... చూద్దాం" అంది భాను.

"ఒంటె"

"ఒంటా! దానికేమయ్యింది పాపం"

"ఇంతకు ముందేగా దాన్ని నువ్వు ఫ్రిజ్‌లో పెట్టావు" నవ్వుతూ అన్నాడు చైతన్య.

భానుతో సహా అందరూ అతనితో

నవ్వులు కలిపారు.

"ఎక్కడ చదివావురా ఈ ప్రశ్నలు? " ప్రశ్నించాడు శ్రీనివాస్.

"నిన్న ఏదో చిన్న పిల్లల పుస్తకంలో చదివాను" చెప్పాడు మహేష్.

"చిన్న పిల్లలకే కాదు పెద్దవాళ్ళకు కూడా చాలామందికి ఈ ప్రశ్నలకి సమాధానం చెప్పటం కష్టమే అవుతుంది" అంది సవిత.

"కనీసం చైతన్య చివరి ప్రశ్నకయినా సమాధానం చెప్పాడు. నాకయితే చిన్న ఆలోచన కూడా రాలేదు"

తరువాత అందరూ ఒక గంట అక్కడ కాలక్షేపం చేసి తిరిగి ప్రయాణం అయ్యారు.

అందరినీ ఎవరి ఇంటివద్ద వాళ్ళను దింపిన తరువాత సవిత, శ్రీనివాస్ కారులో మిగిలిపోయారు. కారు సవిత ఇంటివైపు పరుగులు తీస్తోంది.

"ఈరోజు హ్యాపీగా గడిచిపోయింది. రేపు ఏం చేద్దాం" ప్రశ్నించింది సవిత.

"సండేకదా... టి.వి.లో ప్రోగ్రామ్స్ చూడటమే" రోడ్డుపైనుంచి దృష్టి మరల్చకుండా కారు డ్రైవ్ చేస్తూ సమాధానం చెప్పాడు శ్రీనివాస్.

"టి.వి. ఎప్పుడయినా చూడొచ్చు హాలీడే వచ్చినప్పుడు సరదాగా బయటకు వెళ్ళొచ్చు కదా"

"ఈరోజు వెళ్ళాం సరిపోదా"

"కాదు. రేపు మనమిద్దరం సినిమాకి వెళదాం. ప్లీజ్"

"సరే"

"అయితే రేపు ఉదయం మీ ఇంటికి వస్తాను. . మార్నింగ్‌షోకి రెడీగా ఉండు" ఇంతలో కారు సడన్ బ్రేక్‌తో ఆగింది.

"ఏంటి... కారు ఆపావు? " ప్రశ్నించింది సవిత.

"మీ ఇల్లు వచ్చింది" అని కారుని పార్క్ చేసి అక్కడ ఉన్న తన బైక్‌ని తీసుకొని కిక్ కొట్టాడు.

"ఉదయం... నీ కోసం వెయిట్ చేస్తూ ఉంటాను" అని బైక్‌ని ముందుకి దూకించాడు.

★ ★ ★

"సింధు కుర్చీలో కూర్చొని ఆలోచిస్తూ ఉంది. ఆమె హృదయమంతా చాలా భారంగా ఉంది. ఒకవైపు రమేష్ గురించి ఆలోచన, రెండవవైపు ఆమె నాన్నమ్మకు ఆరోగ్యం దెబ్బతినడం, ఆమెను హాస్పిటల్‌కి తీసుకొని వెళ్ళటంతో, ఆమెకు ఎలా ఉందో నన్న కంగారు సింధు బాధను రెట్టింపు చేస్తున్నాయి. ఆమె ఆలోచనలు ఎక్కడెక్కడో తిరిగి మరలా రమేష్ వద్దకు వచ్చి ఆగాయి.

"రమేష్‌ని నేను ఎందుకు లవ్ చేశాను? తన్ను తానే ప్రశ్నించుకుంది సింధు. తను నాతో చాలా క్లోజ్‌గా ఉండేవాడు. ఎప్పుడూ సరదాగా మాట్లాడుతూ, నేను డల్‌గా ఉంటే తిరిగి హుషారుగా మాట్లాడేవరకు నన్ను నవ్వించటానికి ఎంతో కష్టపడేవాడు. ఎప్పుడూ నన్ను చూడాలని, నాతో మాట్లాడాలని, నాతో ఎక్కువ సమయం గడపాలని ఉత్సాహం చూపించేవాడు. అతని ప్రతీ మాటలోనూ నాపై ఇష్టాన్ని చూపించేవాడు. వీటిని చూసి నేను రమేష్‌ని ప్రేమించటం తప్పా? అతని స్వభావాన్ని నేను పూర్తిగా అబ్జర్వ్ చేయలేకపోయానా? ఒకవేళ శ్రీనివాస్ చెప్పింది కరెక్టే అయితే నేను అడ్జస్ట్ అయ్యి రమేష్‌తో కలిసి ఉండలేనా? నేను అంత డీప్‌గా రమేష్‌ని ప్రేమించలేదా? నా ప్రేమ సిన్సియర్ అయితే గొడవలు ఎందుకు వస్తాయి? ' ఇలా ఎంత ఆలోచించినా ఆమెకు ఏం చెయ్యాలో అర్థం కావటం లేదు. అప్రయత్నంగానే ఆమె కళ్లలోనుంచి నీళ్లు భారంగా క్రిందకు జారాయి. ఇంతలో ఇంటి తలుపు కొడుతున్నట్టుగా గట్టిగా శబ్దం వినిపించేసరికి ఆలోచనల్లోంచి బయటకు వచ్చి పరిగెత్తుకొంటూ వెళ్ళి తలుపు తీసింది.




"ఏం చేస్తున్నావు లోపల? తలుపు తీయ టానికి ఇంతసేపు పట్టిందేం" ప్రశ్నించింది సింధు తల్లి పార్వతి తన అత్తగారి చేతిని పట్టుకొని లోపలకు నడిపిస్తూ. సింధు కూడా ఆమె రెండవ చేతిని పట్టుకొని నెమ్మదిగా నడిపించి లోపలకు తీసుకొని వచ్చి మంచంమీద పడుకోబెట్టారు.

"డాక్టర్‌గారు ఏమన్నారమ్మా?" ప్రశ్నించింది సింధు తల్లిని.

"నరాలు చాలా బలహీనంగా ఉన్నాయట. మందులు రాశారు. సెలైన్లు పెట్టాలన్నారు. హాస్పిటల్ అంతా ఒకటే వాసన. అక్కడ ఉంటే రోగం ఇంకా ఎక్కువ అవుతుందని వచ్చేశాం. నర్సు వచ్చి సెలైన్లు పెడుతుంది" చెప్పింది పార్వతి.

"పిన్ని, బాబాయ్... ఏరి?"

"మందులు కొనుక్కొని వస్తారు. నాన్న ఇంకా పొలంనుంచి రాలేదా"

"రాలేదమ్మా!" అని చెప్పి నాన్నమ్మ పక్కన కూర్చుంది.

ఆమె మంచంమీద జీవచ్ఛవంలా ఉంది. మనిషిలో ఎటువంటి కదలికా లేదు. మధ్య మధ్యలో ఆయాసం వస్తున్నట్టుగా బలంగా ఊపిరి పీలుస్తోంది. ఆమె బాధను సింధు చూడలేకపోతోంది. ఏ క్షణాన్నయినా ఆమె మనసు ద్రవించి కన్నీరులా ప్రవహించేలా ఉంది. అందుకే ఇక అక్కడ ఉండలేక వేరే గదిలోకి వెళ్ళిపోయింది.

గదిలోకి వెళ్ళేసరికి ఏకాంతంగా ఉండటంతో ఇక ఏడుపును ఆపుకోలేక పోయింది సింధు. కొద్దిసేపటివరకు అలా ఏడుస్తూనే కూర్చుంది. అలా ఏడవటం వల్ల కళ్ళు కొద్దిగా ఉబ్బి భారంగా తయారయ్యాయి.

"సింధూ!" అంటూ తల్లికేక వినిపించేసరికి గబగబా కళ్ళు తుడుచుకొని బయటకు వెళ్ళింది.

"సింధూ... ఏమయ్యింది? ఒంట్లో బాగానే ఉందా?" సింధు మొహం చూస్తూ ప్రశ్నించింది పార్వతి. సింధు కంఠం వద్ద చేయిపెట్టి చూసింది జ్వరం ఉందేమోనన్న అనుమానంతో.

"బాగానే ఉందమ్మా"

"మరేంటి మొహం అంతా అలా ఉబ్బిపోయింది" కంగారుగా అడిగింది పార్వతి.

"ఎక్కువసేపు నిద్రపోయాను కదా అందుకే!"

"అంతేనా? నేను కంగారుపడ్డాను. ముందు వెళ్ళి నీళ్ళతో మొహం కడుక్కో"

సింధు మొహం కడుక్కొని కిచెన్‌లోకి వెళ్ళి తల్లికి సాయం చేయసాగింది. ఇంతలో సత్యనారాయణ పొలంనుండి తిరిగివచ్చాడు. సత్యనారాయణ సింధు తండ్రి.

"సింధూ!" అంటూ పిలిచాడు కూతురుని లోపలకు వస్తూనే. సింధు కిచెన్‌లోనుంచి తండ్రి వద్దకు వచ్చింది. సత్యనారాయణ, సింధుని ఒకసారి ప్రేమగా తాకి ఆమె చెంపను నిమిరాడు.

"వెళ్ళమ్మా!" అన్నాడు.

"ఎందుకు పిలిచారు నాన్న?" ఆయన అన్నది ఏమిటో అర్థంకాక ప్రశ్నించింది సింధు.

"ఏంలేదమ్మా! ఉదయం నేను పొలానికి బయలుదేరేసరికి నువ్వు లేవలేదు. నిన్ను చూడకుండానే వెళ్ళిపోయాను కదా. అందుకే ఒకసారి నీ మొహం చూద్దామని పిలిచాను అంతే"

ఆయన మాటలు సింధుని కదిలించాయి. 'అందరూ నాపై ఇంత అభిమానాన్ని చూపిస్తుంటే నేను వీళ్ళందరినీ మోసంచేస్తున్నానా?' అనుకుంది మనసులో. అయినా నాన్న ఒప్పుకోకపోతే కదా వీళ్ళను మోసంచేసినట్టు. ప్రస్తుతానికి నిర్ణయించుకోవలసింది నేనే కదా. వెయిట్ చేసి చూద్దాం ఏం జరుగుతుందో అని తనకి తాను సర్దిచెప్పుకుంది.

ఇంతలో సింధు పిన్ని, బాబాయ్ వచ్చారు. వారి వెనుకే నర్సు వచ్చి మంచం





మీద ఉన్న ఆమెకు సెలైన్ పెట్టి వెళ్ళిపో యింది.



**ర**మేష్... నిన్న నీకో పెళ్ళి సంబంధం వచ్చిందిరా!" చెప్పింది రమేష్ తల్లి పద్మా వతి.

"ఎంతిస్తారట కట్నం" ప్రశ్నించాడు రమేష్.

"ఐదు లక్షలు కట్నం ఇస్తారట. నీకు చదువు పూర్తవగానే వాళ్ళే ఉద్యోగం వేయిం చుకుంటారట. అమ్మాయి ఫొటో కూడా చూశాం. నాకే కాదు మీ నాన్నగారికి కూడా బాగా నచ్చింది"

"అయితే ఆయన్నే చేసుకోమను"

"ఏరా! ఎకసెక్కాలాడుతున్నావా? "

"లేకపోతే ఏంటమ్మా, అప్పుడే పెళ్లేంటి? ఇంకా నాకు ఉద్యోగం రావాలి, నా సంపాద నతో నేను కొంతకాలం బతకాలి తరువాత పెళ్ళి"

"వాళ్ళు కూడా అదే చెప్పారు. నువ్వు పెళ్ళి ఇప్పుడే చేసుకోవాలనేం లేదు. ముందు నిశ్చితార్థం చేసుకుంటే తరువాత నువ్వు జీవితంలో స్థిరపడ్డాక పెళ్ళి చేసుకో వచ్చు అయినా ఉద్యోగం వాళ్లే వేయిస్తా మంటున్నారు ఏంటి సమస్య? "

"ఎవడో వేయించే ఉద్యోగం నాకు అవస రంలేదు. నేను ఉద్యోగం సంపాదించుకోగ లను. అప్పటివరకు పెళ్ళి ప్రసక్తే లేదు"

"ఎందుకు చేసుకోవు? అనవసరంగా మంచి సంబంధాన్ని పోగొట్టుకోవటం ఎందుకు? కాళ్ల దగ్గరకు వచ్చిన అదృష్టాన్ని కాదు పొమ్మనకూడదు"

"అదృష్టమో... దురదృష్టమో నేను మాత్రం చేసుకోను"

"అంతా మొండి పట్టుదల. ఒకళ్ళ మాట వినవు కదా. ఈ విషయంలో ఇక నాకేం సంబంధంలేదు. పెళ్ళి ఎందుకు వద్దంటు న్నావో నువ్వే వెళ్ళి మీ నాన్నతో చెప్పు"

"అమ్మా ఇంతవరకూ వచ్చాక డొంక తిరు గుడు ఎందుకు? నేను సింధుని ప్రేమిస్తు న్నాను. సింధునే పెళ్ళి చేసుకుంటాను" తెగేసి చెప్పాడు రమేష్.

"సింధు అంటే ఆ సత్యనారాయణ కూతురా? " కాస్త కంగారుగా అడిగింది పద్మ.

"అవును... ఏం? "

"ఆ అమ్మాయి అయితే మీ నాన్న ఒప్పు కోరేమో? "

"ఎందుకట? ఆ అమ్మాయికేం? "

"ఆ అమ్మాయి గురించి కాదు. ఆమె నాన్న గురించి. మీ నాన్న పేకాట ఆడి డబ్బులు తగలేస్తారని, ఏ పనీ చెయ్యరని మీ నాన్నని ఆయన చులకనగా చూస్తాడు. అందుకే ఆయనంటే మీ నాన్నకు పెద్దగా ఇష్టం ఉండదు"

"అది నిజమేగా! అందులో బాధపడటా నికి ఏముంది? "

"తప్పురా! నాన్న గురించి అలా మాట్లా డకు. ఆయన వింటే బాధపడతారు"

"ఎవరో బాధ పడతారని మనసులో మాట దాచుకునే స్వభావం కాదు నాది. నువ్వూ, నాన్న ఎవరు ఒప్పుకున్నా ఒప్పుకో కపోయినా నేను సింధునే చేసుకుంటాను.

అంతే"

"ఆ మొండి పట్టుదలే వద్దు. అది నిన్ను ఎక్కడికి తీసుకొని వెళ్తుందోనని నాకు భయంగా ఉంది. ఇంట్లో ఒప్పుకోకుండా మీ ఇద్దరూ పెళ్ళిచేసుకొని మాత్రం ఏం సుఖప డతారు"

"సుఖాలే కాదు కష్టాలు ఎదుర్కోవడానిక యినా మేం రడీ"

"అది చెప్పినంత తేలిక కాదు. యవ్వ నంలో ఉన్న ఉడుకు, ఉత్సాహం వయసు పెరిగే కొలదీ ఉండవురా. అప్పుడు జీవితం భారంగా అనిపిస్తుంది. ప్రేమించిన మనిషే శత్రువుగా కనిపిస్తుంది"

"అమ్మా... నేనేం చిన్న పిల్లాణ్ణికాదు నీతి బోధనలు వినటానికి. ఏది మంచో, ఏది చెడో తెలుసుకోగలిగే వయసు నాకూ వచ్చింది. నువ్వు ఒప్పించగలిగితే నాన్నను ఒప్పించు. నీకే ఇష్టం లేకపోతే ఈ విషయం గురించి మర్చిపో. ఏది ఏమైనా నేను సింధునే పెళ్ళిచేసుకుంటాను. మీరు ఒప్పుకుంటే మీతోనే ఉంటాను. లేదంటే బయటకు వెళ్ళయినా పెళ్లిచేసుకుంటాను. దట్స్ ఆల్" అని అక్కడనుండి విసురుగా వెళ్ళిపోయాడు.

"వీణ్ణి ఆ భగవంతుడే బాగుచేయాలి" అనుకొంది పద్మావతి చిన్నగా నిట్టూర్పు విడుస్తూ.

★ ★ ★

శ్రీనివాస్ రిసీవర్ చేతిలోకి తీసుకొని నెంబరు డయిల్ చేశాడు.

"హలో..." వినిపించింది అవతలివైపు నుంచి

"హలో... ఆంటీ... నేను శ్రీనివాస్‌ని సవిత లేదా ఆంటీ"

"లేదమ్మా! మీ ఇంటికే అనుకుంటాను బయలుదేరింది"

"ఓ. కే. ఆంటీ. ఉంటాను" అని ఫోన్ క్రెడిల్ చేశాడు.

సవిత తన దగ్గరకు బయలుదేరిందా? ఎట్టి పరిస్థితుల్లోనూ ఈ ఛాన్స్ వదులుకో కూడదు. అనుకొని ఆలోచించసాగాడు. వెంటనే మెరుపుగా అతనికి ఒక ఆలోచన వచ్చింది. మరుక్షణమే దానిని అమలులో పెట్టాడు.

ముందుగా ఒక వైట్ పేపర్ తీసుకొని దానిపై తను, సవిత ప్రేమ గురించి వాదిం చుకున్న రోజు డేట్ వేశాడు. తరువాత చాలా ఫాస్ట్‌గా పేపర్ నిండా మేటర్ రాశాడు. తరువాత కాగితాన్ని ఉండలా నలి పేసి మరలా దానిని విడదీసి మడతపె ట్టాడు. ఆ కాగితాన్ని ఒక బుక్‌లో బయ టకు కనిపించేలా ఉంచి ఆ బుక్‌ని టేబు ల్‌పై పెట్టాడు.

తరువాత సవిత వస్తుందో రావట్లేదో అని కిటికీ దగ్గరకు వెళ్ళి చూశాడు. అప్పుడే సవిత మెయిన్‌గేట్ దాటి లోపలకు వస్తూ కనిపించింది. శ్రీనివాస్ హుషారుగా విజిల్ వేసి, గుండ్రంగా తిరిగి, టవల్ తీసుకొని బాత్‌రూమ్‌లోకి దూరాడు.

సవిత శ్రీనివాస్ రూమ్‌లోకి వచ్చేసరికి బాత్‌రూమ్‌లోనుంచి నీళ్లశబ్దం వినిపిం చింది. ఆమె బాత్‌రూమ్ తలుపు దగ్గరకు వెళ్ళింది.

"శ్రీనివాస్ త్వరగా రా!" గట్టిగా అరిచింది సవిత.

"వచ్చేస్తున్నా... ఫైవ్ మినిట్స్. నువ్వు కూర్చో" అదే స్థాయిలో జవాబిచ్చాడు.

సవిత టేబుల్ ముందున్న కుర్చీలో కూర్చుంది. ఎదురుగా టేబుల్‌పై ఏదో బుక్ కనిపించేసరికి అది ఏమిటో చూద్దా మని చేతిలోకి తీసుకొంది. మొదటగా ఆమెకు శ్రీనివాస్ పెట్టిన కాగితం కనిపిం చింది. ఆమె దానిని తీసి చదవటం ప్రారం భించింది.

"ఈ రోజు నేను చేసిన పని తప్పో ఒప్పో అర్థంకావటంలేదు. ప్రేమ మీద నా అభిప్రాయాన్ని తన ముందు చెప్పాను. ఆమె దానిని తప్పుగా అర్థంచేసుకుంటే ఇక




ఆమె ప్రేమ నాకు దొరకటం కష్టం. ఆమె నాకు దక్కకపోతే నేను బతకటం కూడా కష్టమే. ఆమె నన్ను అర్థంచేసుకుంటుందనే అనుకొంటున్నాను. నా గుండె భారంగా ఉండి ఎవరికి చెప్పుకోవాలో అర్థంకాక ఈ కాగితంమీద రాస్తున్నాను. అందుకేనేమో పెద్దలు డైరీ రాయటం అలవాటు చేసుకో మంటారు. ఒకవేళ నేను ఆ అలవాటు చేసుకున్నా నా డైరీ మొత్తం ఆమె పేరు తోనే నిండిపోతుందేమో? "సవితా!... ఐ లవ్ యు" అని రాసి ఉంది.

అది చదివి ఆమె ప్రేమ హృదయం మురిసిపోయింది. ఎవరెస్ట్ శిఖరాన్ని అధిరో హించినంత ఆనందంతో ఆమె మనసు గాలిలో తేలిపోతోంది. తనపై అతనికి అంత ప్రేమ ఉన్నందుకు చాలాచాలా సంతోషంగా ఉంది. ఇప్పుడే వెళ్ళి ఐ టూ లవ్‌యూ అని చెప్పేయాలని ఉంది. కానీ ఎలాగయినా అతని అభిప్రాయం తప్పు అని నిరూపించాలని ఉంది. అందుకే తన కోరి కను బలవంతంగా అణచుకొంటోంది.

ఏమీ తెలియనట్టుగా పేపర్ ఎలా ఉండేదో అలానే పెట్టేసి కుర్చీలో నుంచి లేచి గదిలో అటూఇటూ తిరగసాగింది. ఇంతలో శ్రీనివాస్ బాత్‌రూమ్‌లో నుంచి బయటకు వచ్చాడు. పుస్తకాన్ని చూసి కాస్త కంగారుపడుతున్నట్టు నటిస్తూ టేబుల్ దగ్గ రకు వెళ్ళి ఆ పేపర్‌ని ఆమెకు కనిపించ కుండా దాచటానికి అన్నట్లుగా చేతిలోకి తీసుకున్నాడు. ఇదంతా మాత్రం ఆమెకు కనిపించేలానే చేశాడు.

అతని అవస్థ చూసి చిన్నగా నవ్వుకొంది సవిత. ఆ నవ్వు చాలు నా ప్రయత్నం ఫలించిందని తెలియటానికి అనుకున్నాడు శ్రీనివాస్.

"ఏంటంత కంగారు పడుతున్నావ్? ఏముందా బుక్‌లో? " అమాయకంగా మొహం పెడుతూ ప్రశ్నించింది సవిత.

"నేనా... నేనేం కంగారుపడడంలేదే? "

"కంగారుపడడంలేదా? ఆ బుక్ ఒకసారి ఇలా ఇవ్వు"

"ఎందుకు? అది రఫ్ నోట్ బుక్. దాంతో నీకేం పని" అని ఆ బుక్‌ని డస్క్‌లో పెట్టేశాడు. "నువ్వేంటి ఇలా వచ్చావు" అన్నాడు టాపిక్ డైవర్ట్ చేస్తూ.

"అదేంటి అలా అడుగుతున్నావ్? సిని మాకి వెళ్దామని చెప్పాను కదా? "

"సినిమాకా? సారీ... నాకు ఖాళీలేదు. అయామ్ టూ బిజీ" స్టైయిల్‌గా అన్నాడు శ్రీనివాస్.

"అంత కటింగ్ వద్దమ్మా. ఎవరికోసం రావో చూస్తానుగా"

"ఏంటి నువ్వు చూసేది? " అన్నాడు శ్రీని వాస్. వాళ్ళ సంభాషణ బ్రేక్ చేస్తూ ఫోన్ రింగ్ అయ్యింది. లిఫ్ట్ చేశాడు శ్రీనివాస్.

"హలో..." అన్నాడు శ్రీనివాస్.

"... ... ..."

"హాయ్ భానూ! నువ్వా. ఏంటి ఇలా ఫోన్ చేశావు. ఎనీథింగ్ స్పెషల్"

"... ... ..."

"లేదు. పనేంలేదు. అయినా నువ్వు సినిమాకి రమ్మంటే పనుంటే మాత్రం రావడం మానేస్తానా చెప్పు" అంటూ క్రీగంట సవితవైపు చూశాడు. సవిత అత నివైపు సీరియస్‌గా చూస్తోంది. శ్రీనివాస్ చిన్నగా నవ్వుకున్నాడు.

"... ... ..."

"ఆ... ఆ కోతి ఇక్కడే వుంది. అయినా తననెందుకు తీసుకొని వస్తాను. మన మధ్య పానకంలో పుడకలా. నేనొక్కడినే వస్తాను" అన్నాడు శ్రీనివాస్.

అతని మాటలకు సవితకు ఎక్కడలేని జలసీ వచ్చేసింది. వెంటనే శ్రీనివాస్ దగ్గ రకు వెళ్ళి అతని చేతిలోంచి రిసీవర్ లాగే సుకుంది.

"ఏయ్... నిన్ను" అని భానుని తిట్ట బోతూ ఆగిపోయింది. అయోమయంగా

శ్రీనివాస్‌వైపు చూసింది. శ్రీనివాస్ సవితను చూసి నవ్వుతున్నాడు.

"ఏంటిది... డయల్ టోన్ వస్తోంది. ఇప్పటివరకూ నువ్వు భానూతోనే మాట్లాడావా? " కన్ఫ్యూజ్‌డ్‌గా ప్రశ్నించింది సవిత.

"ఊహు... నేనెవరితోనూ మాట్లాడలేదు" అదే నవ్వును కంటిన్యూ చేస్తూ చెప్పాడు శ్రీనివాస్.

"మరి ఫోన్ రింగ్ అయ్యింది కదా"

"అవును... రింగ్ అయ్యింది. కానీ నేను లిఫ్ట్ చేసేసరికి కట్ అయ్యింది" అని బిగ్గరగా నవ్వేశాడు. ఆ నవ్వు చూసి సవితకు శ్రీనివాస్‌ని చంపేయాలన్నంత కోపం వచ్చేసింది.

"నేను నీకు చాలా లోకువ అయిపోయానే" అంది అతనివైపు కోపంగా చూస్తూ.

"నువ్వెందుకు లోకువ అవుతావు? "

"నీ వెనుక తిరుగుతున్నానని నన్ను చులకనగా చూస్తున్నావు నువ్వు"

"నువ్వు నా వెనుక తిరుగుతున్నావా? ఎందుకు? నీకేం పనిలేదా? "

"ఎందుకేంటి... అదే... ఫ్రెండ్లీగా" మాటలు తడుముకుంటూ చెప్పింది సవిత.

"ఫ్రెండ్లీగా అయితే వెనకాల తిరగరమ్మా! కలిసి తిరుగుతారు. ప్రేమిస్తేనే వెనకాల తిరుగుతారు. అంటే నువ్వు నన్ను ప్రేమిస్తున్నావు అవునా? "

"మాట్లాడితే చాలు ప్రేమ... ప్రేమ. నేను నిన్ను ప్రేమించట్లేదంటే వినవే. ఇక నేను నీతో మాట్లాడను. నే వెళ్ళిపోతున్నా" అని కోపంగా అక్కడనుంచి వెళ్ళిపోబోయింది. శ్రీనివాస్ ఆమె చేతిని పట్టుకొని ఆపాడు.

"ఏంటి... కోపమొచ్చిందా!? అన్నింటినీ సీరియస్‌గా తీసుకొంటే ఎలా? ప్లీజ్ నవ్వవా? " అన్నాడు ఆమెను గడ్డం పట్టుకొని బతిమాలుతూ.

"ఏదయినా ఒకటి రెండుసార్లు బావుంటుంది. అస్తమానూ కామెడీయేనా? " అందామె బుంగమూతి పెడుతూ.

"ఓ.కే. మేడమ్ సారీ. ఇప్పుడు నన్నేం చెయ్యమంటారో చెప్పండి? "

"దట్స్ గుడ్. లెటజ్ గో టు ద పిక్చర్" అంది సవిత నవ్వుతూ.

★ ★ ★

సమయం ఉదయం తొమ్మిది గంటల ముప్పై నిముషాలు.

క్లాసులు స్టార్ట్ అవటానికి ఇంకా అర గంట ఉండటంతో సింధు, రమేష్ బస్‌స్టాపులో కూర్చొని కబుర్లు మొదలుపెట్టారు. మిగిలిన వాళ్ళంతా క్యాంటీన్‌లో కూర్చున్నారు.

"సింధూ... ఏంటంత డల్‌గా ఉన్నావు? ఎనీథింగ్ రాంగ్? " ప్రశ్నించాడు రమేష్.

"మూడ్ బాలేదు. చాలా చిరాగ్గా ఉంది" చెప్పింది సింధు.

"ఏం? ఏం జరిగింది? "

"నాన్నమ్మకు అసలు ఒంట్లో బావుండలేదు. చాలా దారుణంగా ఉందామె పరిస్థితి"

"పోనీ ఈ రోజుకి కాలేజ్ మానేసి ఇంటి వద్దే ఉండలేకపోయావా? "

"నాన్నమ్మను అలా చూస్తూ ఇంటిదగ్గర ఉండలేక వచ్చేశాను"

"మరి... హాస్పిటల్‌కి తీసుకొని వెళ్ళలేదా? "

"తీసుకువెళ్లారు. నాన్నమ్మ ఇంక ఎంతో కాలం బతకదన్నారట డాక్టర్. ఈ విషయం నాతో చెప్తే నేను తట్టుకోలేనని అమ్మ నాకు చెప్పలేదు. నాన్నకు చెప్తుంటే విన్నాను. ఆ విషయం తెలిసిన దగ్గరనుంచీ మనసంతా చాలా బాధగా ఉంది. చిన్నప్పటినుంచి నేను అమ్మదగ్గర కంటే నాన్నమ్మ దగ్గరే ఎక్కువ పెరిగాను. ఆమెకు కూడా నేనంటే చాలా ఇష్టం. అందుకే బాధ"

ఆమె బాధ మాటలకు అడ్డుపడుతోంది. మాటలు ముద్దగా మారిపోయాయి.




"మనం ఎంత ఇష్టపడిన వాళ్లయినా చివరవరకూ మనతోనే ఉండి పోరుకదా. ఎక్కువగా ఆలోచించి బాధపడటంవల్ల మన ఆరోగ్యం పాడవటం తప్ప ఏం లాభం ఉండదు. అటువంటి విషయాలు సాధ్యమైనంత వరకు మరిచిపోవటమే మంచిది. కంట్రోల్ చేసుకోవటానికి ప్రయత్నించు" ఆమెను ఓదార్చటానికి ప్రయత్నిస్తూ అన్నాడు రమేష్.

సింధు ఏం మాట్లాడలేదు. మొహాన్ని చేతుల్లో దాచుకొని మౌనంగా కూర్చొని ఉండిపోయింది. ఆమెను కొద్దిసేపు అలా వదిలేయటమే మంచిదని రమేష్ కూడా మౌనంగా కూర్చొని ఉండిపోయాడు.

ఐదు నిముషాలు ఇద్దరిమధ్యా మౌనం రాజ్యమేలింది. రమేష్ ఆ నిశ్శబ్దాన్ని భరించలేకపోయాడు.

"సింధూ" నెమ్మదిగా పిలిచాడు.

ఆమెనుంచి ఎటువంటి రెస్పాన్స్‌లేదు. రమేష్‌కి అనుమానం వచ్చి చేతుల్ని తీసి చూశాడు. ఆమె కళ్ళల్లోంచి కన్నీరు ఆమె బుగ్గలపై నుంచి కిందకు జారిపోతోంది.

"ఏయ్... సింధూ. ఏంటిది? ప్రతి చిన్న విషయానికి ఏడుస్తావు నువ్వు" అన్నాడు ఆమె కన్నీటిని తన చేత్తో తుడుస్తూ.

"చిన్న విషయం! నా పరిస్థితిలో నువ్వు ఉంటే తెలుస్తుంది ఈ బాధ ఏంటో. సరేలే పద క్లాసుకి వెళ్దాం" అని కూర్చున్నచోటు నుంచి లేచి నిలబడింది.

ఎదురుగా యశ్వంత్, ఇంకో ఇద్దరు వ్యక్తులు కండలు కనిపించేలా టైట్ టీషర్ట్సు వేసుకొని, ఛాతీని పైకెత్తి చాలా రెక్‌లెస్‌గా నడుచుకుంటూ వస్తున్నారు. వాళ్లని చూడగానే సింధు కాస్త కంగారుపడింది.

"యశ్వంత్? వీడేంటి ఇలా వస్తున్నాడు" అంది కంగారుని అణుచుకోవటానికి ప్రయత్నిస్తూ.

"రమేష్... నువ్వేం వాడితో గొడవపెట్టుకోకు" హెచ్చరించింది సింధు.

"నేనేం వాడితో గొడవపెట్టుకోను. అనవసరంగా వాడు నన్ను కదిపితే మాత్రం నేను ఊరుకోను" అన్నాడు రమేష్ వస్తున్న వాళ్ళవైపు చూస్తూ.

ఇంతలో యశ్వంత్‌తోపాటు మిగిలిన ఇద్దరూ కూడా వీళ్ళ దగ్గరకు వచ్చారు.

"ఏరా రమేష్! ఈ కాలేజ్‌లో నువ్వు పెద్ద హీరోనని ఫీల్ అవుతున్నావా? " రమేష్ వైపు చూసి వెటకారంగా నవ్వుతూ ప్రశ్నించాడు యశ్వంత్.

"ఏం... ఆ ఛాన్స్ నీకు లేదని నువ్వు బాధపడుతున్నావా? " అదే తరహాలో జవాబిచ్చాడు రమేష్.

"బాధ పెట్టడం తప్ప బాధపడటం మనకు అలవాటు లేదు బాబూ!" పవర్ ఫుల్ డైలాగ్ వదిలానని సంతోషపడిపోతూ అన్నాడు యశ్వంత్.

"అవునులే... రాక్షసుల లక్షణం అదే" వెంటనే అన్నాడు రమేష్. ఆ మాటలకు యశ్వంత్‌కి లాగి చెంపమీద కొట్టినట్టయింది.

"నిజమే... నేను రాక్షసుణ్ణే. అందుకే నీ కాలూ, చెయ్యి తీసేద్దామని వచ్చాను"

"యశ్వంత్... అనవసరంగా గొడవలు ఎందుకు. క్లాసుకి టైమ్ అవుతోంది" అని రమేష్‌వైపు తిరిగి "రమేష్... పద క్లాసుకి" అంది అప్పటివరకూ మౌనంగా కూర్చొన్న సింధు.

"సింధూ! ఇది నీకనవసరమయిన విషయం. నువ్వు మధ్యలోకి రాకు" చాలా సీరియస్‌గా అన్నాడు యశ్వంత్. సింధుని వేలెత్తి చూపిస్తూ సీరియస్‌గా మాట్లాడేసరికి రమేష్‌కి ఆవేశం పెరిగిపోయింది. ఇక తన కోపాన్ని కంట్రోల్ చేసుకోలేకపోయాడు.

ఒక్క ఉదుటున పైకి లేచి విసురుగా యశ్వంత్ మీదకి వెళ్ళి రెండు చేతుల్తో వాణ్ణి బలంగా వెనక్కి నెట్టాడు. ఊహించని పరిణామానికి యశ్వంత్ బ్యాలెన్స్ చేసుకో



లేక వెనక్కి పడిపోయాడు.

"ఏంట్రా...! ఇంటర్ యూనివర్సిటీ కాంపిటీషన్స్‌కి నా టీమ్ పేరు ఇచ్చాననే కదా ఈ గొడవ. నువ్వూ ఇచ్చావ్. నేనూ ఇచ్చాను. ఫైనల్ డెసిషన్ ఏమిటో ప్రిన్సిపల్ చెప్పాకా అప్పుడు ఆలోచిద్దాం. నువ్వు వెళ్ళాలా... నేను వెళ్ళాలా అనేది" ఆవేశంగా అన్నాడు రమేష్.

"ఏంటి ఆలోచించేది. నువ్వుంటేనే కదా నీ టీమ్ వెళ్ళేది. నువ్వే వెళ్ళలేని పరిస్థితిలో ఉంటే..."

అతని మాటలు రమేష్‌కి అర్థమయ్యేలోపుగా ముగ్గురూ రమేష్‌మీద కలబడ్డారు. రమేష్ తన శక్తినంతా ఉపయోగించి వాళ్ళని ఎదుర్కోవటానికి ప్రయత్నిస్తున్నాడు. కానీ వాళ్ళు ముగ్గురూ, అతను ఒక్కడు. ఎక్కువసేపు వాళ్ళను ఎదుర్కోవటం కష్టమని అతనికీ తెలిసిపోయింది.

రమేష్‌మీద వాళ్ళు కలబడగానే సింధు ఏమాత్రం ఆలస్యం చేయలేదు. హడావుడిగా క్యాంటీన్‌వైపు పరుగుతీసింది. రెండు నిమిషాల్లో శ్రీనివాస్ వాళ్ళతో కలిసి తిరిగివచ్చింది. అప్పటికి రమేష్‌ని నేలపై పడేసి కాళ్ళతో తన్నుతున్నారు. శ్రీనివాస్ వెంటనే పరుగు పరుగున వెళ్ళి యశ్వంత్‌ని పట్టుకొని వెనక్కి లాగాడు. చైతన్య, మహేష్ మిగిలిన ఇద్దరినీ పట్టుకొని వెనక్కి లాగారు. వాళ్ళు ఇంకా పెనుగులాడుతుంటే శ్రీనివాస్ యశ్వంత్‌ని బలంగా కడుపులో తన్నాడు.

ఆ దెబ్బకు తల తిరిగినట్టయింది యశ్వంత్‌కి. పొట్టను చేత్తో పట్టుకొని రెండు అడుగులు వెనక్కి వేశాడు. ఆ దెబ్బకి మిగిలిన ఇద్దరూ కాస్త జంకారు. ఇక అక్కడ ఉండటం మంచిది కాదని యశ్వంత్ మిగిలిన వాళ్ళతో కలిసి కొంత దూరం ముందుకు వెళ్ళి మరల వెనక్కి తిరిగాడు.

"రేయ్... మర్యాదగా నీ టీమ్‌ని డ్రాప్ చెయ్యి. లేదంటే పరిణామాలు దారుణంగా ఉంటాయి" అని సమాధానం కోసం ఎదురు చూడకుండా వెళ్ళిపోయాడు.

చైతన్య రమేష్‌కి చేతినందించి పైకి లేపి నిలబెట్టాడు. పెద్ద దెబ్బలేమీ లేవు. కాకపోతే అక్కడక్కడా చిన్న చిన్న గాయాల నుంచి రక్తం కారుతోంది.

"ఎందుకు వాడితో గొడవ. నువ్వు క్రికెట్ ఆడి ఎవర్ని ఉద్ధరించాలి" అసహనంగా అన్నాడు చైతన్య.

"అంటే వాడికి భయపడి కాలేజిలో పిరికివాడిలా ఉండాలా?" ఆక్రోశంతో అన్నాడు రమేష్.

"తప్పదు. నువ్వు ధైర్యవంతుడివని కాలేజంతా గొప్పగా చెప్పుకున్నా నీకు ఒరిగేదేమీ ఉండదు. అలాంటివాడితో గొడవలు పెట్టుకొంటే అనవసరంగా కష్టాలు కొనితెచ్చుకోవటం తప్ప ఏం లాభం ఉండదు"

"ఎవరో చెప్పుకోవాలనో, నాకు క్రేజ్ రావాలనో కాదు. ఒకడికి తలవంచి బతకటం నావల్ల కాదు"

"మీ ఇద్దరూ తరువాత వాదించుకొందురుగాని, ముందు హాస్పటల్‌కి పదండి" వాళ్ళ వాగ్యుద్ధాన్ని బ్రేక్ చేస్తూ అంది సింధు.

★ ★ ★

"సింధూ... అత్తయ్య వచ్చింది" అంటూ పిలిచింది పార్వతి. ఆ మాట వినగానే లోపలనుంచి పరిగెత్తుకుంటూ వచ్చింది సింధు.

"అత్తయ్యా! బావున్నారా?" ప్రశ్నించింది సింధు.

"నేను బాగానే ఉన్నానమ్మా! నాన్నమ్మకు ఎలా ఉంది" అడిగింది అత్త భువనేశ్వరి సింధుని.

"ఇప్పుడు కొద్దిగా బాగానే ఉంది. మాట్లాడగలుగుతున్నారు. నిన్నటివరకూ అయితే మాట కూడా వచ్చేది కాదు" చెప్పింది పార్వతి.

"భువనా! ఎప్పుడొచ్చావ్?" అప్పుడే ఇంట్లోకి వస్తూ ప్రశ్నించాడు సత్యనారా




యణ.

"ఇప్పుడే వచ్చానన్నయ్యా"

"ఇంట్లో అందరూ కులాసానా? "

"అందరూ బానే ఉన్నారన్నయ్యా" అని ఆమె పెద్దావిడ మంచం పక్కన కూర్చుంది.

"అమ్మా! ఇప్పుడెలా ఉంది? " ప్రశ్నించింది భువనేశ్వరి.

"ఎవరూ? భువనా? " అందామె గుర్తుపట్టటానికి ప్రయత్నిస్తూ.

"అవునమ్మా నేనే. నీకెలా ఉంది? "

"ఫరవాలేదమ్మా. అయినా ఇంకెంతకాలం బతుకుతాను. ఈ వయసులో నేను చేసేది మాత్రం ఏముందింక? ఆ దేవుడు త్వరగా నామీద దయతలిస్తే బావుండునని చూస్తున్నాను" అందా పెద్దావిడ. దగ్గు, ఆయాసం ఆమె మాటలకు అడ్డుపడుతున్నాయి.

"నా భయం కూడా దాని గురించేనమ్మా. దాని పెళ్ళి చూడకుండా చచ్చిపోతానేమోనని భయంగా ఉంది" అని "ఒరే... సత్తీ" అని గట్టిగా పిలవబోయింది. కానీ దగ్గు మాటలు రాకుండా అడ్డుపడింది.

"నేను పిలుస్తానుండమ్మా" అని "అన్నయ్యా..." అని పిలిచింది భువనేశ్వరి. సత్యనారాయణ లోపలినుంచి వచ్చి తల్లి మంచం దగ్గర కూర్చున్నాడు.

"ఏంటమ్మా" ప్రశ్నించాడు సత్యనారాయణ.

"సింధు పెళ్ళి తొందరగా రాఘవతో జరిపించండ్రా" అంది పెద్దావిడ.

"అది ఎప్పట్నించో అనుకుంటున్న పెళ్ళి. ఖచ్చితంగా జరుగుతుంది. చెల్లి కూడా ఇక్కడే ఉంది. ఇద్దరం చెపుతున్నాంకదా! నీకింకా అనుమానం ఎందుకు? "

"అవునమ్మా! ఈ పెళ్ళి తప్పకుండా జరుగుతుంది. రాఘవకి కూడా సింధు అంటే చాలా ఇష్టం" అన్నయ్య మాటలకు సపోర్ట్ ఇచ్చింది భువనేశ్వరి.

"అది నా బంగారుతల్లి. దానిని ఇష్టపడని వారెవరుంటారు? అది కాదురా నా బాధ. నేను బతికుండగా ఆ పెళ్ళి జరిపిస్తే హాయిగా కన్ను మూద్దామని"

"అమ్మా! నీకేం కాదని డాక్టరు చెప్పారు కదా! ఇంకా ఎందుకంత ఆందోళన పడతావు. అయినా పెద్దవాడు ఒకడున్నాడు కదా. వాడికి పెళ్ళవకుండా చిన్నవాడికి పెళ్ళెలా చేస్తాం. నువ్వు ఈ పెళ్ళి చూస్తావు. నీకేం కాదు" అన్నాడు సత్యనారాయణ.

"ఆ డాక్టర్లు అలానే చెప్తారురా! నేనిక ఎంతోకాలం బతకనని నాకు తెలుసు"

"అమ్మా! నువ్వు ఎక్కువ మాట్లాడకు. నీరసం వస్తుంది" అంది భువనేశ్వరి.

"సరేలే. సింధూ నువ్విలారా! ఇక్కడ కూర్చో" అంది పెద్దావిడ తన పక్కన కూర్చోమన్నట్టు సైగచేస్తూ. సింధు వచ్చి ఆమె పక్కనే కూర్చుంది. సింధు చేతిని తన చేతిలోకి తీసుకొని గట్టిగా పట్టుకొందావిడ.

"నీ పెళ్లి చూసే అదృష్టం నాకు లేదేమోరా! నేను ఎక్కడున్నా నిన్ను చూస్తూనే ఉంటానురా" అందావిడ చమర్చిన కళ్ళతో సింధువైపే చూస్తూ. సెన్సిటివ్ అయిన సింధు ఆ సెంటిమెంట్‌కి తట్టుకోలేకపోయింది. వెంటనే నాన్నమ్మను పట్టుకొని గట్టిగా ఏడ్చేసింది.

"అమ్మా! నువ్వు కంగారుపడి దాన్ని కంగారు పెడతావెందుకు. చిన్నపిల్ల ఎలా బెదిరిపోయిందో చూడు. సింధూ... నువ్వు ఊరుకో" అంటూ వారించింది భువనేశ్వరి.

"సింధు కన్నీటిని చేత్తో తుడుచుకుంటూ వస్తున్న దుఃఖాన్ని ఆపుకోవటానికి ప్రయత్నిస్తోంది. కొద్దిసేపటికి అంతా కబుర్లలో పడ్డారు. చిన్నతనం నుంచి జరిగిన సంఘటనలన్నీ నెమరు వేసుకొంటున్నారు.

"సింధు వాళ్ళ మధ్య కూర్చొని ఉన్నా ఆమె మనసు మాత్రం అక్కడ లేదు. ఆమె ఆలోచనల్నీ రమేష్ గురించి, రమేష్‌తో తన పెళ్లి గురించి నిండిపోయి ఉన్నాయి. ఇప్పటివరకు ఆమెకు ఒక సమస్య ఉండేది.

ఇప్పుడు రెండవ సమస్య కూడా బయలుదే రింది.

"ఇప్పటివరకు రమేష్‌తో తను అడ్జస్ట్ అవ గలనా లేదా అన్నదే ముఖ్యమైన సమస్య. ఆ విషయమే తను ఎటూ తేల్చుకోలేకపో తోంది. ఇప్పటివరకు తండ్రి తన ప్రేమను అంగీకరిస్తారని ఉన్న చిన్న నమ్మకం కూడా ఆవిరయిపోయింది. ఇప్పుడు రమేష్‌తో అడ్జస్ట్ అవగలనని అనుకున్నా ఖచ్చితంగా ఇంట్లోవాళ్ళని వదిలి వెళ్ళాలి. ఆ పని తను చేయగలదా? ఖచ్చితంగా చేయలేదు. ఇంట్లో వాళ్ళని దూరం చేసుకొనే ధైర్యం తనకు లేదు.

"తన బావతో పెళ్ళి ఎప్పటినుంచో అను కుంటున్న విషయం. తన చిన్నతనంనుంచి ఆ విషయం తెలుసు. అయినా రమేష్‌ని ప్రేమించేటప్పుడు ఈ విషయం ఎందుకు ఆలోచించలేదు? అంటే తను యవ్వనపు ఆవేశంలోనే ప్రేమించిందా? తనది నిజ మైన ప్రేమ కాదా?

"మనసు ఇటు తల్లిదండ్రులూ కావాలం టోంది. అటు ప్రేమించిన వాడూ కావాలం టోంది. ప్రస్తుతం తనేం చెయ్యాలి?

"ఇలా ఆమె ఆలోచనల్లో మునిగి ఉన్న సమయంలో పెద్ద శబ్దంతో ఫోన్‌రింగ్ అయింది. ఆ శబ్దానికి సింధు తుళ్ళిపడింది. తేరుకొని వెళ్ళి ఫోన్ లిఫ్ట్ చేసింది.

"హలో..." అంది సింధు.

"హాయ్ సింధు. రమేష్‌ని. ఏం చేస్తు న్నావు?"

"ఏమయినా అర్జంటు మేటరా?" అంది వాయిస్ తగ్గిస్తూ. తన ఇంట్లోవాళ్లకి మాటలు వినపడకుండా జాగ్రత్త పడు తోంది.

"ఏంలేదు. సరదాగానే చేశాను"

"తరువాత చెయ్యి. పెట్టేస్తున్నాను" అని ఫోన్ పెట్టేసింది సింధు.

"ఎవరమ్మా ఫోన్" ప్రశ్నించాడు సత్యనా రాయణ.

"కాలేజ్ ఫ్రెండ్ నాన్నా" అని చెప్పి కూర్చోబోయింది. ఇంతలోనే మళ్ళీ ఫోన్ రింగ్ అయ్యింది. సింధు మళ్ళా రమేషేమో నన్న అనుమానంతోనే లిఫ్ట్ చేసింది.

"హలో..."

"సింధూ! పెట్టేశావెందుకు?"

"కాలేజ్‌లో మాట్లాడుకుందాం!" అని విసురుగా ఫోన్ పెట్టేసింది.

"రాంగ్ నంబరు నాన్నా" ఈసారి తండ్రి అడక్కుండానే చెప్పింది సింధు.

★ ★ ★

చైతన్య, మహేష్, భాను, సింధు బస్‌స్టా ప్‌లో కూర్చొని ఉన్నారు. అప్పుడే వాళ్ళ దగ్గ రకు వచ్చారు శ్రీనివాస్, సవిత.

"ఏంట్రా? అందరూ డల్‌గా కూర్చు న్నారు" ప్రశ్నించాడు శ్రీనివాస్.

"బస్ వచ్చేవరకూ వీళ్ళిద్దరికీ కంపెనీ ఇద్దామని మేమిద్దరం వచ్చాం. తీరా వచ్చిన తరువాత వాళ్ళూ మాట్లాడటం లేదు. మేమూ మాట్లాడటంలేదు. మొత్తం వాతావ రణమే డల్‌గా తయారయింది. ఇంతకీ నువ్వెక్కడికి పోయావు?" అడిగాడు మహేష్.

"పోస్ట్‌లో ఏదో పార్శిల్ వచ్చిందంటే ఆఫీ స్‌రూమ్‌కి వెళ్ళాను. దారిలో ఈ దెయ్యం తగిలింది. బుర్రంతా వాయించేస్తోందిరా బాబూ" అన్నాడు శ్రీనివాస్ సవితవైపు చూస్తూ.

"నీకంత ఇష్టం లేకపోతే నేను వెళ్ళిపోతా నులే" కాస్త కోపాన్ని నటిస్తూ అంది సవిత.

"వద్దు తల్లీ. మళ్ళీ ఈ విషయాన్ని సాకుగా తీసుకుని నన్ను తినటానికా"

"మీ ఇద్దరి వాదనా ఆపి ముందు ఆ పార్శిల్ ఏంటో చెప్పు" అన్నాడు చైతన్య.

"మొన్న ఇంటర్నెట్‌లో ఒక సైట్ సర్ఫ్ చేశాను. అందులో ఐటమ్స్ అన్నీ చాలా ఫన్నీగా ఉన్నాయి. అందులో ఇది కూడా ఒకటి. అడ్రస్ ఇస్తే ఈ ఫన్నీ బుక్ మీకు పంపిస్తాం అంటే అడ్రసు ఇచ్చాను. మనీ




వసూలు చేస్తాడేమో అనుకున్నాను. వాడేమో ఫ్రీగా పంపేశాడు. బహుశా సైట్ ఎడ్వర్టైజ్‌మెంట్ కోసం అయిఉండొచ్చు" చెప్పాడు శ్రీనివాస్.

"ఇంతకీ ఏంటా బుక్? " ఆతృతగా అడిగింది భాను.

"ఫైండ్ యువర్ ఉడ్బీ" అన్నాడు శ్రీనివాస్.

"ఏంటది? " అందరూ ఆశ్చర్యంగా ప్రశ్నించారు.

"అవును. మారేజస్ ఆర్ మేడ్ ఇన్ హెవెన్. అంటారు. అలా మీ కోసం హెవెన్‌లో నిర్ణయించబడిన మీ జీవిత భాగస్వామిని ఈ పుస్తకం ద్వారా తెలుసుకోండి. ఇది నేను చెపుతున్నది కాదు. ఆ సైట్‌లో రాస్తున్నది"

"అదెలా? " ప్రశ్నించింది సింధు.

"ఈ బుక్‌లో ప్రతీ పేజీలోనూ ఇంగ్లీషు అక్షరాలు ఎ నుంచి జడ్ వరకు ప్రతీ అక్షరానికీ ఒక కాంబినేషన్ ఉంటుంది. ప్రతీ పేజీలోనూ ఇరవైఆరు అక్షరాలూ ఉంటాయి. ఆ కాంబినేషన్‌తోపాటు ఒక బొమ్మ కూడా ఉంటుంది. దానిని బట్టి మీ జీవితభాగస్వామి గురించి తెలుస్తుంది" తన మాటలను ఆపి అందరినీ చూశాడు. అంతా అతను చెప్పే మాటల్ని చాలా శ్రద్ధగా వింటున్నారు.

"బొమ్మలేంటి? " ప్రశ్నించింది సవిత.

పుస్తకంలో ప్రతి లెటర్ కాంబినేషన్ ఎదురుగా నాలుగురకాల బొమ్మల్లో ఏదో ఒకటి ఉంటుంది. ఒంటె బొమ్మ ఉంటే మీకు కాబోయే జీవిత భాగస్వామి సన్నగా, పొడవుగా ఉంటారన్నమాట. నక్కబొమ్మ ఉంటే సన్నగా పొట్టిగా, ఏనుగుబొమ్మ ఉంటే లావుగా, ఎత్తుగా, ఖడ్గమృగం బొమ్మ ఉంటే లావుగా, పొట్టిగా ఉంటారు. ముందుగా ఎవరయినా ఒకరు ఈ బుక్‌లో ఒకపేజ్ తియ్యాలి. ఎవరు తీస్తారు? " ప్రశ్నించాడు శ్రీనివాస్.

"భాను... అందరికంటే పెద్దదిగదా. భాను తీస్తుంది" వెంటనే అన్నాడు మహేష్.

"నేను పెద్దదాన్నేంటి? మీ అందరికంటే నేనే చిన్నదాన్ని" అమాయకంగా చెప్పింది భాను.

"నేను చెప్తున్నది వయసులో కాదమ్మా! మనిషి సైజులో" అన్నాడు మహేష్. అందరూ నవ్వేశారు. దాంతో భాను మొహం చిన్నబోయింది.

"ఒ.కె... ఒ.కె. లీవిట్. మహేష్ నువ్వు ఏం మాట్లాడకు. భానూ నువ్వు తియ్యి" అన్నాడు శ్రీనివాస్.

"నువ్వు చెప్తున్నావు కాబట్టి తీస్తున్నాను" అని బుక్ ఓపెన్ చేసింది.

"ఆ పేజీలో నీ పేరులోని మొదటి ఆల్ఫాబెట్‌కి ఏం కాంబినేషన్ ఉందో చూడు" అన్నాడు శ్రీనివాస్.

"ఎమ్. ఉంది. దానితోపాటు ఒంటె బొమ్మ" హుషారుగా చెప్పింది భాను.

"అంటే నీకు కాబోయే వాడి పేరు ఎమ్. అనే లెటర్‌తో స్టార్టవుతుంది. అతను సన్నగా, పొడవుగా ఉంటాడు" అని యధాలాపంగా అని "ఏంటి. ఎమ్ కదా వచ్చింది. ఒరేయ్ మహేష్ మాకు తెలియకుండా నువ్వు, భాను ట్రాక్ నడుపుతున్నారా" అనుమానంగా ప్రశ్నించాడు.

"అదేం లేదురా బాబు. ఏనుగు, పక్కన ఒంటెను ఊహించుకో. పొడుగయితే ఉంటుంది కానీ ఏనుగుని తట్టుకోగలదంటారా? " ఒణికిపోతున్నట్టు నటిస్తూ అన్నాడు మహేష్.

"నాకేదో అనుమానమే. ముందు సింధుని తీయమనండి. ఇది ఎంతవరకూ నిజమో తెలిసిపోతుంది" అంది సవిత.

"అవును నిజమే. సింధు నువ్వు తియ్యి" అన్నాడు చైతన్య.

"ఈసారి సింధు బుక్ ఓపెన్ చేసింది. ఎస్.కి కాంబినేషన్‌గా ఆర్ వచ్చింది. అది

చూసి అందరూ ముందు మహేష్, భాను లవైపు చూశారు. కాని సింధు ఆలోచనలో పడింది. ఆర్ అంటే రమేషా లేక రాఘవా? ఇద్దరి పర్సనాలికి ఒకలాగే ఉంటుంది.

"ఇంతలో అక్కడకు రమేష్ రావటంతో అందరి మాటలకు బ్రేక్ పడింది.

"హాయ్ రమేష్... ఏంటి పొద్దున్న మాకంటే ముందు వచ్చేశావేం కాలేజ్‌కి" ప్రశ్నించింది సింధు.

"రమేష్ కనీసం ఆమె మొహం వైపన్నా చూడలేదు.

"చైతన్యా నేను క్యాంటీన్‌లో ఉంటాను. బస్ వస్తే పిలు" అని ఎంత ఫాస్ట్‌గా వచ్చాడో, అంత ఫాస్ట్‌గా వెళ్ళిపోయాడు. అతని ప్రవర్తనకి సింధు కొద్దిగా బాధపడింది. కానీ అతనెందుకు సీరియస్‌గా ఉన్నాడో ఆలోచించి అతనికి తన పరిస్థితి వివరించాలనుకొంది.

"ఏంటి రమేష్ నీ మీద కోపగించినట్టున్నాడు. ప్రేమలో పడితే ఈ పాట్లు తప్పవు. వెళ్ళు... వెళ్ళి ఐస్ చేసుకో" అన్నాడు మహేష్.

సింధు క్యాంటీన్ వైపు వెళ్ళింది.

"ఏరా! మీవాడు ఎందుకు అలిగినట్టు?" చైతన్యని ప్రశ్నించాడు శ్రీనివాస్.

"ఏమో! వాళ్ళిద్దరి గురించి నాకు తెలియదు. వాడు సింధుకి ప్రపోజ్ చేస్తానన్నప్పుడే చెప్పాను. అంత సెన్సిటివ్ ఫెలో నీ కారెక్టర్‌కి సరిపడదురా అని. వాడు వినిపించుకోలేదు. ఆరోజునుంచే వాళ్ళ గురించి పట్టించుకోవటం మానేశాను" చెప్పాడు చైతన్య.

అతని మాటలు విని తన అభిప్రాయానికి ఒకరు సపోర్ట్ దొరికారని సంతోషించాడు శ్రీనివాస్.

తరువాత వాళ్ళు మరలా బుక్‌గేమ్ ప్రారంభించారు.

"అందరూ కాదు. బుక్ తెచ్చింది నువ్వు కాబట్టి ముందు నువ్వు తియ్యి" అంది భాను, శ్రీనివాస్‌తో.

"సరే" అని శ్రీనివాస్ బుక్ ఓపెన్ చేశాడు. ఎస్‌కి కాంబినేషన్ ఎస్ వచ్చింది. వెంటనే సవితవైపు చూశాడు. 'అంతా సుత్తి' అన్నట్టు పెదవి విరిచి నాలుక బయటపెట్టింది సవిత. తరువాత శ్రీనివాస్ ఖచ్చితంగా తననే తీయమంటాడని అనుమానం రాగానే ఆమె శరీరం సన్నగా వణికింది. వెంటనే అక్కడ నుంచి వెళ్ళిపోవాలనుకొంది.

"సరే అయితే... నాకు పనుంది. నేనింక వెళతాను" అని వాళ్ళ సమాధానం కోసం ఎదురుచూడకుండా అక్కడనుంచి లేచి వెళ్ళింది.

"సవితా... నేను కూడా వస్తున్నాను" అని శ్రీనివాస్ కూడా ఆమెతో బయలుదేరాడు.



"ఏంటి రమేష్... సమాధానం చెప్పకుండా వచ్చేశావు. నా మీద కోపమా?" రమేష్‌కి ఎదురుగా కూర్చుంటూ ప్రశ్నించింది సింధు.

"కోపం కాకపోతే మరి ఏంటి? నిన్న

మాట్లాడకుండా ఫోన్ పెట్టేస్తావా? "

"అప్పటి పరిస్థితి అలాంటిది. ఫోన్ పక్కనే అమ్మ, నాన్న, అత్తయ్య అందరూ ఉన్నారు. అప్పుడు ఎలా మాట్లాడటం? "

"ఎవరో ఫ్రెండ్‌తో మాట్లాడినట్టు మాట్లాడొచ్చుకదా"

"అదంత ఈజీ కాదు. అందరూ ఉండగా నీ దగ్గరనుంచి ఫోన్ వస్తే వెంటనే నాకు చెమటలు పట్టేసి టెన్షన్ పెరిగిపోతుంది. ఆ టైమ్‌లో ఇక ఏం మాట్లాడగలను"

"నువ్వు ప్రతీ విషయానికి భయపడితే ఎలా? మీ ఇంట్లో మన గురించి తెలియనప్పుడు మాట్లాడటానికి భయం ఎందుకు? "

"ఏమో బాబు. నాకంత ధైర్యం లేదు"

"ఏమయినా నేను నిన్ను ప్రేమించినంతగా నువ్వు నన్ను ప్రేమించట్లేదు"

"రమేష్... నువ్వు మాటలు చాలా తేలికగా అనేస్తావు. దానివల్ల ఎదుటివారి మనసు ఎంత బాధపడుతుందో ఆలోచించవా? " సూటిగా ప్రశ్నించింది సింధు.

రమేష్ మౌనంగా ఉండిపోయాడు. సింధు ఆ మౌనాన్ని భరించలేకపోతోంది.

"సారీ... రమేష్. తప్పు నాదే. సారీ చెపుతున్నానుగా మాట్లాడవా ప్లీజ్" అంది సింధు బతిమాలుతున్నట్టుగా.

రమేష్ చిన్నగా నవ్వాడు.

"హమ్మయ్య... ఎన్ని ముత్యాలు రాలిపోయాయో. ఈ నవ్వుకోసం నన్నింతసేపు బాధపెట్టాలా? "

"బాధ పడిన తరువాత నవ్వితేనే ఎక్కువ ఆనందం కలుగుతుంది"

"సంతోషించాం. లే. బస్సు వస్తున్నట్టుంది ముందు పద" అంది సింధు. ఇద్దరూ బస్‌స్టాప్‌కి బయలుదేరారు.

★ ★ ★

"ఆకాశంలో మబ్బులు పలుచగా పరుచుకొని ఉన్నాయి. అస్తమిస్తున్న సూర్యుని యొక్క కాంతి కిరణాలు మేఘాలగుండా ప్రయాణించి, ఆకాశమంతా కుంకుమ చల్లినట్టుగా భ్రమింపచేస్తున్నాయి. చల్లని పిల్లగాలి సీతాకోక చిలుకలతో ఆటలాడుకుంటూ మధ్యమధ్యలో వీరిద్దరి శరీరాన్ని తాకుతూ మనసును ఆహ్లాదపరుస్తోంది.

"ఎట్మాస్ఫియర్ చాలా బాగుంది కదూ!" ఆకాశంలోకి చూస్తూ ప్రశ్నించింది సవిత.

"అవును" పొడిగా సమాధానం చెప్పాడు శ్రీనివాస్.

"అలా సైలెంట్‌గా కూర్చుంటావేంటి? ఏదో ఒకటి మాట్లాడొచ్చుకదా!"

"ఏం మాట్లాడమంటావ్? "

"నీ ఇష్టం"

"ఏం మాట్లాడాలి" అని గడ్డంకింద చేత్తో రాసుకొని "ఆ గుర్తొచ్చింది" అన్నాడు శ్రీనివాస్.

"ఏంటది? " హుషారుగా ప్రశ్నించింది సవిత.

"రాత్రి నాకో కల వచ్చింది"

"కలా! ఎవరి గురించి"

"ఎవరి గురించో అయితే ఇప్పుడు ఎందుకు చెపుతాను. నీ గురించే"

"నా గురించా? ఏమని? "

"రాత్రి నిద్రపోయేముందు నీ గురించే ఆలోచిస్తూ పడుకున్నాను. అందుకేనేమో నీ గురించి కలొచ్చింది"

"అది సరే... ముందు కలేం వచ్చిందో అది చెప్పు"

"నేను చనిపోయినట్టు..." ఇంకా అతని మాటలు పూర్తి కాకుండానే సవిత తన చేత్తో అతని నోటిని మూసేసింది.

"ఏంటా మాటలు. ఈ టైమ్‌లో పైన తథాస్తు దేవతలుంటారు. అటువంటి మాటలు మాట్లాడకు..." కాస్త సీరియస్‌గా అంది సవిత.

"అబ్బా! తథాస్తు దేవతలు రావటానికి ఇంకా టైముందిగాని నేను చెప్పేది విను. నేను చనిపోయానంట. ఎలా, ఏమిటి అనేది మాత్రం తెలియదు. ఇంట్లో పెద్ద ఫొటో పెట్టి దండేశారట. ఆ ఫొటో ఎవ

రిదో కాదు నాదే. విచిత్రంగా మమ్మీ, డాడీ లేరక్కడ. అంతా మన ఫ్రెండ్స్. అందరూ నా ఫొటోవైపు చూస్తూ బాధగా ఏడుస్తున్నారట. నువ్వు మాత్రం దూరంగా నిలబడి 'హమ్మయ్య... వీడి పీడ వదిలిపోయిందిరా బాబు' అనుకొని సంతోషంగా నవ్వుతున్నావట" అని మాట్లాడటం ఆపి ఆమె ముఖకవళికల్ని పరిశీలించాడు.

"అప్పటికే కోపంతో ఆమె ముఖం ఎర్రబడిపోయింది. కళ్లలో నీటిపొర స్పష్టంగా తెలుస్తోంది. చావు విషయం వచ్చేసరికి ఎలాంటి వారయినా సెంటిమెంట్‌గా ఫీల్ అవుతారు. అదే ఆమె విషయంలో జరిగింది. కసిగా కొట్టేసేలా చూస్తోంది సవిత.

తనకు కావాల్సిన రియాక్షన్ వచ్చిందని నిర్ణయించుకున్నాక మరలా మాట్లాడాడు శ్రీనివాస్.

"సవితా...! నిజంగా నేను చనిపోతే నా కోసం కనీసం ఒక కన్నీటిబొట్టయినా రాలుస్తావా? " చాలా దీనంగా ఆమె కళ్లలోకే చూస్తూ ప్రశ్నించాడు శ్రీనివాస్.

"అతను మాట్లాడిన మాటలకు, మాట్లాడిన పద్ధతికి సవిత ఇక తన ప్రేమను కప్పి ఉంచలేకపోయింది.

"నేనూ నీతోపాటు పైకి వచ్చేస్తాను" స్ట్రయిట్‌గా చెప్పింది సవిత.

ఆమె తనని ప్రేమిస్తున్నానని చెపుతుందని ఊహించాడే కానీ ఇలా తన కోసం ప్రాణాలను ఇచ్చేస్తానంటుందని ఊహించని శ్రీనివాస్ కాస్త కంగారుపడ్డాడు. అంతలోనే ఆనందపడ్డాడు.

"ఇక నేను నా ప్రేమను దాచలేను. ఐ లవ్ యు శీను" అంటూ అతనిని గట్టిగా కౌగలించుకొంది.

"ఐ టూ లవ్ యు సవిత" అని ఆమెను తన బాహువుల్లో బంధించాడు.

"వారి ప్రేమకు ఆమోదం తెలుపుతున్నట్టుగా మేఘాలు గర్జించాయి. పైనున్న దేవతలు దీవించి అక్షింతలు వేస్తున్నట్టుగా వర్షపు చినుకులు వారిపై పడుతున్నాయి.

★ ★ ★

"తరువాత రోజు యధావిధిగా శ్రీనివాస్, మహేష్, చైతన్య, సింధు, భాను కాలేజ్ పూర్తవగానే బస్‌స్టాప్‌లో రౌండ్‌టేబుల్ కాన్ఫరెన్స్ ప్రారంభించారు. కొద్దిసేపటి తరువాత వారితో కలిసింది సవిత. అందరూ కలిసి దేశరాజకీయ చరిత్ర, దేశ భవిష్యత్తు గురించి చాలా సీరియస్‌గా చర్చిస్తున్నారు.

"అవును చైతన్య... రమేష్ ఎక్కడ? " వాళ్ళ చర్చకు అంతరాయం కలిగిస్తూ ప్రశ్నించింది సింధు.

"వాడి సంగతే మరిచిపోయాను. ఇంకా రాలేదేంటి. ఇందాకనే వాళ్ళ క్లాసులు అయిపోయాయికదా" అన్నాడు చైతన్య.

"ఇంతలో అటువైపుగా రమేష్ క్లాస్‌మేట్ ఒకతను వస్తుంటే చైతన్య అతనిని ప్రశ్నించాడు.

"మా అన్నయ్య ఇంకా క్లాసులోనే ఉన్నాడా? "

"లేదే. అసలు మధ్యాహ్నం క్లాసులకే రాలేదు" చెప్పాడతను.

"రాలేదా? " ఆశ్చర్యపోయాడు చైతన్య.

"లేదు. ఉదయం క్లాసులు పూర్తయిన తరువాత పోస్టాఫీస్‌లో ఏదో పనుందని వెళ్ళాడు. తరువాత క్లాసుకి రాలేదు. నేనింకా అటునుంచి ఇంటికి వెళ్ళిపోయాడేమో అనుకున్నాను. ఏం... ఏం జరిగింది? "

"ఏంలేదు. ఇంకా బస్ స్టాప్‌కి రాలేదని అడిగానంతే. నేను ఇంటికి ఫోన్ చేస్తానులే" అని చెప్పి చైతన్య ఎస్.టి.డి. బూత్‌కి వెళ్ళి ఇంటికి ఫోన్ చేశాడు. కానీ ఇంటికి కూడా రాలేదనడంతో చైతన్యకు కంగారు మొదలయ్యింది. అదే విషయం అందరికీ చెప్పాడు.

"ఇంటికీ వెళ్ళకుండా, క్లాసుకీ రాకుండా ఏమైనట్టూ? " అంది భాను.




"ఏ సినిమాకైనా వెళ్ళుంటాడంటావా?" ప్రశ్నించాడు మహేష్.

"కావచ్చు. వాడు సినిమాలు ఎక్కువే చూస్తాడు. కానీ నాకు చెప్పకుండా వెళతాడా అనే అనుమానం" అన్నాడు చైతన్య.

"ఆల్ రెడీ టైం ఫైవ్ అయ్యింది. ఇంకో అరగంట ఆగితే ఆ డౌట్ కూడా తీరిపోతుందికదా" అన్నాడు శ్రీనివాస్.

ఇంతలో బస్ వచ్చింది.

"సింధూ... నువ్వు ఇంటికి వెళ్ళు. అన్నయ్యా, నేనూ తరువాత బస్‌లో వస్తాం" సింధుతో చెప్పాడు చైతన్య.

"సరే... మీరు ఇంటికి రాగానే నాకు ఫోన్ చెయ్యండి"

"అలాగే" అన్నాడు చైతన్య. సింధు బస్ ఎక్కింది.

"శ్రీనివాస్... వీడు సినిమాకి వెళ్ళుంటాడంటావా?" మళ్ళీ అనుమానంగా ప్రశ్నించాడు చైతన్య.

"వెళ్ళుండొచ్చు. వెళ్ళకపోయి ఉండొచ్చు. ఏ విషయం తెలియాలన్నా మనం అరగంట ఆగాల్సిందే" అన్నాడు శ్రీనివాస్.

"ఒకవేళ సినిమాకి వెళ్ళకపోతే ఇంకెక్కడికి వెళ్లుంటాడు" ప్రశ్నించాడు మహేష్.

ఆ ప్రశ్నకి ఎవరిదగ్గరా సమాధానంలేదు. అందరూ కాస్సేపు మౌనంగా కూర్చున్నారు. తరువాత నెమ్మదిగా కబుర్లలో పడ్డారు.

"సవిత... నీ డ్రైవింగ్ క్లాసెస్ ఎంతవరకూ వచ్చాయి?" ప్రశ్నించాడు శ్రీనివాస్.

"ఏం డ్రైవింగో ఏమిటో. చిరాకొచ్చేస్తోంది. ఆ మారుతీ యాక్సిలరేటర్ ఎంత తొక్కినా స్పీడు ముప్పై దాటటంలేదు. ఇదేంటని అడిగితే లెర్నింగ్‌లో అందరూ తక్కువ స్పీడ్‌లో వెళ్ళి ఆ కారుకి అదే అలవాటైపోయిందట. డాడీ కారు ఇమ్మంటే నువ్వు డ్రైవింగ్ పూర్తిగా నేర్చుకుంటేగానీ కారు ఇవ్వనంటారు. ఈ మారుతీమీద డ్రైవింగ్ నేర్చుకోవాలంటే చిరాకు వచ్చేస్తోంది. ఎలాగైనా డాడీని కన్విన్స్ చేసి తొందరలోనే కారు కొనిపించుకుంటాను" చాలా పట్టుదలతో చెప్పింది సవిత.

"ఏం డ్రైవింగ్ పూర్తిగా రాదా నీకు" ప్రశ్నించాడు మహేష్.

"వచ్చు. కానీ ఒకసారి డాడీ కారు తీసుకొని వెళ్ళి యాక్సిడెంట్ చేశాను. అప్పటి నుంచీ నాకు కారు ఇవ్వడం మానేశారు" బాధగా అంది సవిత.

"మంచి పనిచేశారు. లేకపోతే ఎంతమందిని చంపేదానివో" నవ్వుతూ అన్నాడు శ్రీనివాస్.

"చాల్లే... నా డ్రైవింగ్ నీకంటే బెటరే"

"నేనేం నీలా ఎప్పుడూ యాక్సిడెంట్స్ చేయలేదు"

"మీ వాదన ఆపండిక. ఇంతకీ హాలిడేస్‌లో ఎవరెవరు ఎక్కడికి వెళుతున్నారు?" ప్రశ్నించాడు మహేష్.

"నేను మాత్రం ఎక్కడికీ వెళ్ళడంలేదు" వెంటనే అంది భాను.

"నువ్వు ఎక్కడికీ వెళ్ళవని మా అందరికీ తెలుసు"

"ఎలా ఎలా?" చాలా ఆతృతగా ప్రశ్నించింది భాను.

"వెరీ సింపుల్. పండుగ కదా అందరూ ఇంట్లో పిండివంటలు చేస్తారు. నువ్వు కనుక వెళ్తే తినడానికి వాళ్ళకేం మిగలవని నిన్ను ఎవ్వరూ రానివ్వరు. అవునా?" కొంటెగా నవ్వుతూ అన్నాడు మహేష్.

"శ్రీనివాస్ టైం చూడు" దాదాపు అరిచినట్టుగా అన్నాడు చైతన్య.

శ్రీనివాస్ వాచ్ చూశాడు. ఆరుగంటలు కావడానికి ఇంకా కొన్ని నిమిషాలు మాత్రమే ఉంది. నెమ్మదిగా చీకటి కూడా పడుతోంది. కబుర్లలో పడి వాళ్ళు టైంని అసలు పట్టించుకోలేదు.

"అన్నయ్య ఇంకా రాలేదేంటి?" కంగారుగా అన్నాడు చైతన్య.

"మళ్ళీ ఒకసారి ఇంటికి ఫోన్ చేసి చూడు" అన్నాడు శ్రీనివాస్.



చైతన్య ఇంటికి ఫోన్ చేశాడు. మళ్ళీ నిరాశే ఎదురయ్యింది.

"అన్నయ్య ఇంటికి కూడా రాలేదుట. అమ్మ కంగారుపడుతోంది. శ్రీనివాస్ మనం ఒకసారి పోస్ట్ ఆఫీస్ దగ్గరకు వెళదామా?"

"సరే... సవిత, భాను... మీ ఇద్దరూ ఇంటికి వెళ్ళండి" అన్నాడు శ్రీనివాస్.

సవిత, భాను ఇంటికి బయలుదేరారు. శ్రీనివాస్, చైతన్య, మహేష్ బైక్‌పై పోస్ట్ ఆఫీస్‌కి బయలుదేరారు.

★ ★ ★

వాళ్ళు పోస్ట్ ఆఫీస్‌ని చేరుకునేసరికి చీకట్లు పూర్తిగా కమ్మేశాయి. వర్కింగ్ అవర్స్ పూర్తి కావడంతో పోస్ట్ ఆఫీస్ క్లోజ్ చేసేసి ఉంది.

"ఇంతకీ... ఇక్కడ వరకూ వచ్చాం. ఇప్పుడు రమేష్ ఎక్కడికి వెళ్ళాడో తెలుసుకోవడం ఎలా?" ప్రశ్నించాడు మహేష్.

"పోస్ట్ ఆఫీస్‌కి వచ్చినవాడు తిరిగి రాకుండా ఎక్కడికి వెళ్లుంటాడు"

ఏం చెయ్యాలా అని ఆలోచిస్తూ అన్నాడు శ్రీనివాస్.

చైతన్య తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. ఒక వేళ ఫ్రెండ్ ఇంటికి వెళ్ళాడనుకొందామంటే, ఇంతసేపు ఫ్రెండ్ ఇంట్లో ఉండే అవకాశం లేదు. వాడికి ఈ ఊరిలో అంత క్లోజ్ ఫ్రెండ్స్ కూడా లేరు. మరి ఎక్కడికి వెళ్ళినట్టు.

ఇలా ఆలోచనల్లో ఉండగా అతనికో అనుమానం వచ్చింది. ఆ అనుమానం రాగానే ఇక అతని మెదడు పనిచేయడం మానేసింది. ఒళ్ళంతా చెమట పట్టేసింది.

"శ్రీనివాస్... ఒకవేళ య...శ్వం...త్...ఏమైనా?" అతని మాటలు ఆగిపోయాయి. ముగ్గురికీ యశ్వంత్ మాటలు గుర్తొచ్చాయి. అందరి శరీరాలూ చిన్నగా కంపించాయి. భయంతో...

★ ★ ★

సింధు ఇంటికి చేరుకొనేసరికి నాన్నమ్మ మంచం చుట్టూ అందరూ గుమిగూడి ఉండటం చూసి సింధు కంగారుపడింది. హడావుడిగా తను కూడా మంచం దగ్గరకు పరిగెత్తింది.

మంచంమీద ఆ పెద్దావిడ ఊపిరి సరిగా అందక చాలా అవస్థపడుతోంది. శరీరమంతా విపరీతంగా కంపించిపోతోంది. నోటితో గాలిని పీల్చుకోవటానికి ఆమె శత విధాలా ప్రయత్నిస్తోంది. బతికుండగానే నరక యాతన అనుభవిస్తోందావిడ. సింధు నాన్నమ్మ కాళ్ళ దగ్గర కూర్చుండిపోయింది. కన్నీరు ఆమె బాధను మోసుకుపోవటానికి తన ప్రయత్నం తాను చేస్తోంది.

ఇంతలో సత్యనారాయణ డాక్టర్‌ని తీసుకొని వచ్చాడు. డాక్టర్ ఆవిడను పరీక్షిస్తున్నంత సేపూ అందరిలోనూ టెన్షన్ పెరగసాగింది. అందరూ డాక్టర్ మాట కోసమే ఎదురుచూస్తున్నారు. డాక్టర్ ఆమెను పరీక్షించి నిశ్శబ్దంగా బయటకు వచ్చాడు. అతని వెనుకే సత్యనారాయణ, పార్వతి, భువనేశ్వరి కూడా వచ్చారు.

"డాక్టర్... మా అమ్మ పరిస్థితి..." ప్రశ్నించాడు సత్యనారాయణ.

"మీరు మిగతా ఏర్పాట్లు చూసుకోండి" అని చెప్పి డాక్టరు అక్కడనుండి వెళ్ళిపోయాడు. ఆ మాట వినగానే ముగ్గురూ నిశ్చేష్టులై నిలబడిపోయారు.

తరువాత భారమైన గుండెలతో లోపలకు వెళ్ళారు. కానీ వారి బాధకు ఓదార్పుగా ఆ పెద్దావిడ శరీరంలో మార్పులు ప్రారంభమయ్యాయి. ఇందాక శరీరంలో వున్న వణుకు క్రమంగా తగ్గింది. ఊపిరి కూడా ఫ్రీగా అందటం మొదలయ్యింది.

నెమ్మదిగా కళ్ళు తెరిచిందా పెద్దావిడ. ఆ దృశ్యం చూసి అందరి పెదవులపై చిరునవ్వు విరిసింది.

తన కాళ్ళ దగ్గర కూర్చున్న సింధుని దగ్గ





రకు రమ్మని కళ్ళతోనే సైగచేసిందావిడ. సింధు ఆమె వద్దకు వెళ్ళింది.

ఆవిడ సింధు చేతిని ఆప్యాయంగా అందుకొని తన గుండెలకు హత్తుకొంది. అంతే... తరువాత ఆమెలో ఎటువంటి చలనం లేదు. శరీరంలో ఎలాంటి కదలికా లేదు. చేతి పట్టు కూడా విడలేదు.

సింధుకి అప్పటిదాకా వున్న ఆనందం కాస్తా ఆవిరైపోయింది.

"నాన్నమ్మా... నాన్నమ్మా..." అంటూ చేతిని పట్టుకొని ఆమెను కుదుపుతూ పిలిచింది సింధు. కానీ ఆమెలో ఎటువంటి రియాక్షన్ లేదు.

ఈ జీవితంలో ఆమె ప్రయాణం ఇంతటితో పూర్తయ్యిందని అందరికీ అర్థమయింది. అందరి కళ్ళలోనుండి కన్నీరు కిందకు జారుతూ ఆమెకు వీడ్కోలు చెపుతోంది.

సింధు నాన్నమ్మను పట్టుకొని గుండెలు పగిలేలా ఏడుస్తూనే వుంది. ఆమెను ఓదార్చటం ఎవ్వరి వల్లా కావటంలేదు.

సత్యనారాయణ బాధతోనే జరగాల్సిన కార్యక్రమానికి ఏర్పాట్లు చేయటం ప్రారంభించాడు.

★ ★ ★

"ఏం జరిగిందో తెలుసుకోవటం ఎలా? " కంగారుగా ప్రశ్నించాడు మహేష్.

"మనం యశ్వంత్ ఇంటిమీద ఎటాక్‌చేసి వాణ్ణి పట్టుకుందామా" చాలా కసిగా అన్నాడు చైతన్య.

"నువ్వు తొందర పడకు. మనం ఎటాక్ చేసి పట్టుకోవటానికి వాడు ఆర్డినరీ పర్సన్ కాదు. ఎమ్.ఎల్.ఏ. కొడుకు. నిజంగా వాడే రమేష్‌ని ఏదయినా చేసుంటే వాడి జాగ్రత్తలో వాడు తప్పకుండా ఉంటాడు. కాబట్టి ఇప్పుడు వాణ్ణి పట్టుకోవడం మంచి పనికాదు" అన్నాడు శ్రీనివాస్.

"మరేం చేద్దాం" అసహనంతో ప్రశ్నించాడు చైతన్య. అతనికి క్షణక్షణానికి టెన్షన్ పెరిగిపోతోంది. అన్నయ్యకి ఎలాంటి హాని జరగకూడదని అతను మనసులోనే దేవుణ్ణి ప్రార్థించుకుంటున్నాడు.

"ముందు ఆ యశ్వంత్‌తో తిరిగే ఆ ఇద్దరిలో ఒక్కణ్ణి పట్టుకున్నా మనకు కొంత ఇన్ఫర్మేషన్ దొరుకుతుంది" చెప్పాడు శ్రీనివాస్.

"వాళ్ళిద్దరిలో ఆ రాహుల్‌గాడి ఇల్లు నాకు తెలుసు. పదండి వెళ్దాం" అన్నాడు మహేష్.

ముగ్గురూ రాహుల్ ఇంటికి బయలుదేరారు. అక్కడకు చేరుకోవటానికి పది నిముషాలు పట్టింది.

"అదిగో... ఆ ఇల్లే" ఎదురుగా వున్న ఓ ఇంటిని చూపించాడు మహేష్.

అది కొద్దిగా పెద్దదైన పాతకాలంనాటి పెంకుటిల్లు. అక్కడక్కడ ఇద్దరు ముగ్గురు జనం తప్ప ఆ వీధంతా నిర్మానుష్యంగా వుంది.

మహేష్ తలుపు వద్దకు వెళ్ళాడు. చైతన్య, శ్రీనివాస్ తలుపుకు చెరోపక్క నిల్చున్నారు. మహేష్ మొదట నెమ్మదిగా తలుపు తట్టాడు. కానీ లోపల నుంచి ఎటువంటి రెస్పాన్స్ లేకపోవటంతో రెండవసారి కాస్త గట్టిగా కొట్టాడు.

"ఆ వస్తున్నా" అని వినిపించిన కొద్దిక్షణాలకి తలుపు తీశాడు రాహుల్.

తలుపు తెరవగానే మహేష్‌నిచూసి కంగారుగా తలుపు వేసేయబోయాడు రాహుల్. ఆ కంగారు చూడగానే రమేష్‌ని వీళ్ళే ఏదో చేసుంటారని అర్థమయిపోయింది శ్రీనివాస్ వాళ్ళకి. వాళ్ళింక ఏమాత్రం ఆలస్యం చేయలేదు. ముగ్గురూ ఒకేసారి తలుపుని వెనక్కి నెట్టారు.

తలుపు మూయటానికి ప్రయత్నిస్తున్న రాహుల్ వారి బలానికి నిలబడలేక వెనక్కి పడిపోయాడు. వెంటనే చైతన్య పరిగెత్తుకుంటూ వెళ్ళి రాహుల్‌ని బలంగా కాలితో కడుపులో తన్నాడు. నిలబడటానికి ప్రయ




త్నిస్తున్న రాహుల్ ఆ దెబ్బకు మరలా నేల మీద పడిపోయాడు.

"మా అన్నయ్యను ఏంచేశారు? చెప్పు?" మరలా కాలితో తన్నుతూ ప్రశ్నించాడు చైతన్య.

"నా...నాకేం... తెలుసు" బాధను ఓర్చుకుంటూ అన్నాడు రాహుల్.

అతని మాటలు పూర్తికాకముందే శ్రీనివాస్ పిడికిలి బలంగా అతని చెంపను తాకింది. అతని పళ్లన్నీ కదిలిపోయాయి. శ్రీనివాస్ మరలా పిడికిలి బిగించి అతని మూతి మీద కొట్టబోయాడు.

"కొట్టొద్దు...చెప్తాను...చెప్తాను" అన్నాడు రాహుల్

"చెప్పు..." కసిగా అరిచాడు చైతన్య.

"పోస్ట్ ఆఫీస్ వెనుక వున్న పార్కులో ఒకమూలలో బాగా పెరిగి వున్న మొక్కల వెనుక" అన్నాడు. అంతే చైతన్య వాణ్ణి తన బలమంతా ఉపయోగించి మరోసారి తన్ని బయటకు వచ్చేశాడు.

అక్కడనుండి ముగ్గురూ పార్కుకి బయలుదేరారు. దారిలో చైతన్యకు టెన్షన్ మరింత పెరిగిపోయింది. పార్కులో ఒక మూల పడేశారంటే రమేష్ ఏ పరిస్థితిలో ఉండి ఉంటాడో? ఎప్పుడో మధ్యాహ్నం పోస్ట్ ఆఫీస్‌కి వచ్చిన వాడు ఇప్పటి వరకూ రాలేక పోయాడంటే బహుశా మనిషి స్పృహలో కూడా ఉండి ఉండడేమో? లేకపోతే ఎవరయినా చూసి హాస్పటల్‌లో జాయిన్ చేశారా? అసలు ప్రాణాలతో ఉన్నాడా...? ఆ ఆలోచన రాగానే, ఇక ఆగకూడదు. అన్నయ్యకు ఏంజరిగినా ఆ యశ్వంత్‌ని, వాడి గ్యాంగ్‌ని వదలకూడదని బలంగా నిర్ణయించుకున్నాడు చైతన్య.

ముగ్గురూ పార్కుకి చేరుకొని అన్ని కార్నర్స్‌లోనూ వెతికారు. చివరకు ఒకమూలగా చెట్లవెనుక రక్తపు మడుగులో కనిపించాడు రమేష్. శరీరమంతా రక్తమయం అయిపోయింది. ఒంటిమీద బట్టలన్నీ చెదిరిపోయాయి. స్పృహలో కూడాలేడు.

అన్నను చూడగానే చైతన్య పరిగెత్తుకుంటూ దగ్గరకు వెళ్ళి ముక్కు దగ్గర వేలు పెట్టి చూశాడు. ఊపిరి వెచ్చగా వేలికి తగలటంతో చైతన్య కాస్త సంతోషపడ్డాడు.

ముగ్గురూ కలిసి రమేష్‌ని పక్కనే వున్న నర్సింగ్ హోమ్‌కి తీసుకొని వెళ్లారు. రమేష్‌కి పూర్తిగా డ్రస్సింగ్‌చేసి, గాయాలకు కట్టు కట్టడానికి సుమారు గంటసమయం పట్టింది. అక్కడక్కడా చర్మానికి కుట్లు కూడా పడ్డాయి. ఈలోపుగా ఎక్స్‌రే రిపోర్టు తయారయింది.

"ఎలా ఉంది డాక్టర్" ఆతృతగా ప్రశ్నించాడు చైతన్య.

"ప్రాణానికేం ప్రమాదంలేదు. కానీ దెబ్బలు మాత్రం చాలా బలంగా తగిలాయి. చాలా రక్తం పోయింది. రక్తం ఎక్కిస్తున్నాం. కుడి చెయ్యి విరిగిపోయింది. లేచి తిరగటానికి కనీసం వారం పదిరోజులు పడుతుంది" చెప్పాడు డాక్టర్.

ప్రాణానికేం ప్రమాదం లేదని తెలియగానే ముగ్గురూ రిలాక్స్ అయ్యారు.

"శ్రీనివాస్... ఆ యశ్వంత్‌గాణ్ని ఏదో ఒకటి చేయాలి. ఈరోజే వాడికి ఏదో ఒకటి జరగాలి" కోపంతో ఊగిపోతూ అన్నాడు చైతన్య.

"చైతన్యా... కూల్ డౌన్. ఆవేశపడకు. నిదానంగా ఆలోచించు. తొందరపడితే ఏపనీ జరగదు. వాడు మనకంటే బలమైన వాడు కాబట్టి మనం టైమ్‌చూసి వాణ్ణి కొట్టాలి. మనం రాహుల్‌ని కొట్టాం కాబట్టి వాడు మరింత జాగ్రత్త పడతాడు. ఈ సమయంలో మనం తొందరపడటం అనవసరం. 'ఎప్పుడూ గొడవలు ఎందుకు' అని మీ అన్నయ్యను కంట్రోల్‌చేసే నువ్వే ఇలా ఆవేశపడితే ఎలా? ..."

"కూల్‌గా ఉండలేకపోతున్నాను శ్రీనూ! అన్నయ్యను అలా చూస్తూ ఎలా ఉండగలను?"

"తప్పదు. మనం కూడా తొందరపడితే... మనం కూడా ఇదే హాస్పిటల్‌లో జాయిన్ అవ్వాలి"

"ఏమయినా పరవాలేదు. వాడిని ఏదో ఒకటి చేయాలి. భయంతో కూర్చోవటం కంటే ఏదో ఒకటి చేయటమే మంచిదనిపిస్తోంది"

"ఇది భయంకాదు...జాగ్రత్త. ముందు మీ అన్నయ్యని పూర్తిగా కోలుకోనివ్వు. తరువాత తప్పకుండా నీ కసి తీరుతుంది. ప్లీజ్ నామాట విను"

శ్రీనివాస్ మాటలకు చైతన్య కొద్దిగా కూల్ అయ్యాడు. అయినా అతని కోపం ఇంకా అతడిని రెచ్చగొడుతూనే వుంది.

"చైతన్యా... ముందు నువ్వు ఇంటికి ఫోన్‌చేసి అన్నయ్యకి చిన్న యాక్సిడెంట్ అయిందని ఈరోజు మా ఇంట్లోనే ఉండి రేపు వస్తున్నామని కంగారు పడొద్దని చెప్పు" అన్నాడు శ్రీనివాస్.

"అలాగే" అని చైతన్య ఇంటికి ఫోన్ చేయటానికి వెళ్ళాడు.

★ ★ ★

"రమేష్‌కి ఎలా వుంది?" ప్రశ్నించింది సవిత.

"బాగానే వుంది. దెబ్బలన్నీ తగ్గిపోయాయి. ఇక చేతికి వేసిన సిమ్మెంటు కట్టు తీసేస్తే నార్మల్ అయినట్టే" చెప్పాడు శ్రీనివాస్.

"ఏంటసలు ఈ గొడవలు. ఒకరినొకరు కొట్టుకుంటూ ఎంతకాలం?"

"బహుశా ఇప్పటితో ఈ గొడవలు ఆగిపోవచ్చు. ఎందుకంటే గొడవలన్నీ జరిగింది క్రికెట్ టీమ్ గురించి. టీమ్ సెలక్షన్స్ డేట్ అయిపోయింది. రమేష్ టీమ్ డ్రాప్ అయింది. కాబట్టి మళ్ళీ రమేష్, చైతన్యలు సైలెంట్‌గా ఉంటే ఇక ఏ గొడవలూ జరగక పోవచ్చు"

"ఏంటి?... చైతన్య కూడా గొడవకు రడీ అవుతున్నాడా?"

"ఆ... ఆరోజు వాడిని ఆపటానికి నేనెంత కష్టపడ్డానో..."

"పోనీలే.. ఇకనుంచయినా ఏ గొడవలూ లేకుండా ఉంటే బావుంటుంది. నాకు ఈరోజు చాలా ఆనందంగా ఉంది తెలుసా"

"ఎందుకేంటి?"

"రేపటినుంచి హ్యాపీగా కాలేజ్‌కి వెళ్ళొచ్చు. ఈ పదిహేను రోజులూ బోర్ కొట్టి చచ్చిపోయాననుకో"

"ఏం పాపం! నీకు బోర్ కొట్టే టైమ్ ఎక్కడుంది. రోజూ ఫోన్‌లో గంటలు... గంటలు నా బుర్ర తింటూనే ఉన్నావు. మధ్యమధ్యలో ఇలా పార్కులో. ఇక ఖాళీ ఎక్కడుంది తమరికి"

"అదే బోర్. రోజూ నీతో మాట్లాడి... మాట్లాడి చిరాకొచ్చేసింది. కాలేజ్‌కి వెళితే మిగతా అబ్బాయిలకి సైట్ కొట్టుకోవచ్చు" కళ్ళని చక్రాల్లా తిప్పుతూ అంది సవిత.

"ఓసి దుర్మార్గురాలా! ఈ పదిహేను రోజుల్లోనే నా కంపెనీ బోర్ కొట్టేస్తే ఇక పెళ్ళయితే ఎలా?"

"ఇక అప్పుడు చేసేదేముంది. అంతా నా ఖర్మ అని సరిపెట్టుకుంటాను" బాధను నటిస్తూ అంది సవిత.

"అమ్మో... అయితే నీతో కష్టమే" చాలా చాలా దీనంగా మొహం పెడుతూ అన్నాడు శ్రీనివాస్.

"ఏయ్...ఏంటి నిజమనుకున్నావా?" నవ్వుతూ అడిగింది.

"మరి...కాదా" మరింత అమాయకంగా ప్రశ్నించాడు శ్రీనివాస్.

"ఛ... నేనేదో సరదాగా అన్నాను. అంత బోర్ కొడితే నిన్ను కలవటానికి ఎందుకు వస్తాను. ఏరోజయినా నీతో మాట్లాడకపోతే ఆరోజంతా నాకు చాలా డల్‌గా ఉంటుంది తెలుసా"

"నాకెందుకు తెలియదు?"

"మరెందుకు అంత ఫీల్ అయ్యావు?"

"నేనేం ఫీలవలేదు. నేను ఫీలయ్యానను–




కొని నువ్వే ఫీలయ్యావు"

"అమ్మ దొంగా... నటించి మోసం చేస్తావా! నిన్నెప్పుడూ నమ్మకూడదు"

"తెలిసిందిగా, ఇంకెప్పుడూ నమ్మకు"

"అవునూ, ఇంతకీ రమేష్, సింధుల పరిస్థితి ఏమిటి? "

"ఎవరికి మాత్రం ఏంతెలుసు. వెయిట్ చేసి చూడాల్సిందే"

"నువ్వు చెప్తే సింధు తప్పకుండా వింటుంది. అటువంటప్పుడు నువ్వామెను ఎంకరేజ్ చేయొచ్చుకదా. డిస్కరేజ్ చేస్తావెందుకు? "

"తను చేసినపని కరెక్టు అనిపిస్తే ఎంకరేజ్ చేసేవాణ్ణి"

"అంటే ప్రేమించటం తప్పా? అలాంటప్పుడు నువ్వెలా ప్రేమించావు? "

"నేను చెప్పేది ప్రేమించటం తప్పని కాదు. మనకు సరిపడని వారిని ప్రేమించటం మంచిది కాదని"

"రమేష్ మెంటాలిటీ పూర్తిగా తెలియకుండానే సింధు అతనిని ప్రేమించిందంటావా? "

"సింధుకి, రమేష్ ప్రపోజ్ చేయటానికి ముందు వాళ్ళకున్నది కేవలం రెండు నెలల పరిచయం మాత్రమే. ఆ రెండు నెలల్లో మహా అయితే రోజుకి ఒక గంట మాత్రమే రమేష్‌తో సింధు గడిపి ఉండొచ్చు. రమేష్ మన క్లాస్ కూడా కాదు. అతని టోటల్ బిహేవియర్ అంచనా వేసే ఛాన్స్ ఆమెకు ఖచ్చితంగా లేదు. కాకపోతే స్ట్రయిట్ ఫార్వర్డ్‌గా మాట్లాడటం సింధుని ఇంప్రెస్ చేసుంటుంది. స్ట్రయిట్ ఫార్వర్డ్‌గా మాట్లేడేవారిని అందరూ ఇష్టపడతారు కానీ వారితో కలిసి ఉండాలంటే ఖచ్చితంగా అవతల వ్యక్తి కూడా స్ట్రయిట్ ఫార్వర్డ్ అయి వుండాలి. లేదంటే ఏదో ఒక స్టేజ్‌లో బేధాభిప్రాయాలు వస్తాయి. ఎందుకంటే ఒక మనిషితో రోజుకి ఒక గంట గడపటం వేరు రోజంతా కలిసి బతకటంవేరు. ఈ విషయం నేను ఇంతకుముందు కూడా చెప్పాను"

"నువ్వు చెప్పేది నిజమే. కానీ సింధు అడ్జస్ట్ అవగలదేమో అని నాకు అనిపిస్తోంది"

"ఒక వేళ సింధు అడ్జస్ట్ అయినా రమేష్ అడ్జస్ట్ కాలేడు"

"అదేంటి స్టోరీ మొత్తం రివర్స్ అయ్యింది"

"రివర్సేం అవ్వలేదు. సింధుకి రమేష్ సరిపడడు అంటే రమేష్‌కి సింధు కూడా సరిపడదనే అర్థం"

"అదెలా? "

"ఇప్పటివరకూ సింధూ వైపునుంచే ఆలోచించాం. ఇప్పుడు రమేష్ సైడ్ నుంచి ఆలోచించు. రమేష్ ఏ విషయమయినా స్ట్రయిట్‌గా చెప్పేస్తాడు. అది ఎదుటివారి మనసును బాధపెట్టే విషయమయినా సరే. సింధు ప్రతీ చిన్న విషయాన్నీ సీరియస్‌గా తీసుకుంటుంది. దాంతో రమేష్‌కి ఆమె అంటే అసహ్యం ఏర్పడే అవకాశాలు కూడా ఉన్నాయి"

"అంటే ఇప్పుడు వాళ్ళిద్దరూ విడిపోవటం తప్పదంటావా? "

"ఏమో! అది వాళ్ళు నిర్ణయించుకోవాలి"

"పురాతన కథల్లో నారదుడు చూడు అంతా చేసేసి సైలెంట్‌గా నిలబడిపోతాడు. అలా ఉంది నీ పని" అంది నవ్వుతూ సవిత.

శ్రీనివాస్ ఏం మాట్లాడకుండా నవ్వుతూ ఆమె వైపే చూస్తున్నాడు.

★ ★ ★

"హాయ్... హాయ్..." అంటూ పలుకరింపుల మధ్య పదిహేను రోజుల తరువాత కలిశారు. ఫ్రెండ్సంతా చాలా కాలం తరువాత కలవటంతో క్లాసెస్‌కి గుడ్‌బై చెప్పేసి క్యాంటీన్‌లో మీటింగ్ పెట్టారు. శ్రీనివాస్, మహేష్, రమేష్, చైతన్య, సింధు, భాను, సవిత.

"పదిహేనురోజులే అయినా ఎన్నో నెలలైనట్టు ఉంది" అంది భాను.

"ఏం? తినటానికి మనుషులెవరూ దొరకలేదా?" ప్రశ్నించాడు మహేష్.

"లేదు... అందరూ నీలాంటి బ్రెయిన్‌లెస్ ఫెలోసే దొరికారు"

"అదిసరే... ఏంటి ఈ పదిహేను రోజుల్లో కాస్త సన్నబడినట్టున్నావు"

"అవును... నువ్వు అస్తమానూ బొండాం...బొండాం అంటున్నావు కదా అందుకే డైటింగ్ చేస్తున్నాను. రోజుకి ఒక పూటే తింటున్నాను తెలుసా" సాగదీస్తూ మరీ చెప్పింది భాను.

"నిజమా! నా మాట వింటున్నావంటే నీకు కూడా బాగుపడే లక్షణాలు వస్తున్నాయన్నమాట"

"నీ మాట నేనెప్పుడూ వింటాను" మూతిని ముప్పై ఆరు వంకర్లు తిప్పుతూ అంది భాను.

"ఏంటది? ఈ మాటలేవో తేడాగా ఉన్నాయే" అనుమానంగా అన్నాడు చైతన్య.

"కరక్టే... ఆ రోజు బుక్ గేమ్‌లో దొరికిపోయారు. ఈ రోజు ఇలా. డౌట్‌లేదు. మనకి తెలియకుండా వీళ్ళిద్దరూ ట్రాక్ మెయింటైన్ చేసేస్తున్నారు" అన్నాడు శ్రీనివాస్.

"ఛీ...ఛీ... పోయి... పోయి వీణ్ణే లవ్ చేయాలా. వీడికంటే మన గేట్ దగ్గరుండే ఆ ముసలి వాచ్‌మెన్ బెస్ట్. వాడయినా అమ్మాయిల వంక కాస్త ఆశగా చూస్తాడు. వీడూ ఉన్నాడు ఎందుకు అమ్మాయిని చూస్తే చాలు మెలికలు తిరిగిపోతూ అరకిలోమీటరు దూరం పారిపోతాడు. ఒక్కోసారి వీడు నిజంగా మగవాడేనా అని అనుమానం వస్తుంది"

ఆ మాటలకు అందరూ నవ్వేశారు.

"ఓయ్... ఏంటి... వాడూ... వీడూ అంటున్నావ్. మాటలు జాగ్రత్తగా రానీ. లేదంటే పళ్లు చేతిలోకి వచ్చేయగలవ్"

"పోరా! నీకంత గట్స్ ఉండేడిస్తే కదా నన్ను కొట్టటానికి"

'అమ్మో! ఈ పదిహేను రోజుల్లో ఇది చాలా డెవలప్ అయ్యింది. దీంతో చాలా జాగ్రత్తగా ఉండాలి' అనుకున్నాడు మహేష్.

"వాళ్లసంగతి ఎందుకుగాని. నువ్వేంటి... ఎప్పుడు ఫోన్ చేసినా ఇంట్లో ఉండేవాడివి కాదు ఏంటంత బిజీ" శ్రీనివాస్‌ని ప్రశ్నించాడు చైతన్య.

"నువ్వు ఏ టైమ్‌లో చేశావు" వెంటనే ప్రశ్నించాడు మహేష్.

"ఈవినింగ్ టైమ్‌లో. ఒకరోజు కాదు వరుసగా మూడురోజులు చేశాను. ఒక్క రోజు కూడా దొరకలేదు"

"ఈవినింగ్ టైమ్‌లో చేస్తే అన్నగారు ఇంటిదగ్గర ఉండరు. పార్కులో ఉంటారు" సవితవైపు, శ్రీనివాస్‌వైపు మార్చిమార్చి చూస్తూ చెప్పాడు మహేష్.

వాడిని ఇరికించినందుకు తనమీద రివెంజ్ తీర్చుకొంటున్నాడని అర్థమైపోయింది శ్రీనివాస్‌కి.

"పార్కా! ఎందుకు?" ప్రశ్నించాడు చైతన్య.

"పార్కుకి ఎందుకు వెళతారు. ఫ్రెష్ ఎయిర్ కోసం" వెంటనే అన్నాడు శ్రీనివాస్.

"అవునవును ఫ్రెష్ లవ్ ఎయిర్‌కోసం" వెంటనే అన్నాడు మహేష్.

అప్పటికిగాని చైతన్యకి విషయం అర్థంకాలేదు.

"అందరినీ అంటావుగాని నువ్వే మాదగ్గర అన్ని విషయాలూ దాచేస్తావు" నిష్ఠూరంగా అన్నాడు మహేష్ శ్రీనివాస్‌ని.

"ఛ... నేనేం దాచలేదు. సవిత అంటే నాకు ఇష్టమని మీ అందరికీ ఎప్పుడో చెప్పాను" అన్నాడు శ్రీనివాస్.

"అంతేగాని తను నీకు ఐ లవ్ యు చెప్పిందని మాకు చెప్పలేదుకదా!"

"అది... అది... సవిత చెప్పవద్దంది"

నేరం అంతా సవిత మీదకు నెట్టేశాడు.

"నేనా! నేనెప్పుడు చెప్పాను? " కంగారు పడిపోయింది సవిత.

"పోనీలే కానీ... శ్రీనూ! జాగ్రత్తగా ఉండు. ఆర్ట్స్ గ్రూప్‌వాళ్ళ బ్రెయిన్‌నిండా రాజకీయమే ఉంటుంది" అంది భాను.

"అదే నాకు భయంగా ఉంది" అన్నాడు శ్రీనివాస్.

"మీ సైన్స్‌గ్రూప్ బ్రెయిన్ అంతా కెమికల్స్ కంపు. దానికి నేనే భయపడాలి" అంది సవిత. అందరూ ఒకసారి మనస్ఫూర్తిగా నవ్వుకున్నారు.

"మీ ప్రేమన్నా సక్సెస్ కావాలని కోరుకుంటున్నాను" అంది అప్పటివరకూ మౌనంగా కూర్చున్న సింధు. ఆమె మాటల్లో తన ప్రేమ సక్సెస్ కాలేదన్న బాధ స్పష్టంగా కనిపించింది.

ఆ మాటకు శ్రీనివాస్ మనసు బాధపడింది. మొదటిసారిగా ఆమెను ఆలోచించేలా చేసి తప్పు చేశానా అని ఆలోచనలో పడ్డాడు.

సవితకు అతని ఆలోచన అర్థమయ్యింది. ఓదార్పుగా తన చేతిని శ్రీనివాస్ భుజంపై వేసింది. తనపై చేయిపడేసరికి శ్రీనివాస్, సవిత వైపు చూశాడు. మొట్టమొదటిసారిగా శ్రీనివాస్ కళ్ళలో కన్నీటిపొరను చూసి సవిత చలించిపోయింది. 'బాధపడొద్దు' అన్నట్టు కళ్ళతోనే సైగ చేసింది.

"ఇంతకీ... రమేష్ ఎక్కడ? " భారమైపోయిన వాతావరణాన్ని మార్చటానికి ప్రయత్నిస్తూ అన్నాడు మహేష్.

"అవును ఇందాకటి వరకూ ఇక్కడ ఉన్నాడుకదా! ఇంతలోనే ఎక్కడికి వెళ్ళినట్టు" అంది భాను.

"వీళ్లలా కబుర్లలో ఉండగా అక్కడ రమేష్.

★ ★ ★

యశ్వంత్‌ని కాస్త దూరంలో ఫాలో అవుతున్నాడు రమేష్. కాలేజ్ కారిడార్ నిండా స్టూడెంట్స్ ఉండటంతో యశ్వంత్ రమేష్‌ని గుర్తించే అవకాశం కూడా పెద్దగా లేదు.

ఏమాత్రం ఛాన్స్ దొరికినా యశ్వంత్‌ని మళ్ళీ తేరుకోలేకుండా కొట్టాలని రమేష్ ఆశ. పదిహేను రోజులుగా రమేష్‌లో కోపం పెరిగి పెరిగి శాడిజంగా తయారయింది.

యశ్వంత్ టాయిలెట్స్ వైపు దారితీశాడు. రమేష్ కూడా అతన్ని అనుసరించాడు. అక్కడ స్టూడెంట్స్ ఎవరూ లేకపోవటంతో రమేష్ వడివడిగా యశ్వంత్‌ని సమీపించాడు.

యశ్వంత్ అడుగుల చప్పుడు విని వెనక్కి తిరిగి రమేష్‌ని చూసి ఆశ్చర్యపోయాడు. వెంటనే అతనికి అనుమానం వచ్చి రమేష్‌ని ఎదుర్కోవటానికి సిద్ధపడబోయాడు. కానీ అప్పటికే ఆలస్యం అయిపోయింది.

రమేష్ తన చేతికి ఉన్న సిమెంట్ కట్టుతో బలంగా యశ్వంత్ మొహంపై కొట్టాడు. దాదాపు ఏడెనిమిది కేజీల బరువుండే ఆ కట్టు తగలటంతో యశ్వంత్ విసురుగా వెనక్కి వెళ్ళి గోడకు గుద్దుకొని బోర్లా పడ్డాడు.

రమేష్ చెయ్యి కూడా కొద్దిగా నెప్పి పుట్టింది. కానీ యశ్వంత్ బాధ పడుతుంటే కలిగిన శాడిస్టిక్ ఆనందంలో ఆ బాధను మరిచిపోయాడు.

యశ్వంత్ పైకి లేవకుండా వాడి వెన్ను మీద మరలా బలంగా తన్నాడు. ఆ దెబ్బకు యశ్వంత్ అరుపుతో ఆ ప్రాంతం ప్రతిధ్వనించింది.

యశ్వంత్ అతి కష్టంమీద రమేష్‌ని వెనక్కి నెట్టి పైకిలేచి బయటకు పరిగెత్తబోయాడు. కానీ రమేష్ అతనికంటే ఫాస్ట్‌గా రియాక్ట్ అయ్యాడు. వెనుకనుండి బలంగా తన్నాడు.

యశ్వంత్ టాయిలెట్‌కి, గోడకు మధ్య ఉన్న గ్యాప్‌లో పడ్డాడు. అతని కాలు అక్కడ ఉన్న సిమ్మెంటు దిమ్మను బలంగా తాకి 'ఫట్' మన్న శబ్దం వచ్చింది. అంతే యశ్వంత్ ఇక పైకి లేవలేకపోయాడు.

"మరలా యశ్వంత్‌మీదకు వెళుతున్న రమేష్‌కి ఎవరో వస్తున్నట్టు అలికిడి వినిపించటంతో ఎవరికీ కనిపించకుండా ఒక మూలకి తప్పుకున్నాడు. టాయ్‌లెట్స్‌కు ఆనుకొని ఉన్న కాంపౌండ్‌వాల్ దూకి కాలేజ్ బయటకు వచ్చేశాడు.



"అందరం చాలారోజుల తరువాత కలిసిన సందర్భంగా ఈరోజు. పిక్చర్‌కి వెళదామా" ప్రపోజ్ చేసింది భాను.

"ఓ. కే." అందరూ హుషారుగా అన్నారు.

ఇంతలో రమేష్ వాళ్ళ దగ్గరకు వచ్చాడు.

"ఏంరా! ఇటువైపునుంచి వచ్చావు? బయటకు ఎప్పుడెళ్లావు? అయినా బట్టలేంటి అలా తడితడిగా ఉన్నాయి?" అనుమానంగా ప్రశ్నించాడు చైతన్య.

"నాకిప్పుడు చాలా ఆనందంగా ఉంది. నా కసి అంతా తీరిపోయింది" శాడిస్ట్‌లా నవ్వుతూ అన్నాడు రమేష్.

"అంటే... యశ్వంత్‌నిగాని కొట్టావా?" కంగారుగా ప్రశ్నించాడు శ్రీనివాస్.

"అవును. అసలు ఆరోజే వాడు ఐపోయేవాడు. కానీ నన్ను వెనుకనుంచి కొట్టి బతికిపోయాడు. ఈరోజు అదే పద్ధతిలో వాణ్ణి నేను కొట్టాను"

"ఛ... మరలా మొదటికొచ్చింది" చేత్తో తలపట్టుకుంటూ అన్నాడు శ్రీనివాస్.

"మొదటికేం రాలేదు. వాడు నా టీమ్ టోర్నమెంట్‌కి వెళ్ళకుండా చేశాడు. నేను వాడు వెళ్ళకుండా చేశాను. దట్సాల్"

"రమేష్... నీకసలు బుద్ధుందా! నిన్ను కొట్టాడని నువ్వు వాణ్ణి కొట్టావ్. మళ్ళీ వాడు నిన్ను కొడితే నువ్వెళ్ళి వాణ్ణి కొడతావ్. ఎంతవరకు ఇలా? చెయ్యి విరిగింది సరిపోదా?" చాలా కోపంగా అంది సింధు.

సింధు అంత కోపంగా మాట్లాడటం ఇప్పటివరకూ ఎవరూ చూడలేదు. అందుకే అందరూ సింధుని ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయారు రమేష్‌తో సహా. ఆమె బాధ అందరికీ తెలుసు. అందుకే అందరూ మౌనంగా ఉండిపోయారు.

"మూర్ఖత్వం... ప్రతీదానికీ ఆవేశమే!? ఆలోచన ఉండక్కర్లేదా? ఏది అనిపిస్తే అది చేసేయటమేనా?" కోపాన్ని అణుచుకోవటానికి ప్రయత్నిస్తూ అంది సింధు.

"సింధూ... నువ్వూ నన్ను తిడుతున్నావా? నేను చేసినదానిలో తప్పు ఏముంది? నన్ను కొట్టినవాణ్ణి నేను కొట్టడం తప్పా?" ప్రశ్నించాడు రమేష్.

"ఇప్పుడు ఏం మాట్లాడినా వాదన పెరగటం తప్ప ఏం లాభం ఉండదని సింధు సైలెంట్ అయిపోయింది.

"అదికాదు రమేష్?.. వాడు నిన్ను కొట్టింది కాలేజ్ బయట. దానితో కాలేజ్‌కి ఏం సంబంధం ఉండదు. కానీ నువ్వు వాణ్ణి కొట్టింది క్యాంపస్‌లో. ఇప్పుడు ప్రిన్సిపాల్ కూడా నీ మీద యాక్షన్ తీసుకోవచ్చు. అది నీ కాండక్ట్ మీద రిమార్క్‌గా మిగిలిపోతుంది" చెప్పాడు శ్రీనివాస్.




"ఇక ఏం జరిగినా పరవాలేదు. నేను చెయ్యాలనుకొన్నది చేశాను. అంతే"

అతని మాటల్లో అందరికీ మూర్ఖత్వమే కనిపించింది.

ఇంతలో అంబులెన్స్ కాలేజ్ ఆవరణలోనికి ప్రవేశించింది.

"ఏంట్రా! కదలలేనంత దారుణంగా కొట్టావా?" అనుమానంగా ప్రశ్నించాడు చైతన్య.

"ఏమో! నేనంత గట్టిగా కొట్టాననుకోవటంలేదు" అన్నాడు రమేష్.

"ఎమ్.ఎల్.ఏ. కొడుకురా! కాస్త హడావుడి చేస్తున్నట్టున్నారు" అన్నాడు మహేష్.

శ్రీనివాస్ ఊహించినట్టుగానే అంబులెన్స్ వెళ్ళిపోగానే రమేష్‌కి ప్రిన్సిపాల్ దగ్గర నుండి పిలుపు వచ్చింది.

★ ★ ★

"రమేష్... నువ్వు యశ్వంత్‌ని కొట్టావా?" ప్రశ్నించాడు ప్రిన్సిపాల్.

"యస్... సర్" తల వంచుకొని సమాధానం చెప్పాడు రమేష్.

"ఎందుకయ్యా! మంచి స్టూడెంట్స్ కూడా గొడవలలో ఇన్వాల్వ్ అయి లైఫ్‌ని స్పాయిల్ చేసుకుంటారెందుకు. వాడి గురించి, వాళ్ళ నాన్న గురించి తెలిసే వాడిని కొట్టావా?"

"వాడికి, వాళ్ళ నాన్నకి ఎందుకు సార్ భయపడటం. నన్ను కొట్టినవాణ్ణి నేను కొట్టాను. అందులో తప్పేముంది సార్?"

"ఇక్కడ పరిస్థితి నువ్వు అనుకున్నట్టుగా ఉండదు. అతడు నిజంగా నిన్ను కొట్టినా నేను వాణ్ణేం చెయ్యలేను. కానీ ఇప్పుడు నేను నీమీద యాక్షన్ తీసుకోపోతే నా ఉద్యోగానికే ప్రమాదం వస్తుంది"

"మీరు ఏ యాక్షన్ తీసుకున్నా దానిని భరించటానికి నేను సిద్ధంగా ఉన్నాను సర్"

"నిన్ను నేను ఒక నెల సస్పెండ్ చేస్తున్నాను. ఇది ఒకవిధంగా నీకు కూడా మంచిది. యశ్వంత్ నాన్న నిన్ను ఏమీ చెయ్యకుండా ఈ సస్పెన్షన్ నిన్ను కాపాడొచ్చు. నీ కాండక్ట్‌పై ఎటువంటి రిమార్కు రాకుండా నేను చూసుకుంటాను. ఇంత కంటే నేను నీకే హెల్పూ చేయలేను"

"థాంక్యూ సర్!" అని ప్రిన్సిపాల్ రూమ్‌లో నుంచి వచ్చేయబోయాడు.

"రమేష్... ఒక్క విషయం" అన్నాడు ప్రిన్సిపాల్. రమేష్ మళ్ళీ వెనక్కివచ్చాడు.

"చెప్పండి సార్!"

"అనవసరంగా పెద్దవాళ్ల జోలికి వెళ్ళకు. ఎందుకు చెపుతున్నానో అర్థం చేసుకో" అన్నాడు ప్రిన్సిపాల్.

రమేష్ సమాధానంగా ఓ చిన్న నవ్వు నవ్వి అక్కడనుండి శ్రీనివాస్ వాళ్ళ దగ్గరకు వచ్చాడు.

"ఏరా అన్నయ్యా? ప్రిన్సిపాల్ ఏమిచ్చాడు గిఫ్ట్" ప్రశ్నించాడు చైతన్య.

"ఏముంది. నెలరోజుల సస్పెన్షన్"

"హాలీడేస్ ఎక్స్‌టెండ్ చేశారనుకొని హాయిగా ఇంటికెళ్ళి నిద్రపో"

"అదే చెయ్యాలి"

★ ★ ★

యశ్వంత్ హాస్పిటల్ బెడ్‌పై ఉన్నాడు. అతని తండ్రి రాజేంద్రకుమార్ అసహనంగా అతని బెడ్ వద్ద పచార్లు చేస్తున్నాడు. ఇంతలో డాక్టర్ వచ్చాడు.

"వాట్ డాక్టర్? ఎనీథింగ్ ప్రాబ్లం?" ప్రశ్నించాడు రాజేంద్రకుమార్.

"ఏమీలేదు సర్. కాకపోతే కాలు విరిగింది. అది సెట్ అవటానికి మాత్రం నెలా పదిహేనురోజులు పడుతుంది. అంతవరకూ నడవటం కుదరదు" చెప్పాడు డాక్టర్.

ఆ మాట వినగానే రాజేంద్రకుమార్ మొహం ఎర్రగా మారిపోయింది.

"ఎవడ్రా వాడు? నా కొడుకు కాలు విరగ్గొడతాడా? వాడి ప్రాణాలు తీసేస్తాను. ఓయ్ ప్రిన్సిపాల్... ఎవడు వాడు? ఎక్కడుంటాడు?" చాలా గట్టిగా అరిచాడు రాజేంద్రకుమార్.

అతని మాటలు హాస్పిటల్‌లో ప్రతిధ్వ నించాయి.

రాజేంద్రకుమార్ కోపం చూసి డాక్టర్, ప్రిన్సిపల్‌తో సహా అందరికీ పైప్రాణాలు పైనే పోయాయి.

"సార్.. వాణ్ణి ఆల్‌రెడీ కాలేజ్‌నుండి సస్పెండ్ చేశాను సార్!" వణికిపోతూ విన యంగా చెప్పాడు ప్రిన్సిపాల్.

"నీబోడి సస్పెన్షన్ ఎవడికి కావాలి. వాడి ప్రాణాలు కావాలి నాకు. చెప్పు ఎక్కడుం టాడు వాడు"

"డాడీ... మీరు అతన్నేం చెయ్యొద్దు" అన్నాడు అప్పటివరకు వీళ్ళ సంభాషణ వింటున్న యశ్వంత్.

"యశ్వంత్.. నువ్వు మాట్లాడకు. వాడి సంగతి నేను చూసుకుంటాను"

"వద్దు డాడీ... నా మాట వినండి. నేను వాణ్ణేం చేయలేక మీ పవర్ ఉపయోగించా నని నన్ను పిరికివాణ్ణి చూసినట్టు చూస్తా రంతా. వాడి సంగతి నేనే చూసుకుంటాను. అవసరమయినప్పుడు చెప్తాను. అప్పుడు మీరు మీ పవర్ ఉపయోగించుదురు"

"అది కాదురా! వాణ్ణలా వదిలేస్తే రేపు మళ్ళీ నిన్ను కొట్టడానికి వస్తాడు"

"అలా వదలను డాడీ. వాడి సంగతి నేను అతిత్వరలోనే తేలుస్తాను. ఈ ఒక్క విషయంలో నా మాట వినండి... ప్లీజ్"

"సరే నీ ఇష్టం. కానీ జాగ్రత్త. ఏ అవస రమయినా నాకు వెంటనే ఫోన్ చెయ్యి"

"అలాగే డాడీ" అన్నాడు యశ్వంత్.

రాజేంద్రకుమార్ అక్కడనుంచి వెళ్ళిపో యిన తరువాత డాక్టర్ హాయిగా ఊపిరి పీల్చుకున్నాడు.

★ ★ ★

తండ్రి వెళ్ళిపోయిన తరువాత యశ్వంత్ కొద్దిసేపు ఆలోచనల్లో మునిగిపోయాడు. కొద్దిసేపటికి ఒక నిర్ణయానికి వచ్చి పక్కనే ఉన్న రాహుల్‌ని పిలిచాడు.

"రాహుల్... మన వాళ్ళని తీసుకుని వెళ్ళి ఆ రమేష్‌గాడు ఎక్కడున్నా వెతికి వాడి రెండు కాళ్ళూ విరిచేయండి. మళ్ళీ జీవితంలో వాడు నడవటానికి పనికి రాకూ డదు" ఆర్డర్ జారీ చేశాడు యశ్వంత్.

"అలాగే..." అని రాహుల్ వెళ్ళబో యాడు.

"కానీ ఒక్క విషయం..." అన్నాడు యశ్వంత్.

ఏమిటన్నట్టు వెనక్కి తిరిగి చూశాడు రాహుల్.

"ప్రాణానికి మాత్రం ఏం జరగకూడదు"

"ఓ. కే..." అని చెప్పి రాహుల్ వెళ్ళిపో యాడు.

యశ్వంత్ ఆనందంగా కళ్ళు మూసుకు న్నాడు.

★ ★ ★

రమేష్ ఇంట్లో అసహనంగా పచార్లు చేస్తున్నాడు.

ఈరోజు కాలేజీలో జరిగిన సంఘటన గుర్తొస్తుంటే కోపం, కసి పెరిగిపోతున్నాయత నికి. తన కసి తీరేలా యశ్వంత్‌ని కొట్టినం దుకు ఆనందంగా ఉన్నా అందరూ తను చేసి నపనే తప్పన్నట్టు తనని విమర్శించటం అత నికి మింగుడు పడటంలేదు. తనకు సపోర్ట్ చేయాల్సిందిపోయి తనను విమర్శించిన అందరిమీదా చాలా కోపంగా ఉందతనికి.

అందరితోపాటు సింధు కూడా ఎప్పుడూ లేనంత కోపంగా మాట్లాడటం అతని మన సుని మరింత గాయపరిచింది. ఎవరు ఏమనుకున్నా తనకు లెక్కలేదు. కానీ సింధు మాత్రం తనను అర్థం చేసుకోవాలి. అంటే వెంటనే సింధుతో మాట్లాడాలి. ఎలా గయినా తను చేసిన పని తప్పు కాదని ఆమెతో చెప్పాలి.

ఇలా ఆలోచించి ఫోన్ వద్దకు వెళ్ళాడు రమేష్. రిసీవర్ చేతిలోకి తీసుకుని సింధు నెంబర్ డయల్ చేశాడు.

ఎంతసేపు రింగ్ అయినా ఫోన్ మాత్రం ఎవరూ లిఫ్ట్ చేయటంలేదు. కొద్దిసేపు





చూసి తనే స్వయంగా సింధు వాళ్ళింటికి వెళ్ళాలని నిర్ణయించుకొని ఫోన్ పెట్టేసి బయలుదేరాడు.

"అమ్మా! నేను బయటకు వెళ్తున్నా"

"ఏడవుతోంది... ఈ టైమ్‌లో ఎక్కడి కిరా? " ప్రశ్నించింది రమేష్ తల్లి.

"ఇప్పుడే వచ్చేస్తానమ్మా" అని ఆవిడ సమాధానం కోసం ఎదురుచూడకుండా బయటకు వచ్చేశాడు.

పల్లెటూరు కావటంవల్ల అప్పటికే వీధు లన్నీ ఇంచుమించు నిర్మానుష్యంగా ఉన్నాయి. వీధిలైట్ల వెలుగులో నడుస్తున్న రమేష్, తన నీడతోపాటు ఎవరిదో నీడ కని పించేసరికి వెనక్కి తిరిగి చూశాడు. వెనుక నలుగురు వ్యక్తులు వస్తూ కనిపించారు. స్ట్రీట్‌లైట్ వారి వెనుక ఉండటంతో వాళ్ళని గుర్తు పట్టడానికి రమేష్‌కి కొంత సమయం పట్టింది.

వాళ్ళెవరో తెలియగానే రమేష్ ఆశ్చర్యపో యాడు. వెంటనే గుండెలో కొద్దిగా భయం కూడా మొదలయ్యింది.

"రా...హు...ల్..." అప్రయత్నంగానే ఉచ్ఛరించాయి అతని పెదవులు. అప్పుడు చూశాడు. రమేష్ వాళ్ళ చేతుల్లో ఉన్న హాకీ బ్యాట్స్‌ని. అతనికి పరిస్థితి అర్థమ య్యింది. ఇటువంటి సిట్యుయేషన్ వస్తుం దని రమేష్ ముందే ఊహించాడు. కానీ ఇంత త్వరగా వస్తుందని మాత్రం ఊహిం చలేదు.

రమేష్ ఏ మాత్రం ఆలస్యం చేయకుండా తన కాళ్ళకి పనిచెప్పాడు.

ఆ ఊరిలో ప్రతీ సందు తనకు పరిచయ మైనదే కాబట్టి సులువుగా వాళ్ళనుంచి తప్పించుకోవచ్చు. నలుగురూ కలిసి ఉండగా వాళ్ళని ఎదుర్కోవటం కష్టం కాబట్టి ఈ సందుల్లో వాళ్ళని విడగొట్టి ఒక్కొక్కర్నే ఎదుర్కోవాలన్నది రమేష్ ఆలో చన.

రమేష్ ఆగకుండా పరిగెడుతున్నాడు. స్ట్రీట్ లైట్ల కాంతి కూడా సరిగా లేని ఆ ఇరుకు సందులలో పరిగెత్తడం చాలా కష్టంగా ఉందతనికి. మరొకవైపు ఆయా సంతో ఎగశ్వాస వస్తోంది. పరిగెత్తడం మానేస్తే ఇక తన ప్రాణాలు మిగలవని తెలిసి సాధ్యమైనంత వేగంగా పరిగెత్తటా నికి ప్రయత్నిస్తున్నాడు.

అలా పరిగెత్తుతుంటే రమేష్‌కి దూరంగా పాడుపడిన ఇల్లు ఒకటి కనిపించింది. తను వాళ్ళకి దొరకకుండా ఉండాలంటే ఆ ఇంట్లో దాక్కోవటం ఒక్కటే మార్గం అని భావించి వెంటనే ఆ ఇంటిలోకి పరుగుతీశాడు.

కొద్దిసేపటికి రమేష్‌ని తరుముకుంటూ వచ్చిన నలుగురూ ఆ ఇంటి ముందుకు వచ్చి ఆగారు.

"ఇక్కడ నుంచి ఎక్కడకి వెళ్ళుంటాడు? " అన్నాడు రాహుల్.

లోపలనుంచి స్ట్రీట్‌లైట్ కింద నిలబడి మాట్లాడుకుంటున్న వీళ్ళ మాటల్ని చాలా జాగ్రత్తగా వింటున్నాడు రమేష్.

"ఆ ఇంట్లోకిగానీ వెళ్ళాడేమో? " అన్నాడు వారిలో ఒకడు.

ఆ మాట వినగానే రమేష్‌కి గుండెల్లో చలి మొదలయ్యింది. వాళ్ళు గనుక లోప లికి వస్తే తను దొరికిపోవటం ఖాయం. ఇప్పుడేం చెయ్యాలి? అన్న ఆలోచనలో పడ్డాడు రమేష్.

బయట నిలబడి ఉన్న వాళ్ళు ఆ ఇంటి వైపు రెండు అడుగులు వేశారు.

గోడ చాటునుంచి చూస్తున్న రమేష్‌కి తెగింపు వచ్చింది. 'ఏమయితే అయ్యింది వాళ్ళని ఎదుర్కోవాలి' అని బలంగా నిశ్చ యించుకున్నాడు.

ఆ సమయంలో...

★ ★ ★

"హలో... ఆంటీ. బావున్నారా? " కుశల ప్రశ్నలు వేస్తూ లోపలికి వచ్చింది సవిత.

"ఆ... సవితా నువ్వా! ఏంటి అసలు రావటమే మానేశావు? " ప్రశ్నించింది శ్రీని

వాస్ తల్లి పుష్ప.

"మొన్న ఆదివారం వచ్చాను. మీరు ఇంట్లో లేరు"

"అవునమ్మా. అంకుల్, నేను ఊరు వెళ్ళాం. ఆ ముందురోజు వరకు శ్రీను కూడా వస్తానన్నాడు. కానీ ఉదయాన్నే రాననేశాడు. అది సరే కానీ మమ్మీ, డాడీ ఎలా ఉన్నారు? "

"అంతా బావున్నారాంటీ. శ్రీనివాస్ ఎక్కడ? "

"తన రూమ్‌లో ఉన్నాడు" చెప్పింది పుష్ప.

"సవిత, శ్రీనివాస్ రూమ్‌లోకి వెళ్ళేసరికి అతను కుర్చీలో కూర్చొని ఏదో పుస్తకం చదువుతున్నాడు. సవిత చప్పుడు చేయకుండా కుర్చీ వెనక్కి వెళ్ళి అతని కళ్లను మూసింది.

"ఎవరో చెప్పుకో చూద్దాం" ప్రశ్నించింది సవిత.

"సవిత" వెంటనే చెప్పాడు శ్రీనివాస్.

"అరె! భలే గుర్తుపట్టేశావ్. ఎలా? " ఆశ్చర్యంతో ప్రశ్నించి అతనికి ఎదురుగా వచ్చి కూర్చుంది.

"మొద్దూ! కళ్లు మూసి సైలెంట్‌గా నిలబడ్డాలిగానీ 'ఎవరో చెప్పుకో చూద్దాం', 'నేను సవితేనా! కాదా? ' అని ఎవరయినా ప్రశ్నిస్తారా. నీ వాయిస్ నాకు తెలియదంటావా? తెలివితేటలు ఎక్కువైపోతున్నాయి"

"అవునుకదా! నేను అసలు ఆలోచించనే లేదు"

"నువ్వు అన్నీ ఆలోచిస్తే నన్ను ఇంత త్వరగా ఎందుకు ప్రేమిస్తావ్? " వాయిస్ తగ్గించి నెమ్మదిగా అన్నాడు శ్రీనివాస్.

"ఏంటి అన్నావ్? మళ్ళీ చెప్పు"

"ఏంలేదులే. నువ్వేంటి ఈ టైమ్‌లో ఇలా వచ్చావు? "

"నిన్ను చూడాలనిపించింది వచ్చాను. ఏం రాకూడదా!"





"వద్దన్నా నువ్వు మానతావా? సరేలే ఇంకేంటి విశేషాలు? " నవ్వుతూ అన్నాడు శ్రీనివాస్.

"నిన్నో విషయం అడుగుదామని వచ్చాను"

"మరి ఇంకేంటి ఆలస్యం. అడుగు"

"నువ్వు బాధపడనని నాకు ప్రామిస్ చెయ్యాలి"

"బాధపడే విషయమయితే ఖచ్చితంగా బాధపడతాను"

"నువ్వు బాధపడినా సరే నేను అడిగే తీరతాను"

"అంత స్ట్రాంగ్‌గా డిసైడ్ అయిన తరువాత ఇక ఆర్గ్యుమెంట్స్ దేనికి. అడుగు"

"మన ఇద్దరం ప్రేమ గురించి వాదించుకున్నాం గుర్తుందా! ఆరోజునుంచి అప్పుడప్పుడు నాకో చిన్న అనుమానం వస్తోంది. నువ్వు నన్ను... డబ్బు... గురించే... ప్రేమించావేమోనని" చివరి పదాలను అతి కష్టంమీద భయపడుతూ నెమ్మదిగా పలికింది సవిత.

శ్రీనివాస్ రెస్పాన్స్ కోసం అతని మొహంలోకి చూసింది. శ్రీనివాస్ ఏం సమాధానం చెప్పకుండా ఎటో చూస్తుండటంతో సవిత బాధపడింది. అనవసరంగా అడిగి శ్రీనివాస్‌ని బాధపెట్టాను అనుకొంది.

"శ్రీనివాస్... ఫీలయ్యావా? అందుకే అడగకూడదనుకున్నాను. కానీ ఎక్కువ కాలం మనసులో దాచుకోలేకపోయాను" బాధగా అంది సవిత.

"ఛ... నేనేం ఫీలవలేదు. ఈ ప్రశ్న అడగకుండా నువ్వు మనసులో దాచుకుంటేనే నేను బాధపడేవాణ్ణి. ఇప్పుడు నేను నీ ప్రశ్నకు ఎలా జవాబు చెప్పాలా అని ఆలోచిస్తున్నాను" అన్నాడు శ్రీనివాస్.

సవిత కొద్దిగా ఊపిరి పీల్చుకొంది. ఇప్పుడు శ్రీనివాస్ ఏం సమాధానం చెప్తాడా అని ఆసక్తిగా ఎదురుచూస్తోంది.

"సవితా... మీ డాడీని ఎవరయినా అనాధని దత్తత తీసుకోమని, ఆయన వ్యాపా

రాలు, స్థిరాస్తులు అన్నీ అతని పేరున రాసే యమని చెప్పు. అప్పుడు నీకు ఎటువంటి ఆస్థులూ ఉండవు. అప్పుడు నిన్ను నేను ప్రేమిస్తానో లేదో చూద్దువుగాని. ఎందు కంటే ఈ విషయంలో నిన్ను నమ్మించటా నికి నా దగ్గర ఎలాంటి ఆధారాలూ లేవు. కానీ ఒక్కటి మాత్రం చెప్పగలను. నేను నిన్ను మొట్టమొదట గుడిలో చూసి ఇష్టప డ్డాను. అప్పటికి నువ్వు ఎవరో కూడా నాకు తెలియదు. ఆ తరువాత ఇంచుమించు ఆరునెలల తరువాత నీతో పరిచయం అయ్యింది. అప్పటికే నువ్వంటే నాకు తెలి యకుండానే ప్రేమ ఏర్పడింది. అప్పటికి కూడా నువ్వో బిజినెస్ పర్సన్ కూతురివని నాకు తెలియదు"

"మరయితే ఆరోజు ఎందుకలా చెప్పావ్? "

"చెప్పానుగా. అది కేవలం నా అభి ప్రాయం మాత్రమే. అభిప్రాయం గురించి ఆలోచిస్తాం. దానివల్ల మనకు ఇష్టమైనది చేజారిపోతుందని తెలిస్తే మన అభిప్రా యాన్ని మార్చుకోవటానికి సిద్ధపడతాం. ఇదీ అంతే. కానీ నా అదృష్టం, నాకు నా అభిప్రాయాన్ని మార్చుకోవాల్సిన అవసరం రాలేదు"

"మరి నీ అభిప్రాయానికి తగ్గట్టుగానే ఉన్నానుకదా నేను. అయినా అంత ఆలో చించటం ఎందుకు? "

"నువ్వు నా కంటే మరీ ఎక్కువ అంత స్థలో ఉన్నావుకదా అందుతావో అందవో నని"

"నీకంటే నాకు డబ్బు ముఖ్యం కాదు"

"కనీసం ఇప్పటికయినా నమ్ముతావా నా ప్రేమ నిజమైనదని"

"నీమీద నాకు నమ్మకం ఉంది. కానీ అది నీ నోటినుంచే వినాలని అడిగాను"

"అదే మంచి పద్ధతి. మనకున్న అనుమా నాన్ని లోపలే దాచుకుంటే ఎంతటి నమ్మ కాన్ని అయినా అది మింగేస్తుంది"

"ఇప్పుడు నాకు చాలా ఆనందంగా ఉంది. నాలో ఉన్న ఒక్క అనుమానం కూడా తీరిపోయింది" అంటూ అతనిని గట్టిగా పెనవేసుకుంది సవిత.

"ఓయ్... ఏంటా స్పీడు. కీప్ సేఫ్ డిస్టన్స్. పెళ్ళయ్యేవరకూ అదే మంచిది"

"ఛీ... అది నేను చెప్పాల్సిన డైలాగ్"

"తల్లీ... ఇది నా ఇల్లు. పొరపాటున మమ్మీ చూసిందనుకో..."

"అంత భయం ఎందుకు? ఎలాగూ తెలి యాల్సిందేగా"

"నువ్వు మరీ స్పీడ్ అయిపోతున్నావు. తగ్గించు. ఎట్ లీస్ట్ డిగ్రీ పూర్తయిన తరు వాత చెప్పినా ఫరవాలేదు. ఇప్పుడు మాత్రం తెలియకూడదు"

"అవును కరెక్ట్"

"ఇంకేంటి విశేషాలు"

"ఏమున్నాయ్... సింధు, రమేష్‌ల లవ్ స్టోరీ ట్రాజెడీ అవుతున్నందుకు మాత్రం చాలా బాధగా ఉంది"

"ఏమో ఏం చెప్పగలం. అంతా సింధూ డెసిషన్‌మీద ఆధారపడి ఉంది. తను ఒప్పు కుంటే ట్రాజెడీ ఎందుకవుతుంది? "

"ఏమో! నాకు నమ్మకం లేదు. తను తల్లిని, తండ్రిని కాదని బయటకు రాదు. నాకయితే వాళ్ళింట్లో ఒప్పుకుంటారని నమ్మకం లేదు"

"వాళ్ళ సంగతి సరే. ముందు మన ప్రేమ ట్రాజెడీ కాకుండా చూడు"

"ఖచ్చితంగా ట్రాజెడీ అవదు"

"అంత నమ్మకంగా ఎలా చెప్పగలవు? "

"ఈమధ్య మనమీద మమ్మీకి అను మానం వచ్చినట్టుంది. ఆలస్యంగా ఇంటికి వెళితే 'ఏంటీ శ్రీనివాస్‌తో కబుర్లలో ఉండి పోయావా?' అదీ... ఇదీ..." అంటూ నవ్వుతూ

ఇన్‌డైరెక్ట్‌గా డైలాగులు వేస్తోంది. నువ్వంటే ఇంప్రెషన్ లేకపోతే ఎప్పుడో వార్నింగ్ ఇచ్చేది"

"మరేంటనుకొంటున్నావ్ శ్రీనివాస్ అంటే" అన్నాడు కనుబొమ్మలు ఎగరేస్తూ.

"అంతలేదులే గానీ లేటవుతుంది ఇక నే వెళ్తా"

"ఓకే గుడ్ నైట్"

"ఓకే బై" అని సవిత అక్కడినుండి వెళ్ళిపోయింది.

★ ★ ★

ఇంకొక్క అడుగులో వాళ్లు ఆ ఇంటిలోపలికి ప్రవేశిస్తారనగా... ఆ ప్రాంతమంతా వెలుతురునిస్తున్న లైట్ ఆరిపోయింది. ఆ ప్రాంతమంతా దట్టమైన చీకటి తన సామ్రాజ్యాన్ని స్థాపించింది.

ఇక ఆ చీకటిలో తనని గుర్తించటం వాళ్ళవల్లకాదని రమేష్ హాయిగా ఊపిరి పీల్చుకున్నాడు. అంతలోనే వాళ్లు తన కోసం బయట ఎదురుచూస్తూ ఉంటే? అన్న ఆలోచన రాగానే రమేష్‌కి మళ్ళీ భయం మొదలయ్యింది. వాళ్ళ మాటలు గాని, ఎటువంటి శబ్దాలైనా వినిపిస్తాయేమోనని చాలా కేర్‌ఫుల్‌గా ఉన్నాడు. కానీ అతని నిరీక్షణ ఫలించలేదు. బయట నుంచి ఎటువంటి శబ్దమూలేదు.

టైమ్ గడుస్తున్న కొద్దీ అతనిలో టెన్షన్ పెరుగుతోంది. కప్పల అరుపుల శబ్దం, కీచురాళ్ల రొద ఆ చీకటిలో అతని భయాన్ని రెట్టింపు చేస్తున్నాయి.

రమేష్‌లో అసహనం పెరిగిపోయింది. ఇక వెయిట్ చెయ్యలేకపోయాడు. ఎలా అయినా ఇక్కడనుంచి ఇంటికి చేరుకోవాలి అనుకొన్నాడు. అనుకున్న మరుక్షణం ఏమాత్రం ఆలస్యం చేయకుండా వింటి నుంచి వదిలిన బాణంలా ఆ ఇంటిలోనుండి పరుగు ప్రారంభించాడు.

అన్నీ అలవాటైన సందులే కావటంవల్ల అతనికి పరిగెత్తటం పెద్ద కష్టంకాలేదు. బలాన్నంతా కాళ్లలోకి తెచ్చుకొని చాలా వేగంగా పరిగెడుతున్నాడు. సరిగ్గా ఇంటికి చేరుకునేసరికి కరెంటు కూడా వచ్చింది.

అప్పటికే చెమటతో అతని బట్టలన్నీ తడిసిపోయాయి. విపరీతంగా ఆయాసం వచ్చేస్తోంది. అటువంటి పరిస్థితిలో ఇంటిలోకి పరిగెత్తుకువచ్చిన కొడుకుని చూసి కంగారు పడిపోయింది పద్మావతి.

"ఏరా! ఏం జరిగింది" కంగారుగా అన్నయ్యను ప్రశ్నించాడు చైతన్య.

'చెప్తాను ఉండు' అన్నట్టు చేత్తోనే సైగచేశాడు. కొద్దిసేపటికి ఆయాసం తగ్గిన తరువాత జరిగిందంతా వివరంగా చెప్పాడు.

"అందుకే నిన్ను అనవసరమైన గొడవలకి వెళ్ళొద్దంటాను. ఇప్పుడు చూడు ప్రాణం మీదకొచ్చింది" దాదాపు ఏడుస్తున్నట్టుగా అంది పద్మావతి.

"అమ్మా! తిట్టటం కాదు. ఇప్పుడు చేయాల్సిందేంటో ఆలోచించు" వెంటనే అన్నాడు చైతన్య.

"ఇప్పుడు చేయటానికేముంది. వీడు మన ఊర్లో ఉండటం అంత మంచిది కాదు. రమేష్! నువ్వు వెంటనే వైజాగ్‌లో ఉన్న అత్తయ్య వాళ్లింటికి వెళ్లు. కొన్ని రోజులు అక్కడ ఉండి తరువాత వద్దువుగాని" అంది పద్మావతి.

"అమ్మా! ఇంతకుముందు నేనొక్కడినే ఉన్నాను కాబట్టి వాళ్లని ఏమీ చెయ్యలేక పరిగెత్తుకుని వచ్చేశాను. ఇప్పుడు నాకు అండగా తమ్ముడున్నాడు, ఇంకా చుట్టూ మనవాళ్లు చాలామంది ఉన్నారు. వాళ్ళు నన్నేం చెయ్యగలరు? " ప్రశ్నించాడు రమేష్.

"రమేష్! ఈ ఒక్క విషయంలో నామాట విను" అని ఒక బ్యాగ్ తీసి రమేష్ బట్టలు అందులో సర్దటం ప్రారంభించింది.

"అది కాదమ్మా!" అంటూ రమేష్ తల్లికి ఏదోచెప్పబోయాడు.

"ఇక నువ్వేం మాట్లాడొద్దు" అని బ్యాగ్‌ని చైతన్యకి ఇచ్చింది.

చైతన్య రమేష్‌ని బలవంతంగా బయటకు లాక్కొని వెళ్ళాడు. వాళ్లు వెళ్లిన ఐదు నిము





షాల తరువాత రాహుల్ ఇంటిలోనికి వచ్చాడు.

లోపలికి వచ్చి ప్రతీ గదీ వెతకటం ప్రారంభించాడు. వెంటనే పద్మావతికి పరిస్థితి అర్థమయ్యింది.

"బాబూ... ఎవరు నువ్వు? ఏంటి వెతుకుతున్నావు మా ఇంట్లో?" ఏమీ తెలియనట్టు కోపాన్ని ప్రదర్శిస్తూ ప్రశ్నించింది పద్మావతి.

"రమేష్... ఎక్కడ?" సూటిగా ప్రశ్నించాడు రాహుల్.

"ఎవరు నువ్వు? రమేష్‌తో నీకేంటి పని?" ఇంకా కోపంగా గద్దించింది పద్మావతి.

"రమేష్ ఎక్కడున్నాడో చెప్తే నీకే మంచిది. లేకపోతే పెద్దదానివని కూడా చూడకుండా చెయ్యిచేసుకోవలసి వస్తుంది" కోపంగా ఆమెవైపు చూస్తూ అన్నాడు రాహుల్.

"ఏమో? ఎక్కడున్నాడో తెలియదు. ఇందాక బయటకు వెళ్తానని వెళ్లాడు. ఇంకా ఇంటికి రాలేదు" భయపడుతున్నట్టు నటిస్తూ చెప్పింది పద్మావతి.

ఆమె చెప్పింది అబద్ధమేమో అన్న అనుమానం రాలేదు రాహుల్‌కి. మిగిలిన వాళ్లతో కలిసి బయట అరుగుమీద కూర్చున్నాడు.

రాహుల్ అరుగుమీద కూర్చోవటం చూసి పద్మావతి కంగారుపడింది. ఇప్పుడు చైతన్య తిరిగి వస్తే వాణ్ణి ఏం చేస్తారోనని భయం మొదలయ్యింది ఆమెకు. భయంతో ఆమె శరీరం వణకసాగింది.

★ ★ ★

రమేష్‌ని బస్సు ఎక్కించి తిరిగి వస్తున్న చైతన్య తన ఇంటివద్ద ఉన్న రాహుల్‌ని చూడగానే అలర్ట్ అయ్యాడు. చాలా సైలెంట్‌గా చుట్టుపక్కల ఉన్న కుర్రవాళ్లని పదిమందిని పోగుచేశాడు. అందరూ ఒక్కోకర్ర పట్టుకొని చైతన్యవాళ్లింటికి బయలుదేరారు.

గుంపుగా జనం కర్రలు పట్టుకొని రావటం చూసి రాహుల్ తన వాళ్లని హెచ్చరించాడు. తాము నలుగురం వాళ్లని ఎదుర్కోవటం అసాధ్యం. వాళ్ళ చేతికి చిక్కితే ఇక తమ శవాలే మిగులుతాయని భావించి అందరూ కాళ్లకి బుద్ధిచెప్పారు.

చైతన్య వాళ్లను వదిలిపెట్టకుండా ఊరి పొలిమేరలు దాటేవరకూ తరిమిన తరువాత వెనక్కి తిరిగి వచ్చాడు.

★ ★ ★

యశ్వంత్ హాస్పిటల్‌లో బెడ్‌పై పడుకొని ఏదో మ్యాగజైన్ చదువుతున్నాడు. ఇంతలో రాహుల్ వచ్చాడక్కడకి.

"ఏరా వెళ్ళిన పని ఏమయ్యింది?" ప్రశ్నించాడు యశ్వంత్.

రాహుల్ జరిగినదంతా వివరంగా చెప్పాడు.

"నలుగురు కలిసి ఒక్కణ్ణి పట్టుకోలేకపోయారు... ఛీ" కోపంగా అన్నాడు యశ్వంత్.

"రమేష్‌గాడి తమ్ముడు ఊరుజనాన్ని తీసుకొని వచ్చాడు. లేకపోతే అక్కడే వాణ్ణి తన్ని రమేష్ ఎక్కడున్నాడో చెప్పించేవాణ్ణి" ఆవేశంగా అన్నాడు రాహుల్.

"కబుర్లు కాదు. చేసి చూపించాలి"

"ఈరోజు కాలేజ్‌కి వస్తాడు కదా! వాణ్ణి పట్టుకుంటే వాళ్ళ అన్నే మన దగ్గరకు వస్తాడు"

"నువ్వు ఆవేశపడకు నాయనా! చిన్న విషయాన్ని చాలా పెద్దదిగా చేస్తున్నావు. నా ఉద్దేశప్రకారం ప్రస్తుతం రమేష్ వాళ్ళ ఊళ్లో కాకుండా వేరే ఎక్కడయినా ఉండిఉంటాడు. వాడు ఇక్కడకు వచ్చేవరకూ వెయిట్‌చేద్దాం"

"అంటే నెలరోజుల వరకూనా? వాడి తమ్ముణ్ణి నాలుగు తన్నితే వాడు చెప్తాడుగా రమేష్ ఎక్కడున్నదీ"

"వద్దురా! వాడి మీదున్న కోపాన్ని వీడి మీద చూపించినట్టవుతుంది. వదిలేయ్"

"వీళ్లమీద కసి నీకు లేకపోవచ్చు. కానీ నాకు ఉంది. నన్ను కొట్టారు వీళ్లు. ఆ చైతన్య, శ్రీనివాస్, మహేష్ ఈ ముగ్గురునీ కొట్టటానికి ఎప్పటినుంచో ఎదురుచూస్తున్నాను. ఇప్పటికి వచ్చింది అవకాశం. ఇక నేను ఊరుకోలేను"

"సరే... నీ ఇష్టం. కానీ ఒక్క విషయం. అనవసరంగా కాలేజ్‌లో అందరి మధ్యనా కొట్టి గొడవను పెద్దది చేయకు. టైమ్ చూసికొట్టు"

"సరే... ఇక నే వెళ్తాను" అని రాహుల్ బయలుదేరాడు.



శ్రీనివాస్ రిసీవర్ చేతిలోకి తీసుకొని నెంబరు డయల్ చేశాడు.

"హలో..." అటువైపునుంచి వినిపించింది సవిత కంఠం.

"హాయ్ నేను. గుర్తుపట్టావా? " ప్రశ్నించాడు శ్రీనివాస్.

"ఊ... నిన్ను గుర్తుపట్టకుండా ఉంటానా? ఏంటి ఇప్పుడు ఫోన్ చేశావు? కాలేజ్‌లో ఎలాగూ కలుస్తాం కదా! అంత వరకూ ఆగలేకపోతున్నావా? " నవ్వుతూ అంది సవిత.

"ఈరోజు చైతన్య, మహేష్ ఇద్దరూ కాలేజ్‌కి రావటంలేదు. నువ్వు వస్తే నేనూ వస్తాను. లేకపోతే నేనూ కాలేజ్‌కి ఎగనామం పెట్టేద్దామని నిన్ను అడగటానికి ఫోన్ చేశా!"

"నేను వస్తున్నాను కానీ! వాళ్ళిద్దరూ ఎందుకు రావటం లేదు? "

"నీకు అసలు విషయం చెప్పటం మరిచిపోయాను. నిన్న యశ్వంత్‌గాడి గ్యాంగ్ రమేష్‌ని కొట్టటానికి ప్రయత్నించారట. రమేష్ ఎలాగో తప్పించుకున్నాడు. మళ్ళీ ఏ గొడవలు జరుగుతాయోనని రమేష్‌ని వైజాగ్ పంపించేశారు. ఈరోజు చైతన్య, వాళ్ళ మమ్మీకూడా వైజాగ్ వెళుతున్నారు. బహుశా అక్కడ రమేష్‌కి హితబోధలు జరగొచ్చు. రమేష్ ఇక కాలేజ్‌కి కూడా రాడేమో? "

"మరి ఎగ్జామ్స్ దగ్గరకు వచ్చేస్తున్నాయి కదా!"

"ఎలాగూ మనవాడు వన్‌మంత్ అవుట్ ఆఫ్ కాలేజే కదా. తరువాత ఎగ్జామ్స్‌కి ముందు ఇంకో వన్‌మంత్ క్లాసెస్ జరుగుతాయి. అటెండెన్స్ ప్రిన్సిపాల్‌తో మాట్లాడి ఏదో ఒకవిధంగా మేనేజ్ చేసేసి ఎగ్జామ్స్‌కి మాత్రం అటెండ్ అవుతాడట. ఇదంతా చైతన్య ప్లాన్. దీనికి రమేష్ ఒప్పుకోవాలి"

"శ్రీనివాస్ పదినిముషాల్లో నువ్వు మా ఇంటిదగ్గర ఉండాలి" సడన్‌గా అంది సవిత.

"ఏంటి సడన్‌గా? ఎందుకు? "

"చెప్తాను. వెంటనే బయలుదేరు"

"సవిత..." ఏదో అనబోయాడు కానీ అప్పటికే సవిత ఫోన్ పెట్టేసింది. విషయం ఏమయిఉంటుందా అని ఆలోచిస్తూనే సవిత ఇంటికి బయలుదేరాడు శ్రీనివాస్.

పదినిముషాల లోపలే సవితా వాళ్ళింటికి చేరుకున్నాడు. చాలా పెద్ద ఇల్లు అది. రెండు అంతస్థుల బిల్డింగ్. చుట్టూ లాన్. దానిచుట్టూ పది అడుగుల ప్రహారీ. దాని పైన రెండు అడుగుల ఫెన్సింగ్.

లాన్‌లో పెరిగిన రకరకాల మొక్కలతో, వాటికున్న పూలతో ఆ భవనం చాలా అందంగా కనిపిస్తోంది. శ్రీనివాస్ ఆ అందాన్ని ఆస్వాదిస్తూ ఇంటిలోపలికి వెళ్ళాడు.

"హలో... ఆంటీ" అంటూ హాలులో కూర్చొని ఉన్న సవితా వాళ్ళ మదర్‌ని పలు కరించాడు శ్రీనివాస్.

"ఆ... శ్రీనివాస్. రా! రా!. నీకోసం అంకుల్ పై గదిలో వెయిట్‌చేస్తున్నారు" చెప్పింది ఆవిడ.

'అంకుల్ తనకోసం వెయిట్‌చేస్తున్నా రంటే... కొంపదీసి... సవిత గానీ ఆయ నకు ప్రేమ విషయం గురించి చెప్పే సిందా? ' అని ఆలోచిస్తూ పైకి వెళ్లాడు.

"హలో...అంకుల్" కుర్చీలో కూర్చొని తన కూతురితో మాట్లాడుతున్న విజయప్ర కాష్‌ని విష్ చేశాడు శ్రీనివాస్.

విజయ్‌ప్రకాష్ మిడిల్‌క్లాస్ ఫ్యామిలీ నుంచి నిజాయితీగా కష్టపడి కోటీశ్వరుడిస్థా యికి చేరుకున్నాడు. నిగర్వి. కష్టానికి తగిన ప్రతిఫలం ఇవ్వాలని ఆరాటపడే వ్యక్తి. అందుకే అతని ఫ్యాక్టరీలో వర్కర్స్‌ని సైతం కుటుంబసభ్యులలా ఆదరిస్తాడు.

"హాయ్...శ్రీనివాస్. రా! కూర్చో" అంటూ తనకెదురుగా ఉన్న కుర్చీ చూపిం చాడు విజయ్‌ప్రకాష్.

"థాంక్యూ... అంకుల్"

"ఇప్పుడు చెప్పు...ఏంటి అసలు విషయం? "

ఆయన అలా అడగగానే శ్రీనివాస్‌కి టెన్షన్ మొదలైపోయింది. సవిత తమ ప్రేమగురించి చెప్పేసిందనే నిర్ణయానికి వచ్చేశాడు.

"ఏ విషయం అంకుల్? " కాస్త కంగా రుగా అన్నాడు శ్రీనివాస్.

"అదే... యశ్వంత్, ఎవరు... ఆ... రమేష్... వాళ్లిద్దరిమధ్య గొడవ ఏమిటి? "

ఆ మాట వినగానే శ్రీనివాస్ టెన్షన్ మొత్తం ఎగిరిపోయింది. రమేష్, యశ్వం త్‌ల మధ్య జరిగిన అన్ని విషయాల్నీ వివ రించాడు శ్రీనివాస్.

"ఓ.కే. శ్రీనివాస్. నాకు పరిస్థితి అర్థం అయ్యింది" అని రెండు నిముషాలు ఆగి మళ్ళీ చెప్పటం ప్రారంభించాడు విజయ్‌ప్ర కాష్.

"ఒకప్పుడు యశ్వంత్ ఫాదర్ రాజేంద్ర, నేను బిజినెస్ పార్టనర్స్. దాదాపు ఎనిమిది సంవత్సరాలు ఇద్దరం కలిసి బిజినెస్ చేశాం. తరువాత వాడు రాజకీయాల్లోకి వెళ్లాడు. అప్పటినుంచి బిజినెస్ గురించి పట్టించుకొనేవాడు కాదు. అప్పుడు నేను వాడి షేర్స్ కూడా కొనేశాను. తరువాత వాడే స్వంతంగా వ్యాపారం ప్రారంభిం చాడు. డబ్బు బాగా సంపాదించాడు. డబ్బుతోపాటే వాడిలో అహం కూడా పెరి గింది. నేనూ వాడూ విడిపోయేసరికి యశ్వంత్ ఇంటర్ చదువుతున్నాడు. వాడితో నా బిజినెస్ బ్రేక్ అయిన తరు వాత కూడా యశ్వంత్ నన్ను తరచుగా కలిసేవాడు. ఈ విషయాలేవీ సవితకు తెలి యదు. తను వాళ్ల అమ్మమ్మగారి ఇంటిద గ్గర ఉండి చదువుకొనేది.

ఒక విషయం మాత్రం ఖచ్చితంగా చెప్ప గలను. యశ్వంత్ తండ్రి అంత మూర్ఖుడు మాత్రం కాదు. కాకపోతే కాస్త అహం, పట్టుదల ఎక్కువ. నేను చెప్తే వాడు నామాట వింటాడు. ఇకమీదట గొడవలు వద్దని నేను చెప్తాను. మీ జోలికయితే ఖచ్చి తంగా రాడు. ఇక రమేష్ గురించి నేను గ్యారంటీ ఇవ్వలేను. కానీ ఎప్పుడయినా అవసరం అనిపిస్తే మాత్రం నాకు ఫోన్ చెయ్యి"

"ఓకే... అంకుల్"

"సరే... అయితే... నాకు పనుంది. నే వెళ్తాను" అని విజయప్రకాష్ బయటకు వెళ్ళిపోయాడు.

"అమ్మో! మీ డాడీ 'అసలు... విషయం

ఏంటి' అని అడగ్గానే ఎంత టెన్షన్‌పడ్డానో తెలుసా?" సవితవైపు చూస్తూ అన్నాడు శ్రీనివాస్.

"ఎందుకు?" శ్రీనివాస్ కుర్చీ వెనక్కి వచ్చి అతని మెడచుట్టూ చేతులు వేస్తూ అడిగింది సింధు.

"మన ప్రేమవిషయం చెప్పేశావేమోనని భయపడ్డాను" ఆమె చేతులపై తన చేతులు వేస్తూ అన్నాడు శ్రీనివాస్.

"ఆ విషయం నేనెందుకు చెప్తాను? నువ్వే వచ్చి మా డాడీకి చెప్పాలి?"

"ఇలాంటి కండిషన్స్ ఏవీ నువ్వు నా దగ్గర పెట్టకు. మీ ఇంట్లో నువ్వు చెప్పు. మా ఇంట్లో నేను చెప్తాను. తరువాత వాళ్లే చూసుకుంటారు"

"అదేం కుదరదు. మీ ఇంట్లో వాళ్లతో చెప్పి వాళ్లను తీసుకొని వచ్చి మా డాడీని అడిగించే బాధ్యత నీదే"

"సరేలే... ఆ టైమ్ రానీ. ఏదో ఒకటి చూద్దాం"

"మరయితే మన ప్రోగ్రాం ఏమిటి?"

"కాలేజ్‌కి వెళ్లటం"

"కాలేజ్‌కి ఏం వెళ్తాంగాని. నువ్వు మీ ఇంటి దగ్గరే ఉండు. మమ్మీ ఆంటీని కలవా లంటోంది. నేను మమ్మీని తీసుకొని మీ ఇంటికి వస్తాను. అక్కడ నుంచి మనమిద్దరం ఎక్కడికయినా వెళ్దాం సరేనా"

"సరే" అని శ్రీనివాస్ అక్కడనుండి బయ లుదేరాడు.

★ ★ ★

నెలరోజుల తరువాత...

సమయం అర్ధరాత్రి పన్నెండు గంటల య్యింది. ఆ టైమ్‌లో శ్రీనివాస్ ఇంట్లో ఫోన్ రింగ్ అయ్యింది. అప్పటికే గాఢని ద్రలో ఉన్న శ్రీనివాస్ ఫోన్ చాలా సమయం పాటు రింగ్ అయిన తరువాత గానీ లిఫ్ట్ చెయ్యలేదు.

"హలో..." అన్నాడు మత్తుగా.

"మెనీ హ్యాపీ రిటర్న్స్ ఆఫ్ ది డే" అటు వైపునుంచి వినిపించింది.

"థాంక్యూ... సవితా"

"చాలా డీప్ స్లీప్‌లో ఉన్నట్టున్నావు"

"అవును. నీకు ఈ టైమ్‌లో కరెక్టుగా ఎలా మెలకువ వచ్చింది? అలారం పెట్టు కున్నావా?"

"నిద్రపోతే కదా...మెలకువ రావటానికి"

"ఎందుకు సవితా నిద్రపాడుచేసుకో వటం. ఉదయాన్నే చెప్పొచ్చు కదా!"

"అందులో ఉన్న ఆనందం నీకేం తెలుసు. నువ్వెప్పుడయినా నాకు చేస్తే కదా!"

"మా ఇంట్లో అంటే ఫోన్ నా రూమ్‌లో ఉంటుంది. మీ ఇంటికి చేస్తే మీ మమ్మీ లిఫ్ట్‌చేస్తారు. బాగోదు కదా!"

"నైట్ టైమ్ ఫోన్ వస్తే నిద్రపాడవుతుం దని ఫోన్ నా రూమ్‌లో పెట్టనివ్వను. ఈ విషయాలన్నీ ఎందుకులే. ఏదయినా చెప్పు"

"చెప్పటానికేం ఉన్నాయ్. ఆ... సెవెన్ అయ్యేసరికి నువ్వు మా ఇంటిదగ్గర ఉండాలి. గుర్తుందా?"

"అదేంటి? పార్టీకి అందరినీ నైన్‌కి రమ్మని చెప్పావు కదా!"

"అందరికీ... నీకు కాదుగా"

"లేదు... నేను కూడా అప్పుడే వస్తాను. లేకపోతే రేపట్నించి మనవాళ్లు నన్ను దారు ణంగా ఏడిపిస్తారు"

"సరే... నీ ఇష్టం"

"మరయితే ఉంటాను. పార్టీలో కలుద్దాం"

"ఓ. కె. బై"

"బై" అంది సవిత.

శ్రీనివాస్ ఫోన్ క్రెడిల్ చేశాడు. వెంటనే మళ్ళీ ఫోన్ రింగ్ అయ్యింది.

"హలో..." అన్నాడు శ్రీనివాస్.

"హ్యాపీ బర్త్‌డే శ్రీనివాస్... నేను సింధుని"

"థాంక్యూ"

"ముందు ఫోన్ ఎంగేజ్ వచ్చింది. సవి తతో మాట్లాడుతున్నావా?"





"బాగా గెస్ చేశావే"

"ఆ మాత్రం గెస్ చెయ్యలేనా? శ్రీనివాస్ నేను నీతో ఒక విషయం చెప్పాలి"

"చెప్పు సింధూ"

"పుట్టినరోజు నాడే ఉదయాన్నే తల తినేస్తున్నానని అనుకోవద్దు. ఈ విషయం నీకు కాలేజ్‌లో చెబుదామంటే చైతన్య ఉంటున్నాడు. ఇంటిదగ్గర నుంచి ఫోన్ చేద్దామంటే ఇంట్లో వాళ్లు వింటారేమోనని భయం. ఈ విషయం ఎలాగయినా ఇంట్లో చెప్పాల్సిందే. కానీ నీకు చెప్పిన తరువాత వాళ్లకి చెబుదామని"

"ఇప్పుడు... ఇంట్లో ఎవ్వరూ లేరా? "

"ఉన్నారు. అంతా మంచి నిద్రలో పక్క రూమ్‌లో ఉన్నారు. ఒకవేళ సడన్‌గా లేచినా ఈరోజు నీ పుట్టినరోజని చేశానని తప్పించుకోవచ్చు కదా!"

"ఇంతకీ విషయం ఏమిటి? "

"రమేష్ విషయంలో నేనో నిర్ణయానికి వచ్చాను. అది తప్పో, ఒప్పో అర్థంకావటం లేదు. నువ్వయితే కరెక్టుగా చెబుతావని ముందు నీకు చెపుతున్నాను"

"ఏంటా నిర్ణయం? "

సింధు తన ఇంటి వాతావరణం గురించి, చనిపోతూ తన నాన్నమ్మ అన్న మాటల గురించి వివరంగా చెప్పింది.

"మా ఇంటి పరిస్థితులు నీకు చాలావరకూ తెలుసు. అయినా మళ్ళీ ఎందుకు చెప్పానంటే రమేష్ విషయంలో నేను ఒక నిర్ణయానికి రావటానికి ఈ పరిస్థితులు కూడా ఒక కారణం"

"నువ్వు పరిస్థితుల్ని ఎనలైజ్ చేసుకొని ఏ నిర్ణయం తీసుకున్నా ఖచ్చితంగా అది మంచిదే అవుతుంది. నీ డెసిషన్ ఏంటో చెప్పు" అన్నాడు శ్రీనివాస్.

"నువ్వు చెప్పిన దగ్గర్నుంచీ రమేష్‌ని చాలా క్లోజ్‌గా అబ్జర్వ్‌చేశాను. ఆ రోజు నుంచి ఈరోజువరకూ ప్రతీ విషయంలోనూ తనెలా బిహేవ్ చేస్తున్నాడు, నేనయితే ఎలా బిహేవ్ చేస్తాను అనేది ఎనలైజ్ చేసుకున్నాను. నువ్వు చెప్పింది నిజమేననిపించింది. నేను రమేష్‌తో అడ్జస్ట్ కావటం కష్టమేమోననిపించింది. ప్రేమించే ముందు ఇవన్నీ ఆలోచించనందుకు ఇప్పుడు బాధపడుతున్నాను. అలా అని రమేష్‌ని మరచిపోలేను. నువ్వు చెప్పినట్టు నాలోని ఆ సాఫ్ట్ కార్నరే అతని నుంచి నేను దూరంకాకుండా చేస్తోంది.

అందుకే ఒక నిర్ణయానికి వచ్చాను. రమేష్ గురించి ఇంట్లో చెపుతాను. అమ్మ, నాన్న ఒప్పుకుంటే రమేష్‌ని పెళ్ళిచేసుకోవటానికి రెడీ. తరువాత పరిస్థితులు ఎలాంటివయినా ఫేస్ చేస్తాను. అదే ఇంట్లో వాళ్లు కనుక ఒప్పుకోకపోతే తన విషయంలో నాలో ఉన్న సాఫ్ట్ కార్నర్‌ని చంపుకొని రమేష్‌కి 'నో' చెప్పేస్తాను. ఈ విషయం మొదటే రమేష్‌కి చెపుదామనుకొన్నాను. కానీ ఎందుకో నాన్నను అడిగిన తర్వాత చెప్తేనే మంచిదనిపిస్తోంది. నువ్వేమంటావు? నా నిర్ణయం తప్పంటావా? "

"నీ నిర్ణయం హండ్రెడ్ పర్సెంట్ కరెక్ట్. మీ నాన్నగారు ఒప్పుకోకపోతే ఈ విషయంలో రమేష్‌ని కన్విన్స్ చేసే బాధ్యత నీదే. ఎందుకంటే రమేష్ ఎలా రియాక్ట్ అవుతాడో చెప్పలేం. నువ్వు మాత్రమే రమేష్‌కి నచ్చజెప్పగలవు. ఎందుకంటే రమేష్ వింటే నీ మాటే వినాలి. నీ మాట వినకపోతే ఇక ఎవ్వరిమాటా వినడు"

"ముందు నాన్నకు చెప్పి, ఆయన ఒప్పుకోకపోతే అప్పుడు ఈ విషయం గురించి ఆలోచిస్తాను. ఇప్పుడు ఈ విషయం నాన్నకు చెప్పాలంటే టెన్షన్ వచ్చేస్తోంది. ఇక ఆ విషయం కూడా ఆలోచిస్తే నా బ్రెయిన్ ఏమాత్రం పనిచేయదు"

"ఓ.కే. విషయం ఏదయినా సరే ఆల్ ద బెస్ట్"

"థాంక్యూ!"

"ఈరోజు పార్టీకి వస్తున్నావు కదా? "



"ఆ... వస్తున్నాను"

"మీ నాన్నగారికి ఎప్పుడు చెప్తావు మరి? "

"టైమ్ రావాలి. నా అంతట నేనుగా చెప్పటం కష్టం"

"సరే అయితే. త్వరగా వచ్చేయ్"

"ఓ. కే. ఉంటాను బై"

"బై" అని ఫోన్ డిస్కనెక్ట్ చేసి మరలా నిద్రకుపక్రమించాడు.

★ ★ ★

శ్రీనివాస్‌కి ఒక్కొక్కరూ వచ్చి విషెస్ చెపుతున్నారు. పార్టీకి కేవలం అతని క్లోజ్ ఫ్రెండ్స్‌ని మాత్రమే పిలవటంవల్ల పార్టీకి వచ్చిన వాళ్ళ సంఖ్య తక్కువగానే ఉంది.

అప్పటికే చైతన్య, మహేష్, భాను, సింధు అక్కడకు వచ్చారు. శ్రీనివాస్ వాళ్లతో మాట్లాడుతున్నాడే కానీ అతని మనసంతా సవిత కోసమే ఎదురుచూస్తోంది. కాస్త అసహనంగా వాచ్ చూశాడు. టైమ్ తొమ్మిది గంటల ముప్పైనిముషాలు అవుతోంది. పదేపదే గుమ్మంవైపు చూస్తున్నాడు.

అతని టెన్షన్ అక్కడ అందరికీ అర్థమయ్యింది.

"మరీ అంత టెన్షన్ పడిపోకు... వస్తుందిలే" నవ్వుతూ అంది భాను.

"నాకెందుకు టెన్షన్. నేనెవరికోసం వెయిట్ చెయ్యటంలేదు" అంటూనే మరొకసారి గుమ్మంవైపు చూశాడు.

"ఛ... అన్ని విషయాలూ తెలిసిన మాదగ్గర కవరింగ్‌లు ఎందుకు? " అంది భాను.

ప్రతిగా చిన్న నవ్వు నవ్వి ఊరుకున్నాడు శ్రీనివాస్.

అప్పుడే సవిత లోపలికి ప్రవేశించింది. శ్రీనివాస్‌తోపాటు మిగిలిన వాళ్లు కూడా అటువైపు చూశారు.

సవిత గ్రీన్ కలర్ శారీలో, వాలుజడతో నడిచి వస్తుంటే శ్రీనివాస్ మాత్రమే కాదు అందరూ అలానే చూస్తూ ఉండిపోయారు. ఎప్పుడూ మోడరన్ డ్రస్సుల్లో ఉండే ఆమెని ట్రెడిషనల్‌గా చూసేసరికి అందరిలోనూ ఆశ్చర్యం చోటుచేసుకుంది.

శ్రీనివాస్ అయితే కనురెప్పకూడా వేయటం మరిచిపోయి ఆమెనే చూస్తున్నాడు. అతని మనసు ఆమె అందానికి దాసోహమయ్యింది. అతనిలోని కవి హృదయం మేలుకొంది.

"నా హృదయపు తొలి భావం,
నా మదిలో తొలి కావ్యం,
నా మనసున తొలి గీతం,
నా ప్రేయసి ప్రతిరూపం"

అతని మనసులో విరిసిన కవితా కుసుమం పెదవులద్వారా బయటకు వచ్చేసింది.

"శ్రీనివాస్...కవిత చాలా బావుంది" అంది సింధు.

కానీ శ్రీనివాస్‌నుంచి ఎటువంటి రెస్పాన్స్ లేదు. ఇంకా సవితను చూస్తూనే ఉన్నాడు.

సవిత శ్రీనివాస్‌ని సమీపించింది.

"మెనీ హ్యాపీ రిటర్న్స్ ఆఫ్ ది డే" అంటూ విష్ చేసింది సవిత.

"థాంక్యూ థాంక్యూ" అప్పుడే ఈ లోకంలోకి వస్తూ కాస్త కంగారుగా అన్నాడు శ్రీనివాస్.

"స్మాల్ గిఫ్ట్ ఫర్ యు" అని అగ్గిపెట్టె సైజ్‌లో ఉన్న ఒక చిన్న గిఫ్ట్ ప్యాక్ ఇచ్చింది. శ్రీనివాస్ ప్యాక్‌ని ఓపెన్ చేసి ఆశ్చర్యపోయాడు. ఆ ప్యాక్‌లో ఓ డైమండ్ రింగ్ చాలా అందంగా ఉంది.

"నేను పార్టీకి పెట్టిన ఖర్చు ఈ రింగ్ కాస్ట్‌లో టెన్ పర్సెంట్ కూడా ఉండదేమో" ఆశ్చర్యంతో అన్నాడు శ్రీనివాస్.

"కాస్ట్ కాదు. ఇచ్చిన హార్ట్‌ని చూడు" కాస్త సెంటిమెంటల్‌గా అంది సవిత.

"ఓహో" ఒకేసారి కోరస్‌గా అన్నారంతా.

"ఇంతకీ పుట్టినరోజు శ్రీనివాస్‌దా! నీదా? ఎప్పుడూ లేనిది చీర కట్టావ్, జడ వేశావ్ ఏంటి విశేషం? " ప్రశ్నించింది భాను.

"ఇద్దరం ఒకటే అయినప్పుడు ఎవరి పుట్టి





నరోజు అయితే ఏం" వేధాంత ధోరణిలో అంది సవిత.

"అయ్యబాబోయ్! ఏంటి తల్లీ పొద్దున్నే తెలుగు సినిమా గానీ చూసొచ్చావా? " వెంటనే అన్నాడు మహేష్.

తరువాత అందరి సమక్షంలో శ్రీనివాస్ కేక్ కట్ చేశాడు. అందరూ కబుర్లలో పడ్డారు.

"మీ వాడు మళ్లీ కాలేజ్‌కి వచ్చే ప్రయత్నాలేమయినా చేస్తున్నాడా? " చైతన్యను ప్రశ్నించాడు శ్రీనివాస్.

"నేను రావద్దని చెప్పాను. వాడు ఎంతవరకూ ఆగుతాడో చెప్పలేం. ఈ నెల రోజులూ చాలా ప్రశాంతంగా ఉంది"

"ఈ నెల రోజులూ ప్రశాంతంగా ఉండటానికి సవిత కూడా ఒక కారణం" అని జరిగినదంతా వివరంగా చెప్పాడు శ్రీనివాస్.

"సవితా... థాంక్యూ" అన్నాడు చైతన్య.

"ఏయ్ దీనికి థాంక్స్ ఎందుకు? "

"సవితా! మీ మమ్మీడాడీ వస్తున్నారు" అన్నాడు మహేష్.

"మమ్మీడాడీనా" అంటూ ఆశ్చర్యంగా గుమ్మంవైపు చూసింది.

లోపలకు వస్తున్న వాళ్లని చూసి కొద్దిగా షాక్ అయింది. 'ఎప్పుడూ ఎక్కడికీ రాని డాడీ ఇలా పార్టీకి వచ్చేశారేంటి? ' అనుకుంది.

"మమ్మీడాడీని కూడా పార్టీకి రమ్మన్నావా? " శ్రీనివాస్‌ని ప్రశ్నించింది సవిత.

"లేదు, నేను మన ఫ్రెండ్స్‌ని తప్ప ఎవ్వరినీ పిలవలేదు? " చెప్పాడు శ్రీనివాస్.

"నీ బర్త్‌డేకి గెస్ట్స్‌ని మేము పిలవకూడదా? " వెనుక నుంచి అన్నాడు శ్రీనివాస్ తండ్రి మోహనరావు.

తరువాత మోహన్‌రావు, పుష్ప వెళ్లి వాళ్లను సాదరంగా ఆహ్వానించారు. విజయ్‌ప్రకాష్ శ్రీనివాస్‌ని విష్ చేసిన తరువాత ఫ్రెండ్స్ అందరినీ దగ్గరగా పిలిచాడు.

"ఈ రోజు శ్రీనివాస్‌కి ఒక గుడ్ న్యూస్ చెప్పబోతున్నాను. సవిత, శ్రీనివాస్‌ల ప్రేమకు మా రెండు కుటుంబాలూ గ్రీన్ సిగ్నల్ ఇస్తున్నాము" ఆయన మాటలు పూర్తవగానే హాలంతా చప్పట్లతో మారుమోగింది.

సవిత, శ్రీనివాస్‌లకి మాత్రం ఇంకా జరిగింది కలో, నిజమో అర్థం కావటంలేదు.

"ఏంటి? మీ ఇద్దరూ అలా ఉండిపోయారేంటి? ఓ మీ ప్రేమ విషయం మాకెలా తెలిసిందనా? " ప్రశ్నించాడు మోహనరావు.

అవునన్నట్టు తల ఊపాడు శ్రీనివాస్.

"మేము మీకంటే పాతిక సంవత్సరాలు ముందు పుట్టాం. మీ గురించి మాకు తెలియదా? "

"ఓకే మీరు ఎంజాయ్ చేయండి" అని వెళ్లిపోబోయి మళ్లీ వెనక్కి తిరిగాడు విజయ్‌ప్రకాష్.

"శ్రీనివాస్ ముందు చదువు. తరువాతే ప్రేమ, పెళ్లి. నా కూతురిని చేసుకుంటే నీ మీద చాలా భారం పడుతుంది. నువ్వు ఆ భారాన్ని మోయటానికి కష్టపడాలి. బీ రడీ"

"ఓకే అంకుల్. అయామ్ ఆల్వేస్ రడీ"

"దట్స్ గుడ్" అని పెద్దవాళ్లు నలుగురూ వెళ్లిపోయారు.

ఫ్రెండ్సంతా ఇద్దరికీ కంగ్రాట్స్ చెప్పారు.

★ ★ ★

సింధు ఇంటికి వచ్చేసరికి హాల్‌లో తల్లీ తండ్రి, పిన్నిబాబాయ్, వాళ్ల పిల్లలు, ఇంకా కొందరు గుంపుగా కూర్చొని ఉన్నారు. వాళ్లందరినీ చూడగానే సింధు మనసు ఏదో కీడును శంకించింది. వాళ్లందరి సమావేశం బహుశా తన పెళ్లి గురించే కావచ్చేమో అని అనుమానం కలిగిందామెకు. అలా ఆలోచిస్తూనే లోపలకు వెళ్లింది.

"రా సింధూ! నీ కోసమే ఎదురు చూస్తున్నాం. ఏంటింత లేటయ్యింది? " ప్రశ్నించింది తల్లి పార్వతి.



"బస్సు లేటయ్యింది" ముక్తసరిగా సమాధానం చెప్పింది సింధు.

"కూర్చో నీకు ఒక విషయం చెప్పాలి"

"ఏంటమ్మా?" కూర్చోవటానికి ఏమాత్రం ప్రయత్నించకుండా ప్రశ్నించింది సింధు.

"పెదబావకు పెళ్లి కుదిరింది. ఈ పదిహేనో తారీఖున తాంబూలాలు పుచ్చుకొంటున్నారు. అదే రోజున నీ పెళ్లికి కూడా ముహూర్తాలు పెట్టించేద్దామని అత్తయ్య కబురు చేసింది. నీ పెళ్లి త్వరగా జరిగితే నాన్నమ్మ ఆత్మకు శాంతి కలుగుతుంది. కాబట్టి మరో రెండు రోజుల్లో అత్తయ్య వాళ్లు మన ఇంటికి వస్తారు" చెప్పింది పార్వతి.

ఆ విషయం వినగానే సింధుకి నీరసం వచ్చేసింది. తను ఏదయితే జరగకూడదని అనుకుందో అదే జరిగింది. ఇక ఆలస్యం చేయకూడదు. ఎలాగయినా నాన్నకు రమేష్ గురించి చెప్పాలి. ఆలస్యం చేస్తే ఉన్న చిన్న అవకాశం కూడా చేజారిపోతుంది అనుకుంది.

ఈ విషయం అందరి మధ్యలో ఉండగా నాన్నకు చెప్పటం మంచిది కాదనుకొని తల్లికి ఏం సమాధానం చెప్పకుండానే లోపలకు వెళ్లిపోయింది.

గదిలోనికి వెళ్లి మంచంపై పడుకొని ఆలోచనలో పడింది. ఆమె హృదయమంతా భారమైపోయింది. రమేష్‌ని మరచిపోదామని ఎంత అనుకున్నా ఆమె వల్ల కావటం లేదు. అందుకే ఈ పెళ్లికి నాన్న ఒప్పుకునేలా చెయ్యమని మనసులో దేవుడిని ప్రార్థించుకొంది.

కొద్దిసేపటి తరువాత సింధు దగ్గరకు వచ్చాడు సత్యన్నారాయణ.

తండ్రిని చూడగానే సింధు కాస్త కంగారు పడి అంతలోనే నవ్వటానికి ప్రయత్నించింది. కానీ ఆమె కళ్లలోని నీటిపొరని మాత్రం తండ్రికి కనిపించకుండా దాచలేకపోయింది.

"ఏంటి సింధు, అలా ఏం సమాధానం చెప్పకుండా వచ్చేశావేం? ఏం జరిగింది? ఈ పెళ్లి నీకు ఇష్టంలేదా?" ప్రశ్నించాడు సత్యనారాయణ.

ఇష్టం లేదని చెప్పాలని ఉంది కానీ ఏదో తెలియని భయం ఆమె మాటలకు అడ్డుపడుతోంది.

"నాన్నా నేను... నేను మీకు ఒక విషయం చెప్పాలి" వణుకుతున్న స్వరంతో చాలా నెమ్మదిగా అంది సింధు.

"ఏంటమ్మా? ఏ విషయమయినా భయపడకుండా చెప్పు" చాలా కూల్‌గా అన్నాడు సత్యనారాయణ.

తండ్రి మాట్లాడిన తీరుకు ఆమెకు కాస్త ధైర్యం వచ్చింది.

"నాన్నా నేను రమేష్‌ని ఇష్టపడుతున్నాను. మీరు ఒప్పుకుంటే అతన్ని పెళ్లి చేసుకోవాలనుకొంటున్నాను" తండ్రి మొహంలోకి చూసే ధైర్యం లేక నేల చూపులు చూస్తూ చెప్పింది సింధు.

"రమేష్ అంటే వరప్రసాద్ కొడుకా?" చాలా నార్మల్‌గా ప్రశ్నించాడు సత్యనారాయణ.

"అవును నాన్నా"

"అయితే నువ్వు అతనిని మరిచిపోవటమే మంచిది సింధూ. నాకు అతని మీద కానీ ఆ కుటుంబం మీద కానీ మంచి అభిప్రాయం లేదు. ఆ కుర్రాడు చాలా పొగరుగా ఉంటాడు. అటువంటి వాడితో నువ్వు సుఖంగా ఉండలేవు. ఇదంతా నువ్వు మేం చెపుతున్న పెళ్లి చేసుకోవటం లేదని చెపుతున్న వంకలు అనుకోవద్దు. ఒక తండ్రిగా నా కూతురి సుఖం కోరి చెపుతున్నాను"

సింధుకి ఏం మాట్లాడాలో అర్థం కాలేదు. తల వంచుకొని మౌనంగా ఉండిపోయింది.

"చూడు సింధూ! నువ్వు బావనే పెళ్లి చేసుకోవాలని నేనెప్పుడూ అనలేదు. నువ్వు ఎవర్ని ఇష్టపడినా వాడు బావకంటే ఉత్తముడనుకుంటే ఖచ్చితంగా అతన్నిచ్చే నీకు

పెళ్లి చేసేవాణ్ణి. కానీ ఇప్పుడు నేను తెచ్చిన సంబంధమే మంచిదని నేను అనుకుంటు న్నాను. నేను చెప్పాల్సినదంతా చెప్పాను. ఇప్పుడు నిర్ణయం తీసుకోవాల్సింది నువ్వే. నువ్వు రమేష్‌నే పెళ్లి చేసుకుంటానంటే నేను ఏమాత్రం అడ్డుచెప్పను. నువ్వు నిర్భయంగా వెళ్లి అతనిని పెళ్లి చేసుకోవచ్చు కానీ ఆ రోజు నుంచే ఈ ఇంటితో నీ సంబంధాలు పూర్తిగా తెగిపోతాయి. నువ్వు చిన్న పిల్లవేం కాదు. బాగా ఆలోచించి ఓ నిర్ణయం తీసుకో. ఏ నిర్ణయం తీసుకున్నా నీ తల్లితం డ్రుల గురించి ఒక్కసారి ఆలోచించు" అని చెప్పి ఆయన బయటకు వెళ్లిపోయాడు.

సింధు మళ్లీ ఆలోచనలో పడింది.

ఇప్పుడు తనకున్న మార్గాలు రెండు. ఒకటి ఇంట్లో వాళ్లని వదిలి వెళ్లి రమేష్‌ని ఆనందింపచేయటం. రెండవది రమేష్‌ని వదిలిపెట్టి ఇంట్లో వాళ్లందరినీ ఆనందపె ట్టటం. రెండు సందర్భాలలోనూ తను మాత్రం బాధపడాలి. ఇప్పుడు ఏం చెయ్యాలి? ఎవరిని వదులుకోవాలి? ముందు నిర్ణయించుకున్న ప్రకారం అయితే రమేష్‌ని వదులుకోవాలి. కానీ అది ఆలో చించినంత తేలికగా కనిపించటం లేదు. అలా కాదనుకుంటే తన వాళ్లను వదులుకో వాలి. తల్లికీ తండ్రికీ దూరంగా ఉండటం తన వల్ల కాదు. "ఓ భగవంతుడా! నువ్వే నాకు ఏదో ఒక మార్గం చూపించు" అని భగవంతుణ్ణి ప్రార్థించి మంచంపై కళ్లు మూసుకొని పడుకొంది.

చాలా సమయం ఆలోచించిన తరువాత ఒక నిర్ణయానికి వచ్చి స్థిరపడింది.

★ ★ ★

శ్రీనివాస్, సింధు, భాను, చైతన్య, మహేష్ క్యాంటీన్‌లో కూర్చొని ఉన్నారు. క్లాసెస్ ప్రారంభం కావటానికి ఇంకా పది హేను నిముషాల సమయం ఉండటంతో అంతా కబుర్లలో పడ్డారు.

వాళ్లకి కొద్ది దూరంలో కుంటుకుంటూ నడుస్తూ యశ్వంత్ కాలేజ్‌లోనికి వెళ్లాడు.

"వీడేంటి కాలు సెట్ అవకుండానే కాలే జ్‌కి వచ్చేశాడు. అంత ఇంట్రస్టా చదు వంటే" కాస్త వ్యంగ్యంగా అన్నాడు చైతన్య.

"చదువు మీద ఇంట్రస్టు కాదు. ఈ నెల రోజులూ బెడ్‌పై పడుకొని చిరాకు వచ్చుం టుంది గురుడికి" అన్నాడు మహేష్.

వీళ్లలా మాట్లాడుకుంటుండగా వాళ్ల దగ్గ రకు వచ్చాడు రమేష్.

"హాయ్" అంటూ అందరినీ పలుకరిం చాడు.

రమేష్‌ని చూడగానే అందరూ ఆశ్చర్యపో యారు. చైతన్యకయితే కోపం వచ్చేసింది.

"నువ్వేంటి ఇలా వచ్చేశావు? మళ్లీ గొడ వలు మొదలవుతాయి. అయినా ఇంటికి ఎప్పుడు వచ్చావు నువ్వు? " అనుమానంగా ప్రశ్నించాడు చైతన్య.

"ఇంటికి వెళ్లలేదు. మీ అందరినీ ఒక సారి చూద్దామని వైజాగ్ నుంచి డైరక్ట్‌గా ఇక్కడకే వచ్చాను"

"చూశావుగా! ఇక ఇంటికి వెళ్లు" కోపంగా అన్నాడు చైతన్య.

"నాకంటే నువ్వు ఎక్కువ భయపడుతు న్నావెందుకు? "

"నీకు ఏమాత్రం భయం ఉన్నా పరిస్థితి ఇంతవరకూ వచ్చేది కాదు"

"భయపడాల్సిన అవసరం నాకేంటి? నేను తప్పు చేస్తే భయపడాలి"

రమేష్‌తో వాదించి లాభంలేదని చైతన్య సైలెంట్‌గా ఉండిపోయాడు.

"రమేష్, నేను నీతో కొద్దిగా పర్సనల్‌గా మాట్లాడాలి" అంది సింధు.

ఆ మాట విని మిగిలిన వాళ్లంతా అక్క డనుంచి వెళ్లిపోయారు. రమేష్ సింధుకి ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చున్నాడు.

"చెప్పు... ఏంటి విశేషాలు? " కనురె ప్పలు ఎగరేస్తూ ప్రశ్నించాడు రమేష్.

"మా పెదబావకు మ్యారేజ్ ఫిక్స్ అయి పోయింది"



"వెరీగుడ్, అయితే ఇప్పుడు ఇబ్బంది ఏంటి"

"తరువాత నా పెళ్లే మిగిలింది. పది హేనో తారీఖున నా పెళ్లికి ముహూర్తాలు పెట్టించటానికి అత్తయ్య మా ఇంటికి వస్తోంది"

"మరి మీ నాన్నగారికి మన గురించి చెప్పలేదా? "

"చెప్పాను"

"ఏమన్నారు. ఒప్పుకున్నారా? " కాస్త ఆత్రంగా ప్రశ్నించాడు రమేష్.

"లేదు నువ్వు కావాలనుకుంటే ఇల్లు వదిలి వెళ్లిపోమన్నారు" బాధగా చెప్పింది సింధు.

"మరి నువ్వేం చెప్పావ్? " సీరియస్‌గా ప్రశ్నించాడు రమేష్.

"లేదు రమేష్... అమ్మానాన్నను వదిలి నేనుండలేను. అందుకే ఏం మాట్లాడకుండా ఉండిపోయాను"

"అంటే నేను లేకుండా ఉండగలవా? "

"తప్పదుకదా! కావలసినవి దొరకనపుడు కొద్దిగా బాధ పడటం తప్పదుకదా!"

"అయినా మన పెళ్లికి ఏంటట అబ్జక్షన్? "

"కారణాలు అడగొద్దు. మన పెళ్లి మాత్రం జరగదు" తెగేసి చెప్పింది సింధు.

"ఏంటి సింధు? అన్ని విషయాలకూ అలా బెండ్ అయిపోతావేంటి. లైఫ్‌లో వాళ్లు ఎండింగ్ స్టేజ్‌లో ఉన్నారు. మనం స్టార్టింగ్ స్టేజ్‌లో ఉన్నాం. వాళ్లకోసం నన్ను మరచిపోతానంటావేంటి. సరిగా ఆలోచించు"

"వాళ్లు ఏ స్టేజ్‌లో ఉన్నారన్నది ముఖ్యం కాదు. మన మనసులో వాళ్ల స్థానం ఏమిటి అన్నదే ముఖ్యం"

"అంటే నీ మనసులో నా స్థానం అంత బలహీనమైనదా? " స్వరాన్ని హెచ్చిస్తూ అన్నాడు రమేష్.

క్యాంటిన్‌లో కూర్చొని ఉన్న మిగిలిన స్టూడెంట్స్ అంతా వీరివైపే చూస్తున్నారు.

"రమేష్ కొద్దిగా నెమ్మదిగా మాట్లాడు. అందరూ మనల్నే చూస్తున్నారు"

"చూస్తే చూడనీ. నష్టం ఏమీలేదు. ముందు నువ్వు చెప్పు, నీ మనసులో నా స్థానం అంత బలహీనమైనదా? " వాయిస్ ఏమాత్రం తగ్గించకుండా అన్నాడు రమేష్.

"నీ స్థానం బలహీనమైనది కాదు. కానీ నా తల్లితండ్రుల స్థానం మాత్రం నీ కంటే బలమైనది. ఇద్దరిలో ఎవరినో ఒకరిని వదులుకోవలసి వస్తే నేను ఖచ్చితంగా నిన్నే వదులుకుంటాను" తన మనసులో మాటను స్ట్రయిట్‌గా చెప్పేసింది సింధు. పైకి ధైర్యంగా మాట్లాడేసినా లోపల మాత్రం అతను ఎలా రియాక్ట్ అవుతాడో నని భయపడుతూనే ఉంది.

"మూర్ఖంగా మాట్లాడకు సింధు. నేను లేకుండా నువ్వు ఉండలేవు"

"ఎందుకు ఉండలేను. ఖచ్చితంగా ఉండ గలను"

"నువ్వు ఎందుకు ఇంత భయపడుతు న్నావో నాకు తెలుసు. నువ్వు మీ బావతో పెళ్లికి ఒప్పుకోకపోతే ఇంట్లో వాళ్లు చచ్చిపో తామని బెదిరించారా? "

"అలాంటిదేం లేదు. ఈ నిర్ణయం నేను స్వయంగా తీసుకున్నదే"

"కాదు, నువ్వు అబద్ధం చెబుతున్నావు. నువ్వు ఎవ్వరికీ భయపడవలసిన అవసరం లేదు. మన పెళ్లిని ఎవ్వరూ ఆపలేరు"

"ఎవరో ఎందుకు ఆపుతారు. అసలు నేను ఒప్పుకోవాలి కదా? "

"ప్రేమించింది పెళ్లి చేసుకోవటానికి కాదా? మన పెళ్లి విషయంలో మీ అమ్మా నాన్నే కాదు ఎవరు అడ్డువచ్చినా వాళ్లని చంపి అయినా నేను నిన్ను పెళ్లి చేసుకుం టాను" చాలా గట్టిగా అన్నాడు రమేష్.

తన తల్లితండ్రులను అలా అనేసరికి సింధుకి కోపం వచ్చేసింది.

"అదిగో ఆ మూర్ఖత్వం గురించే నిన్ను

చూసి భయపడేది. అసలు నీ గురించి నువ్వు ఏమనుకొంటున్నావ్? నువ్వేమయినా పెద్ద గూండావా. అందరినీ చంపేయటానికి" చాలా ఆవేశంగా అంది సింధు.

వీళ్ల మాటలకు స్టూడెంట్స్ అంతా వీళ్ల చుట్టూ మూగిపోయారు. సింధుకి వాళ్ల మధ్యలో మాట్లాడాలంటే చాలా సిగ్గుగా ఉంది. కానీ రమేష్ మాత్రం ఇవి ఏమీ పట్టించుకోవటంలేదు.

"చూడు సింధూ, నేను రౌడీనో గూండానో కాకపోవచ్చు. కానీ నీతో పెళ్లి జరగకపోవటానికి ఎవరు కారణం అయినా వాళ్లను విడిచిపెట్టే ప్రసక్తే లేదు. అది మీ అమ్మానాన్న అయినా సరే వేరే ఎవరయినా సరే" అని విసురుగా అక్కడ నుండి వెళ్లిపోయాడు రమేష్.

సింధు అక్కడే కుర్చీలో కూర్చొని ఏడుస్తూనే ఉంది. ఇప్పుడు రమేష్ వల్ల తల్లితండ్రులకు ఏదయినా హాని జరుగుతుందేమోనని ఆమెకు చాలా బాధగానూ, భయంగానూ ఉంది.

★ ★ ★

రమేష్ కాలేజ్ కారిడార్లో నడుస్తున్నాడు. ఎంత ప్రయత్నించినా అతను ఆవేశాన్ని అణుచుకోలేక పోతున్నాడు. ఎలాగయినా సింధుని దక్కించుకోవాలని గట్టి పట్టుదల మీద ఉన్నాడు. అందుకు ఏం చెయ్యాలా అని ఆలోచిస్తూ నడుస్తున్నాడు.

ఇంతలో అతనికి ఎదురుగా యశ్వంత్ హ్యాండ్‌స్టిక్ సహాయంతో కుంటుతూ నడుచుకుంటూ వస్తున్నాడు. యశ్వంత్‌ని చూడగానే రమేష్ పెదవులపై అంత కోపంలోనూ నవ్వు విరిసింది. ఒక శాడిస్ట్‌లా యశ్వంత్ వైపు చూసి నవ్వాడు.

"హలో యశ్వంత్. ఎలా ఉన్నావు?" వెటకారంగా నవ్వుతూ ప్రశ్నించాడు రమేష్.

యశ్వంత్ నుంచి ఎటువంటి సమాధానం రాలేదు. అతని మౌనం రమేష్‌లో విజయ గర్వాన్ని నింపింది.

"చూశావా! నీ వల్ల నేను బెడ్‌పై ఉన్నది కేవలం వారం రోజులు మాత్రమే. కానీ నువ్వు బెడ్ దిగటానికి నెల రోజులు పట్టింది"

"రేయ్! ఆ రోజే నువ్వు అయిపోయేవాడివి. అదృష్టవశాత్తూ బయటపడ్డావు"

"కబుర్లు కాదునాన్నా! ఏదయినా చేతల్లో ఉండాలి" కళ్లు ఎగరేస్తూ రెక్‌లెస్‌గా అన్నాడు రమేష్.

యశ్వంత్ చేయి హ్యాండ్‌స్టిక్ మీద బిగుసుకుంది. కొద్దిగా ఆలస్యం అయితే ఆ స్టిక్ దెబ్బకు రమేష్ తల పగిలిపోయేదే. కానీ ప్రిన్సిపాల్ అటువైపుగా రావటం చూసి రమేష్ వడివడిగా అక్కడ నుండి వెళ్లిపోయాడు.

యశ్వంత్ రమేష్ వైపు కోపంగా చూస్తూ ఉండటం తప్ప ఏమీ చేయలేకపోయాడు.



శ్రీనివాస్ క్లాసులో కూర్చొని సింధు గురించే ఆలోచిస్తున్నాడు. క్లాస్ స్టార్ట్ అయి అరగంట దాటిపోతోంది. ఇంకా సింధు క్లాసుకి రాలేదు. ఒకవేళ రమేష్‌తో ఏదయినా గొడవ జరిగి ఉంటుందా?"

ఇలా ఆలోచిస్తుండగా అటెండర్ వచ్చి




శ్రీనివాస్‌కి ఫోన్ వచ్చిందని వెంటనే ఆఫీస్ రూమ్‌కి రావాలని మెసేజ్ చెప్పాడు. ఆ వార్త వినగానే శ్రీనివాస్ ఆశ్చర్యపోయాడు. తనకు కాలేజ్‌కి ఫోన్ చేసే వాళ్లు ఎవరుంటారు? అనుకుంటూనే ఆఫీస్ రూమ్‌కి వెళ్లాడు.

"హలో" అన్నాడు శ్రీనివాస్ ఫోన్ లిఫ్ట్ చేసి.

"శ్రీను, నువ్వు వెంటనే మా ఇంటికి రా" అటువైపు నుంచి చెప్పింది సవిత.

"ఏమయింది? " కాస్త కంగారుగా ప్రశ్నించాడు శ్రీనివాస్.

"సింధు ఇక్కడే ఉంది. అన్నీ చెప్తాను. నువ్వు వెంటనేరా"

"సరే" అని హడావుడిగా బయటకు వచ్చి బైక్ తీసి సవిత ఇంటికి బయలుదేరాడు. అక్కడకు చేరుకోవటానికి ఇరవై నిముషాలు పట్టింది.

శ్రీనివాస్ సవిత రూమ్‌లోకి వెళ్లేసరికి సింధు కుర్చీలో కూర్చొని ఏడుస్తూ ఉంది. సవిత ఆమెకు ఎదురుగా మౌనంగా కూర్చొని ఉంది.

"ఏం జరిగింది? " సవితను ప్రశ్నించాడు శ్రీనివాస్.

"ఆత్మహత్య చేసుకుంటుందట. రైల్వే ట్రాక్ మీదకు వెళ్లింది. బై లక్ నేను చూశాను కాబట్టి సరిపోయింది. లేకపోతే ఈపాటికి అంతా అయిపోయేది" కాస్త బాధగా చెప్పింది సవిత.

"సింధూ... నీకేమయినా పిచ్చా? చనిపోవాల్సినంత కష్టం ఏమొచ్చింది నీకు. నువ్వు ఇంత పిరికిదానివని నేను అనుకోలేదు"

"ఏం చెయ్యమంటావ్? నాకు ఇంతకంటే మార్గం కనిపించటంలేదు" వస్తున్న ఏడుపుని ఆపుకోవటానికి ప్రయత్నిస్తూ చెప్పింది సింధు.

"ఏం జరిగింది? "

"నాన్న పెళ్లికి ఒప్పుకోలేదని రమేష్‌కి చెప్పాను. అందుకు తను ఏమన్నాడో తెలుసా! అమ్మానాన్నను చంపి అయినా నన్ను పెళ్లి చేసుకుంటాడట" ఏడుస్తూనే చెప్పింది సింధు.

"నువ్వు చచ్చిపోతే ఈ ప్రాబ్లం సాల్వ్ అయిపోతుందా!"

"నన్ను దక్కించుకోవటం కోసమే కదా రమేష్ అలా చేస్తానంది. నేనే లేకపోతే ఈ ప్రాబ్లమే ఉండదుకదా? "

"చాలా తప్పుగా ఆలోచించావు సింధు. ముసలితనంతో చనిపోయిన మీ నాన్నమ్మనే నువ్వు మరిచిపోలేకపోయావు. తమ కలలకు ప్రతిరూపంగా కళ్లముందు ఉన్న కన్నకూతురు చనిపోతే మీ అమ్మానాన్న తట్టుకోగలరా? నీ అంత ప్రేమ వాళ్లకు లేదంటావా? " ప్రశ్నించాడు శ్రీనివాస్.

సింధు మౌనంగా ఉండిపోయింది.

"రమేష్ ఆవేశం నీకు తెలిసిందే కదా! ఆ ఆవేశంలో ఏదో అనేసి ఉంటాడే కానీ అతను అంత దుర్మార్గుడు కాదు" మళ్లీ తనే అన్నాడు.

"నా భయం కూడా అదే. ఆ ఆవేశంతోనే నా గురించి అమ్మానాన్నలకు ఏదయినా హాని చేస్తాడేమోనని"

"ఛ.. ఛ... అలాంటిదేం జరగదు. నువ్వు కంగారుపడకు. ముందు నువ్వు ఇకమీదట ఇలాంటి పనులు ఎప్పుడూ చెయ్యనని నాకు ప్రామిస్ చెయ్యి" తన అరచేతిని ముందుకు చాపుతూ అన్నాడు శ్రీనివాస్.

సింధు మాత్రం అతని మాటలకు ఏమాత్రం స్పందించలేదు. అలా మౌనంగానే ఉండిపోయింది.

"ఏంటి సింధు. నా మాటకు కూడా విలువ ఇవ్వవా? " కాస్త సెంటిమెంట్‌ని ఆమె మీద ప్రయోగించాడు.

"నీ మాటకు నేనెప్పుడూ విలువిస్తాను" అని అతని చేతిలో చెయ్యివేసింది. తరువాత కొద్దిసేపు ముగ్గురూ మౌనంగా కూర్చున్నారు.

"శ్రీనివాస్... నేను సాయంత్రం హైదరా

బాద్ వెళ్తున్నాను" నిశ్శబ్దాన్ని బ్రేక్ చేస్తూ చెప్పింది సవిత.

"ఏంటి ఇంత సడన్‌గా"

"ఫ్రెండ్ ఎంగేజ్‌మెంట్ ఉంది. తప్పించుకుందామనుకున్నాను. కానీ కుదరలేదు. మళ్లీ రేపు సాయంత్రం బయలుదేరి వచ్చేస్తాను"

"ఓకే హ్యాపీ జర్నీ" అని సవితకు చెప్పి సింధువైపు తిరిగి "సింధూ! మనం కాలేజీకి వెళదాం పద. ఇక్కడ ఇలా మౌనంగా కూర్చుంటే నువ్వు ఏదో ఒకటి ఆలోచిస్తూ ఉంటావు" అన్నాడు శ్రీనివాస్.

శ్రీనివాస్, సింధు సవితకి బై చెప్పి అక్కడినుండి బయలుదేరారు.

★ ★ ★

శ్రీనివాస్ క్లాస్‌లో నుండి బయటకు వచ్చిన ఐదు నిమిషాలకు రాఘవ క్లాస్‌కి వచ్చాడు. అతనిని చూడగానే మహేష్ లెక్చరర్ వద్ద పర్మిషన్ తీసుకొని బయటకు వచ్చాడు.

"హలో... రాఘవ... బావున్నారా? ఏంటి ఇలా సడన్‌గా?" ప్రశ్నించాడు మహేష్.

"చిన్నపనుండి వచ్చాను ఈ ఊరికి. అలాగే సింధుని కూడా కలిసి వెళదామని వచ్చాను" అన్నాడు రాఘవ. అనేసిన తరువాత తప్పు మాట్లాడినట్టు నాలుక కరుచుకున్నాడు.

"మమ్మల్ని కలుద్దామని వచ్చానంటే మేం కొద్దిగా సంతోషిస్తాంకదా!"

"అఫ్‌కోర్స్... సింధుకోసం వస్తే ఆటోమేటిక్‌గా మిమ్మల్ని కూడా కలుస్తానుకదా!"

"కాదు... సెంటెన్స్ రివర్స్ అయితేనే బావుంటుంది"

"అవుననుకోండి... ఇంతకీ సింధు క్లాస్‌కి రాలేదా?"

"బయట అందరం క్లాసు మొదలుకావటానికి ముందు చాలాసేపు సుత్తి కొట్టుకున్నాం. అప్పుడు మాతోపాటే ఉంది. కానీ ఇంతవరకూ క్లాస్‌కి రాలేదు"

"మరి... శ్రీనివాస్"

"వాడు క్లాసులో ఉండగా ఫోన్ వచ్చిందని వెళ్ళాడు. వాడూ ఇంతవరకూ రాలేదు"

"వాళ్ళిద్దరూ ఎక్కడకు వెళ్ళారో తెలుసుకోవటం ఎలా?"

"నాతో రండి" అని మహేష్ నడక ప్రారంభించాడు. రాఘవ కూడా అతనిని అనుసరించాడు.

వాళ్లు ఆర్ట్స్ డిపార్ట్‌మెంటులో సవిత క్లాస్‌రూమ్‌కి వెళ్ళారు. అక్కడ సవిత లేదు.

"పదండి... ఇప్పుడు సవిత ఇంటికి ఫోన్ చేస్తే వాళ్ళు ఎక్కడ ఉన్నదీ తెలుస్తుంది" అన్నాడు మహేష్.

"అదేంటి... మీకు తెలియకుండా సవితకు ఎలా తెలుస్తుంది?" ప్రశ్నించాడు రాఘవ.

"రోజూ సవిత కాలేజ్‌కి అరగంటముందే వస్తుంది. అటువంటిది ఈరోజు రాలేదు. నా ఉద్దేశం ప్రకారం శ్రీనివాస్‌కి ఫోన్ సవితనుండే వచ్చి ఉండాలి. వేరే ఎవరికీ కాలేజ్ ఫోన్ నెంబరు తెలిసే అవకాశం లేదు" చెప్పాడు మహేష్.

అక్కడనుండి మహేష్ టెలిఫోన్ బూత్‌కి వెళ్ళి సవిత ఇంటికి ఫోన్ చేశాడు.

"హలో..." అటువైపునుంచి వినిపించింది సవిత వాళ్ళ అమ్మగారి కంఠం.

"హలో... ఆంటీ... నేను సవిత ఫ్రెండ్‌ని. అక్కడ శ్రీనివాస్ ఉన్నాడాండీ"

"ఆ... ఉన్నాడమ్మా. శ్రీనివాస్, సింధు కూడా ఇక్కడ ఉన్నారు. పిలవమంటావా?"

"నేనే అక్కడకు వస్తున్నానని చెప్పండి చాలు"

"నీ పేరమ్మా..."

"మహేష్- ఆంటీ... ఉంటానండి" అని రిసీవర్ క్రెడిల్ చేశాడు.

"వాళ్ళనే వచ్చేయమనాల్సింది. మనం అక్కడకు వెళితే ఏం బావుంటుంది?"

"ఏమో వాళ్ళు ఏ పనిమీద అక్కడకు




వెళ్ళారో తెలియదుకదా. మనం మధ్యలో పిలవటం కంటే మనం వెళితేనే బావుం టుంది"

"సరే... మీ ఇష్టం"

"ఇద్దరూ బైక్స్ తీసుకొని సవిత ఇంటికి బయలుదేరారు.

★ ★ ★

"సవితా...! మహేష్ అట ఫోన్ చేశాడు. ఇక్కడకు వస్తున్నాడట" చెప్పింది సవిత మదర్.

ఆ మాటలతో వెళ్ళిపోవటానికి సిద్ధమవు తున్న శ్రీనివాస్, సింధులు తమ ప్రయత్నం విరమించుకున్నారు.

"అదేంటి... వాడెందుకు వస్తున్నాడిక్క డికి? " ప్రశ్నించాడు శ్రీనివాస్.

"అయినా... మనమిక్కడ ఉన్నామని మహేష్‌కి ఎలా తెలుసు? " ప్రశ్నించింది సవిత.

"అది తెలియకపోవచ్చు వాడు నీకోసం వస్తున్నాడేమో? "

"నా కోసమయినా సరే... ఎందుకు అని? "

"వస్తాడుగా... తెలుస్తుందిలే"

మరో ఐదు నిమిషాలకి మహేష్, రాఘవ అక్కడకు వచ్చారు. రాఘవను చూడగానే ముగ్గురూ కంగారుపడ్డారు.

సింధు మొహంలో ఎటువంటి ఎక్స్‌ప్రెషన్స్ కనిపించకుండా నవ్వుతూ ఉండటానికి ప్రయత్నిస్తూ... "ఏంటి... బావా? ఈమధ్య సడన్‌గా వచ్చి సర్‌ప్రైజ్‌లు ఇస్తున్నావు? " అంది.

"చిన్నపనుండి ఇక్కడకు వచ్చాను. అందరినీ కలుద్దామని కాలేజ్‌కి వచ్చాను" అన్నాడు రాఘవ.

"ఇంటికి వెళ్ళావా? "

"లేదు. డైరెక్ట్‌గా ఇక్కడకే వస్తున్నాను. అయినా మీరేంటి కాలేజ్ ఎగ్గొట్టి మరీ ఇంటిలో మీటింగ్ పెట్టారు"

"సవితకు ఒంట్లో బావుండలేదంటే చూసి వెళదామని వచ్చాం ఇద్దరం" మధ్యలో కల్పించుకొంటూ చెప్పాడు శ్రీనివాస్.

ఆ మాట వినగానే సవిత శ్రీనివాస్‌వైపు ఆశ్చర్యంగా చూసింది. తరువాత అతను ఎందుకు చెప్పాడో అర్థం చేసుకొని ముఖంలో ఎక్స్‌ప్రెషన్స్ మార్చి నీరసంగా పెట్టింది.

"ప్రాబ్లం ఏమిటి? " ప్రశ్నించాడు రాఘవ.

"నిన్నటినుంచీ జ్వరం. ఈరోజు కాస్త పరవాలేదు" వాయిస్ చాలా నెమ్మదిగా వచ్చేలా జాగ్రత్తపడుతూ చెప్పింది సవిత.

"నిన్నట్నుంచా? " వెంటనే అన్నాడు మహేష్. కానీ తరువాత శ్రీనివాస్ కళ్ళు పెద్దవి చేసి చూస్తుంటే అప్పుడు పరిస్థితి అర్థం చేసుకున్నాడు.

"అవునవును నిజమే... నిన్న నువ్వు కాలేజ్‌కి కూడా రాలేదు కదా" కాస్త కంగారుగా కవర్ చేయటానికి ప్రయత్నించాడు మహేష్.

"నాకయితే ఇక్కడ అందరిలోనూ సింధూనే నీరసంగా కనిపిస్తోంది" అన్నాడు రాఘవ.

"నేను... నీరసంగా కనిపిస్తున్నానా? బస్ జర్నీవల్ల టైర్ అయి అలా కనిపిస్తున్నానేమో! ముఖం కడుక్కొని వస్తానుండు" అని సింధు సవితని తీసుకొని పక్కరూమ్‌లోకి వెళ్ళింది.

"చెప్పండి శ్రీనివాస్... ఏమిటి విశేషాలు? " ప్రశ్నించాడు రాఘవ.

"మాకు విశాషాలు ఏముంటాయి. లైఫ్‌లో సెటిల్ కావటానికి ప్రయత్నిస్తున్న వారు ఏమయినా ఉంటే మీరే చెప్పాలి" అన్నాడు శ్రీనివాస్.

"ఆ విషయాల గురించి కాదు నేను అడిగేది. నేను మీకు చెప్పిన విషయం గురించి"

"ఓ... అదా! నాకయితే ఎటువంటి ఇన్ఫర్మేషన్ దొరకలేదు. మీరు డైరెక్ట్‌గా మాట్లాడటమే మంచిది"

"అదికాదు శ్రీనివాస్. డైరెక్ట్‌గా అడిగితే ప్రాబ్లం ఏమిటో మీకు ఆల్‌రెడీ చెప్పానుగా"

మహేష్‌కి వీళ్ళ మాటలు ఏమాత్రం అర్థం కావటంలేదు. మధ్యలో మాట్లాడితే బావుండదని ఇద్దరివైపూ అయోమయంగా చూస్తూ కూర్చున్నాడు.

"నేను ఎందుకు చెపుతున్నానో అర్థం చేసుకోండి. మీరు డైరెక్ట్‌గా అడిగితే జరిగే నష్టం కంటె అడగకపోతే జరిగే నష్టమే ఎక్కువ"

"ఓ.కె. డైరెక్ట్‌గానే అడుగుతాను"

"ఇంతకీ ఇప్పటివరకూ మీ ఇద్దరూ దేని గురించి మాట్లాడుతున్నారో నేను తెలుసుకో వచ్చా? " వాళ్ళ సంభాషణ ముగిసింది అని నిర్ధారించుకొన్న తరువాత ప్రశ్నించాడు మహేష్.

"వద్దులేరా! ఇటువంటి పెద్ద విషయాలు నీలాంటి చిన్నపిల్లలు తెలుసుకోకపోవడమే మంచిది" నవ్వుతూ అన్నాడు శ్రీనివాస్.

"చెప్పడం ఇష్టం లేదని డైరెక్ట్‌గా చెప్పొచ్చుకదా!" నొచ్చుకుంటూ అన్నాడు మహేష్.

"ఏంటి... మహేష్? కోపమా? ఈ విషయం నాకు సంబంధించినది. అందుకే శ్రీనివాస్ మీకు చెప్పటంలేదు" సర్దిచెప్పాడు రాఘవ.

"శ్రీనివాస్ గురించి నాకు తెలుసుగా. నేను కూడా సరదాగానే అన్నాను" నవ్వుతూ అన్నాడు మహేష్.

ఇంతలో సవిత, సింధు అక్కడకు వచ్చారు.

"సింధు... కాలేజ్‌కి వెళ్తావా? ఇంటికి వెళ్తావా? " ప్రశ్నించాడు రాఘవ.

"అదేంటి వెళ్తావా అని అడిగావు? ఇంటికి రావా" ప్రశ్నించింది సింధు.

"లేదు. నాకు చాలా పనుంది. కాలేజీకి వెళ్తానంటే నిన్ను కాలేజ్ దగ్గర డ్రాప్ చేసి అలా వెళ్ళిపోతాను. నీతో మాట్లాడాల్సింది కూడా ఉంది"

"సరే... పద"

సింధు, రాఘవ అక్కడనుండి వెళ్ళిపోయారు.

"శ్రీనివాస్ మనం కూడా పోదాం పద" అన్నాడు మహేష్.

"నేను కాలేజీకి రావటంలేదు. నువ్వు వెళ్ళు" చెప్పాడు శ్రీనివాస్.

"ఇందుకేరా టీనేజ్‌లో ఎవరో ఒక అమ్మాయినయినా పడగొట్టాలి అంటారు" కాస్త ఉక్రోషంగా అన్నాడు మహేష్.

"అదేంటి? శ్రీనివాస్ రాననటానికి, దీనికి ఏమిటి సంబంధం? " ప్రశ్నించింది సవిత.

"సంబంధం ఎందుకు లేదు. మొదట బావామరదళ్ళు ఇద్దరూ కలిసి వెళ్ళిపోయారు. ఇప్పుడు వీడు రానంటున్నాడంటే దానికి కారణం నువ్వే అయిఉండొచ్చు. ఎటొచ్చీ ఒంటరిగా మిగిలిపోయింది నేనే కదా!"

"రేయ్... అటువంటిదేం లేదు. నా మూడ్ బాలేదు. నువ్వెళ్ళు" కాస్త అసహనంగా అన్నాడు శ్రీనివాస్.

మహేష్ మారు మాట్లాడకుండా బయటకు వెళ్ళిపోయాడు. సవిత శ్రీనివాస్‌ని పరీక్షగా చూసింది. శ్రీనివాస్ ముఖంలో ఏదో తెలియని బాధ కనిపించిందామెకు.

"శ్రీనివాస్... ఏం జరిగింది? ఎందుకు అదోలా ఉన్నావు? " బాధగా ప్రశ్నించింది సవిత.

"చెప్తాను. కానీ ఇంట్లో కాదు. అలా బయటకు వెళదాం వస్తావా? "

"పద"

శ్రీనివాస్, సవిత బయటకు వచ్చారు. శ్రీనివాస్ బైక్ స్టార్ట్‌చేసి వెనుక సవిత కూర్చున్న తరువాత బైక్‌ని ముందుకి దూకించాడు.

★ ★ ★

"రాఘవ బైక్‌ని ఒక హోటల్‌ముందు ఆపాడు. సింధు బైక్ దిగి నిలబడింది. రాఘవ బైక్ పార్క్‌చేసి హోటల్ లోపలకు




కదిలాడు. సింధు మౌనంగా అతనిని అనుసరించింది.

ఆమెకు తెలుసు రాఘవ తనను ఇక్కడకు ఎందుకు తీసుకువచ్చాడో. అతను ఏ విషయం గురించి తనతో మాట్లాడదలుచుకున్నాడో కూడా ఆమె తేలికగానే ఊహించుకోగలిగింది. తన ఊహ కరెక్టే అయి రాఘవ తమ పెళ్ళి గురించో లేక ఏదయినా అనుమానం వచ్చి రమేష్ గురించో అడిగితే ఏం సమాధానం చెప్పాలో ఆమె నిర్ణయించుకోలేకపోతోంది. ముందే ఒక నిర్ణయానికి వచ్చినా మనసులో ఏదో తెలియని అలజడి, కంగారు కలుగుతున్నాయి. ఆ కంగారుని అణుచుకోవటానికి ఆమె ప్రయత్నిస్తోంది.

హోటల్ లోపల పెద్దగా రద్దీ లేదు. ముగ్గురు కస్టమర్స్ మాత్రమే ఉన్నారు. రాఘవ, సింధు వారికి దూరంగా ఒక టేబుల్ వద్ద కూర్చున్నారు. తరువాత రెండు నిమిషాల వరకూ ఇద్దరిలో ఎవరూ మాట్లాడలేదు. ఇద్దరూ సిట్యుయేషన్‌కి మెంటల్‌గా ప్రిపేర్ అవుతున్నారు.

"సార్... ఆర్డర్" అంటూ వాళ్ళ టేబుల్ దగ్గరకు వచ్చాడు బేరర్.

"ఆ... రెండు టీ" ఆర్డర్ చేశాడు రాఘవ.

బేరర్ వెళ్ళిపోయిన తరువాత గొంతు సరిచేసుకొని మాట్లాడటం ప్రారంభించాడు రాఘవ.

"సింధూ... నీతో ఒక ముఖ్యవిషయం మాట్లాడాలని ఇక్కడకు తీసుకువచ్చాను. ఇది తప్పో... ఒప్పో... నాకు తెలియదు. నాకు ఒక చిన్న అనుమానం వచ్చింది. అది నిన్నడిగి నివృత్తి చేసుకుంటేగానీ, కొన్ని ప్రాబ్లమ్స్ సాల్వ్ అవ్వవని అడుగుతున్నాను. నువ్వు ఏమాత్రం బాధపడకూడదు, సరేనా? "

"ఫరవాలేదు... అడుగు" క్లుప్తంగా అంది సింధు.

ఇంతలో సర్వర్ టీ కప్పులతో వచ్చాడు. రాఘవ కప్పు తీసుకొని సిప్ చేసి తిరిగి చెప్పటం ప్రారంభించాడు.

"నన్ను పెళ్ళి చేసుకోవటం నీకు ఇష్టమేనా? " వాయిస్ తగ్గించి ఎవరికీ వినిపించకుండా చాలా నెమ్మదిగా ప్రశ్నించాడు.

"అలా ఎందుకు అడిగావు? ఇష్టం ఉండదని ఎందుకు అనుకున్నావు? " అసంపూర్తి సమాధానాన్ని ఒక ప్రశ్నతో కలిపి చెప్పింది సింధు.

"సింధూ... ఇది నీ లైఫ్‌కి సంబంధించిన ప్రశ్న. నువ్వు మీ అమ్మా, నాన్నకు భయపడో నేను బాధపడతానని ఆలోచించో నిర్ణయం తీసుకోవద్దు. నువ్వు నన్ను కాకుండా వేరే ఎవరనయినా ఇష్టపడితే చెప్పు. నేను దగ్గరుండి పెళ్లి జరిపిస్తా" లోవాయిస్‌లో చెప్పాడు రాఘవ.

రాఘవ మాటలు వింటూనే సింధు ఆలోచించడం మొదలుపెట్టింది. ఉదయం అందరిలో ఉన్నా పట్టించుకోకుండా గట్టిగా అరుస్తూ మాట్లాడిన రమేష్‌కి, ఇక్కడ రాఘవకు తేడా చాలా క్లియర్‌గా తెలుస్తోంది. తన కారెక్టర్‌కి దగ్గరగా ఉన్న సొంత బావను వదిలిపెట్టి ఎవరినో ప్రేమించి తప్పు చేశాననే ఫీలింగ్ ఆ క్షణంలో ఆమెకి కలిగింది. ఆవేశంలో కలిగే ఆకర్షణకి, ఆలోచనలతో పుట్టే ప్రేమకి చాలా వ్యత్యాసం ఉంది అనిపించిందామెకి.

'ఒక వ్యక్తికోసం ఎంత ఆప్తులయినా ఇందరిని వదులుకోవటం కంటె, వీళ్లందరి కోసం ఒక వ్యక్తిని వదులుకోవటం ఏవిధంగానూ చెడ్డపని కాదు. కాబట్టి నేను తీసుకున్న నిర్ణయం తప్పుకాదు' అని తననితాను సమర్థించుకొంది సింధు.

రాఘవ ప్రశ్నకు సమాధానం చెప్పకుండా ఆమె ఆలోచనలలో ఉండిపోయింది. ఆమె మౌనాన్ని రాఘవ మరోవిధంగా అర్థం చేసుకున్నాడు.

"ఏమిటి సింధూ? మౌనంగా ఉండిపోయావు. నన్ను పెళ్ళి చేసుకోవటం ఇష్టం



లేదా నీకు" ప్రశ్నించాడు రాఘవ.

అప్పుడు ఆలోచనల్లోంచి బయటకు వచ్చింది సింధు.

"నిన్ను పెళ్ళిచేసుకోవటం నాకు ఇష్టమే. ఈ విషయంలో నువ్వు ఎటువంటి అనుమానాలూ పెట్టుకోవాల్సిన అవసరం లేదు" స్థిరంగా అంది సింధు.

"సింధూ... నిజంగానా?" నమ్మలేనట్టుగా ప్రశ్నించాడు రాఘవ.

"నిజంగా నిజం. నీమీద ఒట్టు"

ఆ మాటతో రాఘవ ముఖం కాంతివంతంగా తయారయ్యింది. తను ఇష్టపడిన వ్యక్తి తనకు దక్కుతుందన్న ఆనందం అతని ముఖంలో స్పష్టంగా కనిపిస్తోంది.

"ఈరోజు నాకు చాలా ఆనందంగా ఉంది సింధూ..."

"నాకు కూడా..." మనసులో ఉన్న బాధను దిగమింగుకుంటూ పైకి మాత్రం నవ్వుతూ చెప్పింది సింధు.

"ఇప్పుడు కాలేజ్‌కేగా నువ్వు"

"అవును"

"అయితే... పద నిన్ను డ్రాప్ చేసి నేవెళ్తాను"

ఇద్దరూ హోటల్ నుండి బయటకు వచ్చారు.



ఆకాశంలో పలుచగా మేఘాలు పరుచుకొని ఉండటంవల్ల సూర్యుని ప్రతాపం ఎక్కువగా లేదు.

ప్రస్తుతం శ్రీనివాస్, సవిత ఒక పార్క్‌లో ఉన్నారు. ఒక చెట్టుకింద సవిత కూర్చొని ఉంటే ఆమె ఒడిలో తలపెట్టుకుని శ్రీనివాస్ పడుకొని ఉన్నాడు.

"ఏమిటి శ్రీనివాస్... మిట్టమధ్యాహ్నం పార్కుకి తీసుకొని వచ్చావు. ఏమీ మాట్లాడకుండా అలా కళ్లు మూసుకొని పడుకొని ఉంటావేంటి? విషయం చెప్పు" తన ఒడిలో పడుకున్న అతని బుగ్గలపై చేత్తో రాస్తూ ప్రశ్నించింది సవిత.

"తను మాట్లాడితే ఎక్కడ ఆమె చేతులతో రాయటం మానేస్తుందో, ఎక్కడ తను ఆ అనుభూతి మిస్ కావాల్సివస్తుందోనని శ్రీనివాస్ మౌనంగానే ఉండిపోయాడు.

"శ్రీనివాస్... మాట్లాడు" చేత్తో జుట్టుని పట్టుకొని అతని తలను అటూ ఇటూ ఊపుతూ ప్రశ్నించింది.

శ్రీనివాస్ అప్పుడు నోరు విప్పాడు.

"జీవితంలో మొదటిసారి తప్పు చేశానేమో అనిపిస్తోంది" కళ్లు తెరవకుండానే అన్నాడు.

"ఏ విషయంలో?"

"సింధు విషయంలో"

"సింధు విషయంలోనా? ఏం జరిగిందిప్పుడు?"

"ఈరోజు తను చనిపోయుంటే అందుకు కారణం నేనే అయిఉండేవాడిని కదా" కళ్లు తెరిచి ఆమె కళ్లల్లోకి చూస్తూ అన్నాడు శ్రీనివాస్.

అతని కళ్లల్లో అకస్మాత్తుగా ప్రత్యక్షమై వెంటనే మాయమైపోయిన నీటిపొరని ఆమె గమనించగలిగింది. ఇన్ని సంవత్సరాల పరిచయంలో ఎప్పుడూ శ్రీనివాస్ బాధపడటం చూడని సవిత అతని బాధను చూసి చలించిపోయింది.

"నువ్వెందుకు కారణం అవుతావు?"

"ఆరోజు నేను సింధుని... 'నువ్వు రమేష్‌ని ఏం చూసి ప్రేమించావు' అని అడగకపోయి ఉంటే ఇదంతా జరిగేది కాదేమో కదా"

"నువ్వు అడిగింది నిజమే అయినప్పుడు ఎందుకు బాధపడటం?"

"నిజమే అయినా... అనవసరంగా చాలా మందిని బాధపెడుతున్నానేమో అనిపిస్తోంది"

"ఎటువంటి విషయాన్నయినా ఈజీగా తీసుకునే నువ్వు జరిగిపోయిన ఒక విషయం గురించి ఇంతగా బాధపడటమే




మిటి? "

"ఏమో! ఈ విషయాన్ని నేను ఈజీగా తీసుకోలేకపోతున్నాను"

"శ్రీనివాస్... నువ్వు చేసిన పనివల్ల అందరికీ మంచే జరుగుతుంది. నాకా నమ్మకం ఉంది. అనవసరంగా నువ్వు బాధ పడకు"

శ్రీనివాస్ మౌనంగా ఉండిపోయాడు.

"నీకు హైదరాబాద్ వెళ్లిన తరువాత ఫోన్ చేస్తాను. రేపు ఇంట్లోనే ఉండు" టాపిక్ మారుస్తూ చెప్పింది సవిత.

"ఎలా వెళ్తున్నావ్? ట్రైన్‌లోనా? "

"ఏమో ఇంకా కన్‌ఫర్మ్ కాలేదు. ట్రైన్ కావచ్చు బస్ కావచ్చు లేదా కారు కావచ్చు ఏం? "

"ఏంలేదు. స్టేషన్‌కి వద్దామని"

"ఎలా వెళ్తానో తెలియదుగా వద్దులే. సరే... ఇక వెళ్దామా? "

"పద"

"మధ్యాహ్నం కాలేజీకి వెళ్తావా నువ్వు? "

"వెళ్తాను"

అలా మాట్లాడుకుంటూ పార్కునుండి బయటకు వచ్చారిద్దరూ.

★ ★ ★

"ఏమిటండి... అంత తీవ్రంగా ఆలోచిస్తున్నారు? " ప్రశ్నించింది పార్వతి భర్తని.

"సింధు గురించే" చెప్పాడు సత్యనారాయణ.

"సింధు పెళ్ళి గురించేనా? "

"అవును. అది ఇష్టపడిన వ్యక్తిని మనం చేసుకోవద్దన్నామని అది ఎంత బాధపడి ఉంటుందో కదా! ఎప్పుడూ ఏమీ అడగని పిల్ల నోరు తెరిచి అడిగిన ఒక కోర్కెను కాదన్నాను. నాకూ చాలా బాధగా ఉంది పార్వతీ"

"మనం ఏం చేసినా దాని మంచి గురించే కదండి. మన అమ్మాయి ఆ రమేష్‌తో కంటే రాఘవతో కలిసి ఉంటేనే ఎక్కువ సంతోషంగా ఉంటుంది"

"ఆ విషయం సింధు అర్థం చేసుకోవాలి కదా"

"అది తెలివైనదండి. అర్థం చేసుకొంటుంది. అయినా అది పెళ్ళికి ఒప్పుకున్న తరువాత కూడా మీరు ఇంత ఆలోచించడం ఎందుకు? "

ఆమె మాటలు పూర్తవుతుండగానే ఫోన్ రింగ్ అయింది. సత్యనారాయణ ఫోన్ లిఫ్ట్ చేశాడు.

"హలో..."

"హలో... మావయ్యా... నేను రాఘవని"

"ఆ... రాఘవ చెప్పు. ఏంటి విశేషాలు? "

"అత్తయ్య అందరూ బావున్నారా? "

"బావున్నారు. మీ అమ్మా నాన్న ఎలా ఉన్నారు"

"బాగానే ఉన్నారు. మీతో ఒక విషయం చెప్పుదామని ఫోన్ చేశాను"

"ఏంటది? "

"నేను ఈరోజు పనుండి సింధు వాళ్ళ కాలేజ్‌కి వెళ్ళాను. అక్కడ సింధుని కూడా కలిశాను. మీ అనుమతి లేకుండా సింధుతో పెళ్ళి గురించి మాట్లాడాను"

ఆ మాట వినగానే సత్యనారాయణకి నోటిలో వెలక్కాయ పడ్డట్టయింది. సింధు ఏం చెప్పిందో దానికి రాఘవ ఎలా రియాక్ట్ అయ్యాడోనని టెన్షన్ మొదలయ్యింది ఆయనకు.

"పెళ్లి గురించా? " కంగారుగా అన్నాడు సత్యనారాయణ.

"అవును మావయ్యా. నన్ను పెళ్లి చేసుకోవటం నీకు ఇష్టమా! కాదా అని అడిగాను"

"తనేం చెప్పింది? " వెంటనే అన్నాడు సత్యనారాయణ.

"ఇష్టమే అని చెప్పింది. అసలు ఈ విషయం మీకు చెప్పనక్కర్లేదు అనుకొన్నాను. కానీ తరువాత మీ కూతురు వచ్చి ఇలా బావ నాతో మాట్లాడాడు అని చెప్తే మీరు ఎలా ఫీల్ అవుతారోనని నేనే ముందు చెప్తున్నాను"



"ఆ మాటలు విన్న తరువాత సత్యనారాయణ రిలాక్స్ అయ్యాడు.

"సరే మావయ్యా... నే ఉంటాను" అన్నాడు రాఘవ.

"సరేనమ్మా..." అని ఫోన్ పెట్టేశాడు సత్యనారాయణ. వెనక్కి తిరిగి భార్యతో విషయం చెప్పబోతుండగా మరలా ఫోన్ రింగ్ అయింది.

"హలో..."

"సింధు వాళ్ళ ఫాదర్ సత్యనారాయణగారేనాండి మాట్లాడేది" అటువైపు నుంచి వినిపించిందొక మగ కంఠం.

"అవునండి... మీరెవరు?"

"నేను సింధు క్లాస్‌మేట్‌నండి. కాలేజ్ దగ్గర సింధుకి చిన్న యాక్సిడెంట్ జరిగింది. హాస్పిటల్‌లో అడ్మిట్ చేశాం. మీరు వెంటనే రావాలి"

కూతురు పెళ్లికి ఒప్పుకుంది అన్న ఆనందం అంతా ఒక్కసారిగా ఆవిరైపోయింది.

"యాక్సిడెంటా? సింధుకి ఎలా ఉంది?"

"ఆమెకేం ప్రమాదం లేదు. చిన్న చిన్న దెబ్బలు తగిలాయంతే"

"ఏ హాస్పిటల్‌లో ఉంచారు?"

"కాలేజ్ పక్కనే హాస్పిటల్ ఉంది అందులో" అని చెప్పి లైన్ కట్ చేసేశాడు అవతలి వ్యక్తి.

"ఏంటండి? ఏం జరిగింది?" ప్రశ్నించింది పార్వతి.

సత్యనారాయణ జరిగినదంతా చెప్పాడు. ఇద్దరూ హడావుడిగా బయలుదేరారు. ఇంతలో అక్కడకు వచ్చారు సింధు వాళ్ళ పిన్ని, బాబాయ్.

"ఏంటక్కా? ఎందుకంత హడావుడిగా వెళుతున్నారు" ప్రశ్నించింది సింధు పిన్ని.

పార్వతి జరిగినదంతా చెప్పి సత్యనారాయణతో కలిసి కాలేజ్‌కి బయలుదేరింది.

★ ★ ★

సవిత స్టేషన్‌కి చేరుకొనేసరికి ఫైవ్‌థర్టీ అయ్యింది. ట్రైన్ కరెక్ట్‌టైమ్ కంటె పదినిముషాలు లేటుగా స్టేషన్‌కి చేరుకొనేసరికి ట్రైన్ వెళ్ళిపోయి ఉంటుందేమోనని హడావిడిగా స్టేషన్ లోపలకు పరుగుతీసింది. ప్లాట్‌ఫామ్ ఖాళీగా వెక్కిరించిందామెను. ట్రైన్ వెళ్ళిపోయిందనుకొని నీరసం వచ్చేసింది సవితకు. వెంటనే ట్రైన్ రెండుగంటలు లేటుగా నడుస్తుందని ఎనౌన్స్‌మెంట్ వినిపించింది.

ట్రైన్ వెళ్లనందుకు ఆనందంగానే ఉన్నా, రెండుగంటలు వెయిట్ చెయ్యాల్సివచ్చినందుకు బాధపడింది. నీరసంగా అక్కడ ఉన్న ఒక బెంచ్‌పై కూర్చుంది. రెండు గంటలు ఏం చెయ్యాలా అని ఆలోచిస్తుంటే పక్కనుండి 'హాయ్...సవిత" అని వినిపించింది.

మాటలు వినిపించిన వైపుగా తల తిప్పి చూసింది. సవితకు పక్కనే రమేష్ నిలబడి ఉన్నాడు. అతనిని చూడగానే ఆశ్చర్యపోయింది.

"హాయ్...రమేష్... నువ్వు ఇక్కడ...ఎక్కడికి వెళుతున్నావ్?" ప్రశ్నించింది సవిత.

"నేను ఎక్కడికీ వెళ్లటంలేదు. నీకోసమే వచ్చాను" అదే బెంచ్‌పై కూర్చుంటూ అన్నాడు రమేష్.

"నాకోసమా?"ప్రశ్నార్థకంగా మొహం పెట్టి అడిగింది సవిత.

"అవును. నీకోసం ఇంటికి ఫోన్ చేశాను. స్టేషన్‌కి వెళ్ళావని చెప్పారు. ట్రైన్ వెళ్ళిపోతుందేమో అనుకుంటూ వచ్చాను. నా అదృష్టం ట్రైన్ రెండుగంటలు లేటుగా వస్తోంది"

"ఏదయినా ఇంపార్టెంట్ విషయమా?" కాస్త అసహనంగా ప్రశ్నించింది సవిత.

రమేష్ ఎప్పుడూ సవితతో పెద్దగా మాట్లాడడు. అటువంటిది ఈరోజు తన కోసం స్టేషన్‌కి వెతుక్కుంటూ వచ్చేసరికి ఆమెకు ఆశ్చర్యంగా ఉంది. విషయం ఏమిటా అని ఆలోచించసాగింది సవిత.





"చాలా ఇంపార్టెంట్ మేటర్. నా లైఫ్‌కి సంబంధించినది"

సవితకు విషయం కొద్దిగా అర్థం అ య్యింది.

"ఇంతకీ మేటర్ ఏమిటో చెప్పు"

"సింధు గురించి నీతో మాట్లాడదామని"

"సింధు గురించి నాతో ఏం మాట్లా డాలి? "

"సింధూ వాళ్ళింట్లో మా పెళ్ళికి ఒప్పుకో లేదు. అందుకు తనని మరిచిపొమ్మని నాకు చెప్తోంది. ఈ నిర్ణయం కరక్టేనా? "

"నాకు తెలిసినంతవరకు కరక్టే"

"నువ్వు కూడా తనకే సపోర్ట్ ఇస్తున్నావా? నాకు సపోర్ట్ ఇచ్చేవారు ఒక్కరూ లేరా? అయినా ప్రేమించినవాడి కోసం ఇంట్లోవాళ్లని వదిలివస్తే తప్పేంటి? తరువాత ఇష్టంలేని వాణ్ణెవణ్నో పెళ్ళిచేసు కొని కష్టాలు పడటంకంటే ఇదే మంచిది కదా? "

"తల్లిదండ్రులను విడిచి పెట్టిరావటం అన్నది ఆలోచించినంత తేలిక కాదు. ఆరు నెలలనుంచో, లేకపోతే ఒక సంవత్సరం నుంచో ప్రేమించిన వ్యక్తిని మరిచిపోవాలం టేనే నువ్వు ఇంత బాధపడుతున్నావు కదా! మరి పద్దెనిమిది సంవత్సరాలనుంచి ప్రేమి స్తున్న తల్లిదండ్రులను సింధు ఎలా వదు లుకోగలదు? "

"అంటే... మీరెవరూ నాకు సహాయం చేయరు. అంతేగా? "

"అలా ఎప్పుడూ అనుకోవద్దు. తప్ప కుండా సహాయంచేస్తాం... కానీ" అంటూ సవిత ఏదో చెప్పబోయింది. రమేష్ ఆమె మాటలకు అడ్డుపడ్డాడు.

"చాలు... ఆ ఒక్క మాటా చాలు. ఇప్పుడు నేను నీ దగ్గరకు వచ్చింది నిన్ను ఒక సహాయం అడుగుదామని. చేస్తావా? "

"నేను చేయగలిగినదయితే తప్పకుండా చేస్తాను. ఏంటది? "

సింధు తన పెళ్ళి విషయంలో శ్రీనివాస్ ఒక్కడిమాటే వింటుంది. శ్రీనివాస్ నీ మాట వింటాడు. కాబట్టి నువ్వు సింధు తన నిర్ణయం మార్చుకునేలా చెయ్యాలని శ్రీనివాస్‌కి చెప్పాలి. నువ్వు చెప్తే శ్రీనివాస్ తప్పకుండా వింటాడు. ప్లీజ్... నాకు ఈ ఒక్క సహాయం చెయ్యవా? " రిక్వెస్ట్ చేశాడు రమేష్.

"సారీ! రమేష్... ఈ విషయంలో మాత్రం నేను ఎటువంటి హెల్ప్ చేయ లేను. ఎందుకంటే శ్రీనివాస్ నీకంటే మొండివాడు. అతని నిర్ణయాన్ని నేను కాదు కదా వాళ్ల ఇంట్లోవాళ్లు కూడా మార్చ లేరు. తను ఏ డెసిషన్ తీసుకున్నా చాలా ఆలోచించి స్ట్రాంగ్‌గా నిర్ణయం తీసుకుం టాడు. అంతేగాని హడావిడిగా నిర్ణయం తీసుకొని తరువాత కష్టాలుపడి మళ్లీ ఎవరో చెపితే నిర్ణయం మార్చుకునే మనస్తత్వం కాదు శ్రీనివాస్‌ది" అంది సవిత ఇన్‌డైరె క్టగా నీ ప్రవర్తన తప్పు అని చెపుతూ.

"నువ్వు చెపితే శ్రీనివాస్ తప్పకుండా ఒప్పుకుంటాడు. ఆ విషయం నాకు తెలుసు. నీకే ఈ సహాయం చేయటం ఇష్టంలేదు. అవునా? "

"కాదు రమేష్. నేను నిజం చెపుతు న్నాను. నేను చెప్పినంత మాత్రాన శ్రీని వాస్ తన నిర్ణయం మార్చుకోడు"

"ప్లీజ్...సవితా? నాకోసం ఒక్కసారి ప్రయత్నించి చూడు"

"ఓకే రమేష్... అంతవరకూ ఎందుకు. ఒకవేళ తను నా మాట విని నిర్ణయం మార్చుకొనే అవకాశం ఉన్నా నేను శ్రీనివా స్‌కి చెప్పను. ఎందుకంటే శ్రీనివాస్ తీసు కున్న ఏ నిర్ణయాన్నయినా నేను గౌరవి స్తాను కనుక" స్ట్రయిట్‌గా తన మనసులోని మాటను చెప్పేసింది.

రమేష్‌కి ఏం మాట్లాడాలో అర్థంకాక మౌనంగా ఉండిపోయాడు.

"రమేష్... నేనొక మాట చెప్తాను విను. నువ్వు ప్రేమించిన అమ్మాయి నీ మాట



కంటే వేరే ఎవరి మాటకో విలువ ఇస్తుం దని నువ్వు అనుకునే స్థాయిలో ఉన్నపుడు నువ్వు ఆమెను మరిచిపోవటమే మంచిది" అంది సవిత.

ఆ మాటలకి రమేష్‌కి కొద్దిగా బాధకలి గింది. తనకున్న ఒక్క అవకాశం కూడా పోయిందని బాధపడుతూ దిక్కులు చూస్తూ కూర్చున్నాడు.



సింధూ బస్సుదిగి అడుగులో అడుగువే సుకుంటూ నెమ్మదిగా నడుస్తోంది. ఆమె మనసంతా చాలా భారంగా ఉంది. తన గురించి రమేష్, తన తల్లిదండ్రులను ఏం చేస్తాడోనన్న భయం ఆమెలో నిముషనిము షానికీ పెరిగిపోతోంది. తన ప్రేమ తల్లిదం డ్రుల ప్రాణాలమీదకు వచ్చేలా ఉంది. ఇలా ఆలోచనలతో అడుగులు కూడా ముందుకు పడటంలేదామెకు. తలంతా బరువుగా అయి కళ్లు తిరుగుతున్నట్టుగా అనిపి స్తోంది.

అలాగే నెమ్మదిగా నడుచుకుంటూ ఇంటిని సమీపించి గేటు తీసుకొని లోప లకు వెళ్ళింది. వెంటనే ఆమె పిన్నీ, బాబాయ్ పరిగెత్తుకుంటూ ఆమె వద్దకు వచ్చారు.

"సింధూ... ఎలా ఉన్నావు? నీకేం కాలే దుగా? " కంగారుగా ఒకేసారి అన్నారి ద్దరూ.

"ఏంటి బాబాయ్? ఏమయ్యింది? నేను బాగానే ఉన్నానుగా" వాళ్ళ కంగారు ఎందుకో అర్థంకాక అయోమయంగా ప్రశ్నిం చింది సింధు.

"నీకు యాక్సిడెంట్ అయ్యిందని, హాస్పిట ల్‌లో జాయిన్ చేశారని అన్నారు" అన్నాడు ఆమె బాబాయ్.

ఆ మాటలకు అదిరిపడింది సింధు. 'తను భయపడినంతా జరుగుతోందా?' అన్న ఆలోచన రాగానే ఆమె శరీరం చిన్నగా ఒణికింది.

"నాకు యాక్సిడెంట్ అవ్వటమేమిటి బాబాయ్! ఎవరు చెప్పారు? " కంగారుగా ప్రశ్నించింది సింధు.

"ఏమో? ఎవరో తెలియదు. ఇందాక ఫోన్ చేశారు. నీకు యాక్సిడెంట్ అయ్యిం దని, కాలేజ్ పక్కనే ఉన్న హాస్పిటల్‌లో జాయిన్ చేశామని, అమ్మా, నాన్నని వెంటనే రమ్మని ఫోన్ చేశారు. అందుకే వాళ్ళిద్దరూ కాలేజ్ వద్దకు వెళ్లారు"

"అసలు మా కాలేజ్ దగ్గర హాస్పిటలే లేదు బాబాయ్. అమ్మా, నాన్న బయలుదేరి ఎంతసేపయ్యింది? " వస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ ప్రశ్నించింది సింధు.

"అరగంట పైనే అయ్యింది"

అంటే ఈ పాటికి వాళ్లు కాలేజ్ దగ్గరకు చేరుకుంటారు. నేను కనబడకపోతే మళ్ళీ ఇంటికి ఫోన్‌చెయ్యాలి. కానీ ఫోన్ చెయ్య లేదు. అంటే వాళ్లకు ఏమయినా అయ్యిం టుందా? అసలు ఫోన్ చేసింది ఎవరు? రమేష్... అంటే రమేష్ అన్నంత పనీ చేస్తున్నాడా! ఛీ... దుర్మార్గుడా!' తనలోతనే అనుకొంది సింధు.

రమేష్ తన తల్లిదండ్రులకు హాని చేస్తా డేమోనన్న అనుమానంతో ఉన్న సింధు




ఆలోచనలు ఆ పరిధిని దాటి బయటకు రాలేకపోతున్నాయి. రమేష్ ఈ పని చేయకపోవటానికి ఛాన్స్ ఉందేమోనన్న ఆలోచన మాత్రం ఆమెకు రావటంలేదు.

పదినిముషాలు తల్లిదండ్రుల వద్దనుంచి ఫోన్ వస్తుందేమోనని ఎదురుచూసింది. క్షణక్షణానికీ ఆమెలో భయం, రమేష్ మీద అసహ్యం పెరిగిపోతున్నాయి.

చూసిచూసి ఇక తనే ఏదో ఒకటి చెయ్యాలనుకొని రమేష్ ఇంటికి ఫోన్ చేసింది.

"హలో..." అటువైపునుంచి వినిపించింది చైతన్య గొంతు.

"చైతన్యా! నేను సింధుని. రమేష్ ఉన్నాడా?"

"లేదు. కాలేజ్‌నుంచి ఇంకా రాలేదు. నేను కాలేజ్‌నుంచి ముందుగానే వచ్చేశాను కదా! ఇంకా నేను మీ ఇద్దరూ కలిసి వస్తారనుకొంటున్నాను. ఏం? ఏదయినా పనుందా?"

"ఏం లేదులే" అని విసురుగా ఫోన్ క్రెడిల్ చేసింది.

రమేష్ ఇంకా ఇంటికి రాలేదన్న విషయం ఆమెలో అనుమానాన్ని మరింత బలపరిచింది. ఇక సింధు ఏ మాత్రం ఆలస్యం చేయలేదు. మరలా ఫోన్ లిఫ్ట్ చేసి శ్రీనివాస్ నెంబర్ డయల్ చేసింది.

"హలో..."

"హలో.. శ్రీనివాస్... నేను సింధుని" అంది కంగారుగా. ఆమె మాటల్లో భయం, బాధ స్పష్టంగా తెలిసిపోతున్నాయి.

"సింధూ... వాయిస్ ఏంటి తేడాగా ఉంది. ఎనీథింగ్ రాంగ్?"

సింధు ఏడుస్తూనే జరిగినదంతా చెప్పింది.

"సింధూ... నువ్వేం కంగారుపడకు. నేను వెంటనే హాస్పిటల్స్ అన్నీ చూసి నీకు ఫోన్ చేస్తాను" అని శ్రీనివాస్ ఫోన్ పెట్టేశాడు.

సింధు రిసీవర్ క్రెడిల్ చేసి సోఫాలో కూలబడిపోయింది. ఎంత ఆపుకుందామన్నా ఆమెకు ఏడుపు కంట్రోల్ కావటం లేదు.

"ఏయ్... సింధూ చిన్నపిల్లలా ఏడుస్తావెందుకు? అమ్మా, నాన్నకు ఏం కాదు. వచ్చేస్తారు. నువ్వు ఊరుకో" అంటూ ఓదార్చింది ఆమె పిన్ని.

"పిన్నీ... నాకు అమ్మా, నాన్న కావాలి పిన్నీ" ఏడుస్తూ అంది సింధు.

సింధు మాటలకు ఆమెకు కూడా కళ్లల్లో నీళ్లు తిరిగాయి. అవి సింధుకి కనిపించకుండా జాగ్రత్త పడిందామె.

"నువ్వేం కంగారుపడకు. చిన్న విషయానికే అంత కంగారు పడిపోతావెందుకు"

సింధు అలా ఏడుస్తూనే కూర్చుంది. తన తల్లిదండ్రులకు ఎటువంటి ఆపదా జరగకూడదని పదేపదే మనసులో దేవుణ్ణి ప్రార్థించుకొంటోంది.

ఆమె టెన్షన్‌తో కూర్చోలేక లేచి అటూ ఇటూ తిరగటం ప్రారంభించింది. ఇంతలో ఫోన్ రింగ్ అవటంతో వెంటనే రిసీవర్ అందుకొంది.

"హలో...శ్రీనివాస్" అంది సింధు.

"ఆ...నేనే" అన్నాడు శ్రీనివాస్.

"అమ్మా... నాన్న... కనిపించారా?" అతని మాటలు పూర్తికాకుండానే కంగారుగా ప్రశ్నించింది సింధు.

"లేదు సింధూ. అన్ని హాస్పిటల్స్ వెతికాను. కాలేజ్‌కి వెళ్ళి వాచ్‌మెన్‌ని కూడా అడిగాను. అసలు అక్కడకు ఎవ్వరూ రాలేదని చెప్పాడు"

శ్రీనివాస్ మాటలు విని సింధు పూర్తిగా నీరసించిపోయింది.

"రమేష్ కాలేజ్ దగ్గరే ఉన్నాడా?"

"లేదు. ఏం"

"రమేష్ ఇంకా ఇంటికి కూడా రాలేదు. ఒకవేళ తనే నామీద కోపంతో ఇలా ఫోన్ చేసి అమ్మానాన్నను రప్పించి ఏదయినా

చేసుంటాడేమోనని భయంగా ఉంది" తన అనుమానాన్ని చెప్పింది సింధు.

"ఛ...ఛ...అలా జరగదు. రమేష్ అంత దుర్మార్గుడేం కాదు. నువ్వు లేనిపోని అనుమానాలు పెట్టుకోకు"

"మరి ఇప్పుడు నేనేం చెయ్యాలి? "

"ముందు నువ్వు పోలీస్ కంప్లైంట్ ఇవ్వు. నేను కూడా మీ ఇంటికి వస్తాను" అని చెప్పి లైన్ కట్‌చేశాడు శ్రీనివాస్.

సింధు కూడా లైన్ కట్‌చేసి తరువాత పోలీస్‌స్టేషన్‌కి ఫోన్‌చేసి కంప్లైంట్ ఇచ్చింది. పదినిముషాల్లో ఒక ఇనస్పెక్టర్, ఒక కానిస్టేబుల్ అక్కడకు వచ్చారు.

సింధూ వాళ్ళ బాబాయ్ ఫోన్ రావటం దగ్గర్నుంచి అంతా ఇన్‌స్పెక్టర్‌కి చెప్పాడు.

"మీకు ఎవరిమీదయినా అనుమానం ఉందా? " అంతా విని ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

సింధుకి ఏం చెప్పాలో అర్థంకాలేదు. రమేష్ గురించి చెప్పాలా... వద్దా? అన్న డైలమాలో పడింది.

'తనకి అనుమానం కేవలం రమేష్‌పైనే అని చెప్తే అతను సఫర్ అవుతాడు. చెప్పకపోతే తన తల్లిదండ్రులు దొరికే ఛాన్స్ తగ్గిపోతుందేమో? ' అని ఆలోచించసాగింది. తల్లి దండ్రులపై ఉన్న మమకారం చివరకు ప్రియుడిపై ఉన్న ప్రేమను అధిగమించింది.

"రమేష్...అని ఒక వ్యక్తిమీద అనుమానంగా ఉంది" జంకుతూనే చెప్పింది సింధు.

"అతని మీద ఎందుకు అనుమానం? " ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

సింధు రమేష్ మీద తనకు అనుమానం ఏర్పడటానికి గల కారణాన్ని వివరించింది. తన ప్రేమ విషయం కూడా ఏమాత్రం దాచకుండా చెప్పేసింది.

"అవసరమయితే ఫోన్ చేస్తాను. మీరు స్టేషన్‌కి రావలసి ఉంటుంది" అని చెప్పి ఇన్‌స్పెక్టర్ వెళ్ళిపోయాడు.

సింధు ఏడుస్తూ కూర్చుంది. రమేష్ గురించి చెప్పినందుకు ఆమెలో బాధ మొదలయ్యింది. 'తప్పు చేశానేమో'నన్న ఫీలింగ్ ఆమెను పీడించసాగింది.

కొద్దిసేపటి తరువాత శ్రీనివాస్ వచ్చాడక్కడికి. సింధు శ్రీనివాస్‌కి జరిగినదంతా చెప్పింది.

"తప్పుచేశావేమో సింధూ" అంతా విని అన్నాడు శ్రీనివాస్.

"ఏమో? నాకు ఇంతకంటే మార్గం కనిపించలేదప్పుడు. 'కానీ ఎందుకు చెప్పానా' అని ఇప్పుడు బాధపడుతున్నాను" అంది సింధు.

"సరే ఏదో ఒకటి అయ్యింది. ఏం జరుగుతుందో చూద్దాం" ఏదో ఆలోచిస్తూ అన్నాడు శ్రీనివాస్.

"మరి రమేష్ కాకపోతే ఇక ఈ పని చెయ్యాల్సిన అవసరం ఎవరికుంది? "

"యశ్వంత్‌కి"

"యశ్వంత్‌కా? " ఆశ్చర్యంగా ప్రశ్నించింది సింధు.

"అవును. ఇప్పుడు యశ్వంత్ మీ మమ్మీ డాడీని కిడ్నాప్ చేసినా నువ్వు ఉదయం జరిగిన సంఘటన ఆధారంగా రమేష్‌నే అనుమానిస్తావన్న ప్లాన్‌తో వాడు ఈ పని చేసుండొచ్చు కదా? "

"ఛ... నేను ఈ విషయమే ఆలోచించలేదు. అనవసరంగా రమేష్‌ని ఇరికించాను. ఇప్పుడేం చెయ్యాలి? " బాధగా ప్రశ్నించింది సింధు.

"ప్రస్తుతానికి మనం చేయగలిగింది... ఈ విషయాన్ని కూడా ఇన్‌స్పెక్టర్‌కి చెప్పటం"

శ్రీనివాస్ అలా చెప్పగానే సింధు వెంటనే పోలీస్‌స్టేషన్‌కి ఫోన్ చేసి విషయం చెప్పింది. తను రమేష్‌ని అనుమానించటం లేదని యశ్వంత్‌ని అనుమానిస్తున్నానని చెప్పింది.

"చూడండి! ఎవరి మీద మీకు అను




మానం ఉన్నా మేటర్ రమేష్ వద్దనుంచే మొదలవుతోంది కాబట్టి మేము అతన్ని కూడా ప్రశ్నించాలి. మీరు అనుమానం ఉందని చెప్పినంతమాత్రాన వాళ్లని స్టేషన్‌లో పెట్టి కాళ్లూ చేతులూ విరగ్గొట్టం. మా పద్ధతులు మాకు ఉంటాయి" అని ఫోన్ పెట్టేశాడు ఇన్‌స్పెక్టర్.

సింధు నీరసంగా రిసీవర్ క్రెడిల్ చేసింది.

★ ★ ★

పోలీస్ ఇన్‌స్పెక్టర్ రమేష్ ఇంటికి చేరుకున్నాడు. అప్పటికి సమయం ఏడు గంటలు అవుతోంది. రమేష్ ఇంకా ఇంటికి రాలేదు. పోలీస్ వాళ్లు ఇంటికి వచ్చేసరికి ఏం జరిగిందో అర్థంకాక ఇంట్లో వాళ్లంతా కంగారుపడ్డారు.

"ఇక్కడ రమేష్ అంటే ఎవరు? " ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

"రమేష్ ఇంకా కాలేజ్ నుంచి రాలేదు సార్" చెప్పాడు చైతన్య.

"మీరెవరు? ఏమౌతారు అతనికి"

"నా పేరు చైతన్య. రమేష్ తమ్ముడిని"

"మీరేం చేస్తున్నారు? "

"నేను బి.యస్.సి. చదువుతున్నాను. అన్నయ్యా, నేనూ ఒకే కాలేజ్‌లో చదువుతున్నాం"

"ప్రతిరోజూ ఇద్దరూ కలిసే కాలేజ్‌నుంచి వస్తారా? "

"అవునండి. సాధారణంగా ఇద్దరం కలిసే వస్తాం"

"మరి ఈ రోజు మీ అన్నయ్య ఇంకా ఇంటికి ఎందుకు రాలేదు? "

"ఈరోజు మధ్యాహ్నం నాకు క్లాసెస్ త్వరగా అయిపోయాయి. అందుకే నేను త్వరగా ఇంటికి వచ్చేశాను"

"సాధారణంగా రోజూ మీరు కాలేజ్ నుంచి ఇంటికి ఎన్నిగంటలకు వస్తారు? "

"ఆరు లోపలే వస్తాం" కాస్త చిరాకుగా అన్నాడు చైతన్య.

ఇన్‌స్పెక్టర్ ఇంటరాగేషన్ చూస్తుంటే చైతన్యకు కోపం వచ్చేస్తోంది. కానీ ఏం జరిగిందో తెలియకుండా తొందరపడకూడదని ఓపికగా సమాధానం చెపుతున్నాడు.

"మరి ఈ రోజు ఇంకా మీ అన్నయ్య ఎందుకు రాలేదు? "

"నాకు తెలియదు సార్"

"సరే... అయితే మీ బ్రదర్ వచ్చిన తరువాత స్టేషన్‌కి వచ్చి నన్ను కలవమనండి"

"చెప్తాను సార్. కానీ ఎందుకో తెలుసుకోవచ్చా సార్? "

"మీ బ్రదర్‌ని పంపించండి. విషయం తరువాత మీకే తెలుస్తుంది" అని ఇన్‌స్పెక్టర్ అక్కడనుండి వెళ్ళిపోయాడు.

"ఏరా చైతన్యా! ఏం చేశాడు వీడు? మరలా ఎవరితోనయినా గొడవపెట్టుకున్నాడా" కంగారుగా ప్రశ్నించింది పద్మావతి.

"లేదమ్మా! నాకు తెలిసినంతవరకూ ఎటువంటి గొడవా జరగలేదు"

"మొండి వెధవ. ఎవరితోనో గొడవపెట్టుకొని ఉంటాడు. లేకపోతే పోలీసులు ఎందుకు వస్తారు" అంది పద్మావతి.

చైతన్య మౌనంగా ఉండిపోయాడు. అందరూ దిగాలుగా రమేష్‌కోసం ఎదురు చూస్తూ కూర్చున్నారు. టైమ్ ఎనిమిదిగంటలు అవుతుండగా రమేష్ వచ్చాడు.

"ఏంటి? ఏం జరిగింది? అందరూ ముఖాలు అలా పెట్టుకొని కూర్చున్నారేంటి? " లోపలకు వస్తూ ప్రశ్నించాడు రమేష్.

"నీకోసం పోలీసులు వచ్చారు" చెప్పాడు చైతన్య.

"పోలీసులా? నా కోసమా? ఎందుకు? "

"ఏమో! స్టేషన్‌కి వస్తే నీకు చెప్తారట. నిన్ను వెంటనే స్టేషన్‌కి రమ్మని చెప్పి వెళ్లారు"

"స్టేషన్‌కి నేనెందుకు వెళ్ళాలి. అవసరమయితే వాళ్ళే వస్తారు" సీరియస్‌గా అన్నాడు రమేష్.

"అదే... ఆ మూర్ఖత్వమే వద్దు. నువ్వేదో తప్పుచేసి దాక్కొన్నావని వాళ్లు అనుకోవాలా? ఒకసారి తమ్ముడూ, నువ్వు కలిసి స్టేషన్‌కి వెళ్లండి" కోపంగా అంది పార్వతి.

"సరే..." అని రమేష్ చైతన్యతో కలిసి స్టేషన్‌కి వెళ్ళాడు.

వాళ్లు వెళ్లేసరికి ఇంతకుముందు వచ్చిన ఇన్‌స్పెక్టర్ ఎవరితోనో ఫోన్‌లో మాట్లాడుతుండటంతో వీళ్లు కాస్త దూరంగా నిలబడ్డారు. అతను మాట్లాడటం పూర్తయిన తరువాత రమేష్ వెళ్ళి తననితాను పరిచయం చేసుకున్నాడు.

"నువ్వేనా రమేష్ అంటే! ఏరా ఏంచేస్తూ ఉంటావురా?" ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

అతని మాటలు విని చైతన్య చాలా ఆశ్చర్యపోయాడు. 'ఇంతకుముందు 'అండీ' అంటూ చాలా గౌరవంగా మాట్లాడి' ఇప్పుడేమో ఇంత రేష్‌గా మాట్లాడుతున్నాడు ఏదో తేడాగా ఉంది' అనుకున్నాడు చైతన్య.

"ఎమ్. ఎస్. సి. చదువుతున్నానండి" చెప్పాడు రమేష్.

"పార్ట్‌టైమ్‌గా కిడ్నాప్‌లూ, మర్డర్‌లూ



కూడా చేస్తుంటావా? "

"లేదు సార్... ఇంకా అంత దుర్మార్గుణ్ణి అవలేదుసార్. ఎందుకు సార్!"

"అంటే కొంత దుర్మార్గుడివన్నమాట. అది సరేగానీ నీకు సింధు అని ఎవరయినా తెలుసా? "

"తెలుసు సార్" ఆశ్చర్యపోతూ చెప్పాడు రమేష్.

"ఎలా తెలుసు? "

"ఆ అమ్మాయి కూడా మా కాలేజ్‌లోనే చదువుతుంది గనుక"

"అంతేనా... లేక ఇంకా ఏమయినా!"

"ఇంకా ఏమైనా అంటే... ఆ అమ్మాయి, నేను ప్రేమించుకొంటున్నాం సార్"

"ఆ అమ్మాయి కూడా నిన్ను ప్రేమిస్తోందా? "

"ప్రేమిస్తోంది సార్. ఇవన్నీ ఎందుకు అడుగుతున్నారు సార్" అనుమానంగా ప్రశ్నించాడు రమేష్.

వీళ్ల సంభాషణ వింటున్న చైతన్యకి పరిస్థితి అయోమయంగా ఉంది. పోలీస్‌స్టేషన్‌కి పిలిచి సింధు గురించి ఎందుకు అడుగుతున్నారు? సింధుకి ఏమయినా అయ్యిందా? అని ఆలోచించసాగాడు చైతన్య.

"అంటే... మీ ఇద్దరికీ ఎటువంటి ప్రాబ్లమ్స్ లేవంటావ్" గడ్డాన్ని చేత్తో రాసుకుంటూ ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

"ఒకటే ప్రాబ్లం సార్. మా ప్రేమ ఆ అమ్మాయి వాళ్ళింట్లో వాళ్లకి ఇష్టంలేదు. అందుకే తను భయపడుతోంది"

"నువ్వు మాత్రం చాలా ధైర్యంగా ప్రేమించానంటావ్"

"మేమిద్దరం మేజర్‌లమే. అటువంటప్పుడు ఎందుకు భయపడాలి? "

"ఆ ధైర్యంతోనే మీ పెళ్లికి ఒప్పుకోలేదని ఆ అమ్మాయి తల్లిదండ్రుల్ని కిడ్నాప్ చేశావా? " రమేష్‌వైపు సూటిగా చూస్తూ ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

ఆ మాట వినగానే చైతన్య, రమేష్ ఇద్దరూ షాక్ తిన్నారు. ఇప్పుడే ఇద్దరికీ పరిస్థితి కొద్దిగా అర్థం అయ్యింది.

"లేదు సార్. మీరు పొరపాటు పడుతున్నారు సార్. నేను వాళ్లను కిడ్నాప్ చేయటం ఏమిటి? ఇప్పుడు మీరు చెప్పేవరకూ వాళ్ళు కిడ్నాప్ అయినట్టే నాకు తెలియదు సార్" కంగారుగా అన్నాడు రమేష్.

"అంత తేలిగ్గా నువ్వెందుకు చెప్తావ్? సెల్‌లో వేసి అడిగేవిధంగా అడిగితే నువ్వే చెప్తావు"

"సార్. నేను చెప్పేది నిజం సార్. నాకు వాళ్లని కిడ్నాప్ చేయాల్సినంత అవసరం, అంత ధైర్యం కూడా లేవు సార్"

"నీ ధైర్యం గురించి నాకు తెలుసు బాబూ! ఎమ్.ఎల్.ఏ.గారి కొడుకుని కొట్టేటంత ధైర్యవంతుడివి నువ్వు. కిడ్నాప్ చేయటానికి కావలసిన ధైర్యం నీకు లేదంటే నమ్మటానికి నేను వెధవననుకొంటున్నావా? "

ఈ విషయాలన్నీ ఇన్‌స్పెక్టర్‌కి ఎలా తెలిసాయా అని ఆశ్చర్యపోయారిద్దరూ.

"సార్... ఇంతకీ మా అన్నయ్య వాళ్లను కిడ్నాప్ చేశాడని కప్లైంట్ ఎవరిచ్చారు? " ప్రశ్నించాడు చైతన్య.

"ఆ అమ్మాయే ఇచ్చింది"

రమేష్, చైతన్యలిద్దరికీ ఈ విషయం అన్నిటికంటే పెద్ద షాక్‌ని ఇచ్చింది.

"సార్... మా అన్నయ్య ఈ పని చేయడు సార్. వాడి గురించి నాకు బాగా తెలుసు సార్... వాణ్ణి వదిలేయండి సార్" ప్రాధేయపడుతున్నట్టుగా అన్నాడు చైతన్య.

"చూడు తమ్ముడూ! మీ వాడిగురించి తెలియాల్సింది నీకూ, నాకూ కాదు. కంప్లైంట్ ఇచ్చిన వ్యక్తికి తెలియాలి. ఇప్పుడు నేను మీ వాణ్ణి వదిలేస్తే నా ఉద్యోగం ఊడిపోతుంది. ఆ అమ్మాయిని వచ్చి కంప్లైంట్ విత్‌డ్రా చేసుకోమని చెప్పండి. వెంటనే మీ వాణ్ణి వదిలేస్తాను"




"సార్..." అంటూ ఏదో అనబోయాడు చైతన్య.

"చూడు నాన్నా! మీ అన్నయ్యకి ఏం ప్రమాదంలేదు. రేపు ఉదయాన్నే క్షేమంగా ఇంటికి పంపించేస్తాను. నువ్వు ఈ రాత్రికి హాయిగా నిద్రపో... వెళ్లు" అన్నాడు ఇన్స్పెక్టర్.

చైతన్య కదలకుండా అక్కడే నిలబడి ఉండిపోయాడు. దాంతో ఇన్స్పెక్టర్ కోపం కపాలానికి చేరుకుంది.

"రేయ్... ముందు వీణ్ణి లోపల వేసే యండ్రా" అన్నాడు కానిస్టేబుల్స్‌తో రమేష్ వైపు చూపిస్తూ.

"నువ్వేంటి? ఇంకా ఇక్కడే నిలబడి ఉన్నావు. వెళ్లు. వెళ్ళిక్కడినుంచి" గర్జిస్తున్న ట్టుగా అన్నాడు ఇన్స్పెక్టర్?

చైతన్య భారంగా స్టేషన్ నుంచి బయ టకు వచ్చి రోడ్‌పై నిలబడి ఏం చెయ్యాలా అని ఆలోచించాడు. అతనికి ఒకే ఒక మార్గం కనిపిస్తోంది. ఎలాగయినా సింధు కంప్లైంట్ వాపస్ తీసుకొనేలా చెయ్యాలి అనుకొని సింధు ఇంటివైపుగా నడక ప్రారం భించాడు.

★ ★ ★

చైతన్య సింధు ఇంటికి చేరుకున్నాడు. చైతన్యను చూడగానే ఏం జరిగి ఉంటుందో అర్థం అయ్యింది శ్రీనివాస్‌కి.

"సింధూ! అన్నయ్య మీ అమ్మా, నాన్నని కిడ్నాప్ చేశాడని కేసుపెట్టావా?" స్ట్రయి ట్‌గా ప్రశ్నించాడు చైతన్య.

"నీకు ఎవరిమీదయినా అనుమానం ఉందా అని పోలీసులు అడగగానే రమేష్ పేరు చెప్పాను. కానీ తప్పుచేశానని ఇప్పుడు బాధపడుతున్నాను" బాధగా అంది సింధు.

"సింధూ... నీకు అన్నయ్య గురించి బాగా తెలుసు. మాట రేష్‌గా ఉంటుంది కానీ వాడి ఆలోచనలు ఇంత దారుణంగా ఉండవు. అది తెలిసి కూడా నువ్వు ఎలా కంప్లైంట్ ఇవ్వగలిగావు?"

"చెప్తున్నాను కదా! నేను తప్పుచేశానని ఇప్పుడు బాధపడుతున్నాను. అయినా వెంటనే పోలీస్ స్టేషన్‌కి ఫోన్ చేసి నాకు రమేష్‌మీద అనుమానం లేదు యశ్వంత్ మీద అనుమానం ఉందని చెప్పాను"

"పోలీసులు ఇందాక ఇంటికి వచ్చి అన్న య్యని స్టేషన్‌కి తీసుకొని వెళ్ళారు. నువ్వు వచ్చి కంప్లైంట్ విత్‌డ్రా చేసుకుంటేనే అన్న య్యని వదులుతారట. లేకపోతే రేపు ఉదయం వరకు వాడిని సెల్‌లోనే ఉంచు తారట. ఈ రాత్రికి వాడు అక్కడే ఉంటే రేపు వాణ్ణి ఏ పరిస్థితిలో చూడాల్సివస్తుందో నని భయంగా ఉంది" ఇంచుమించు ఏడు స్తున్నట్టుగా అన్నాడు చైతన్య.

సింధు ఏం మాట్లాడలేదు.

"ప్లీజ్... సింధూ నాకోసం ఈ పని చేయవా! ఒకవేళ మీ అమ్మా, నాన్న కని పించకుండా పోవటంలో మా వాడి పాత్ర ఏదయినా ఉంటే నేను తప్పకుండా తెలుసు కుంటాను. అంతేకాదు మీ వాళ్లని నీకు అప్పగించే బాధ్యత కూడా నాదే. ప్లీజ్ సింధూ దయచేసి కంప్లైంట్ వాపస్ తీసుకో... ప్లీజ్" ప్రాధేయపడ్డాడు చైతన్య.

"పద... నేను కంప్లైంట్ విత్‌డ్రా చేసు కుంటాను" అంది సింధు.

చైతన్య ముఖంలో నవ్వు విరిసింది. ముగ్గురూ స్టేషన్ చేరుకోవటానికి ఐదు నిముషాలు పట్టింది.

"ఏంటమ్మా నువ్వు ఇలా వచ్చావు?" సింధుని ప్రశ్నించాడు ఇన్స్పెక్టర్.

"నేను కంప్లైంట్ విత్‌డ్రా చేసుకుంటాను సార్" చెప్పింది సింధు.

"విత్‌డ్రా చేసుకొంటున్నావా? ఏం మీ అమ్మ నాన్న వచ్చేసారా?"

"లేదుసార్. కానీ రమేష్ వాళ్లను కిడ్నాప్ చేయలేదని నేను నమ్ముతున్నాను సర్. నేను విత్‌డ్రా చేసుకుంటేగాని మీరు అత నిని వదిలిపెట్టరు కదా!"

"ఏంటమ్మా నువ్వు. లోపల అతను

ఇంటరాగేషన్‌లో కిడ్నాప్ చేసినట్టు ఒప్పుకున్నాడు కాకపోతే వాళ్ళను ఎక్కడ దాచిందీ మీ పెళ్ళి అయిన తరువాతగానీ చెప్పనంటున్నాడు. మా వాళ్లు ఆ డిటైల్స్ తెలుసుకునే ప్రయత్నంలోనే ఉన్నారు. ఇప్పుడు మీరు కంప్లైంట్ విత్‌డ్రా చేసుకుంటానంటే ఎలా? ఎలాగయినా రేపటికల్లా అతనితో అన్ని విషయాలూ చెప్పిస్తాం. మీరు ప్రొద్దున్నే రండి" చెప్పాడు ఇన్‌స్పెక్టర్.

"అతను కిడ్నాప్ చేశానని ఒప్పుకున్నాడా? " ఆశ్చర్యంగా అంది సింధు.

"సార్! మా అన్నయ్యతో ఒకసారి మాట్లాడొచ్చా సార్" ప్రశ్నించాడు చైతన్య.

"ఇంటరాగేషన్‌లో ఉన్న వ్యక్తితో మాట్లాడటం కుదరదు. ముందు మీరంతా ఇక్కడి నుంచి వెళ్లిపొండి" గదమాయిస్తున్నట్టుగా అన్నాడు ఇన్‌స్పెక్టర్.

ఇక చేసేదేం లేక ముగ్గురూ బయటకు వచ్చేశారు. ముగ్గురికీ అర్థంకాని విషయం ఒక్కటే. అది రమేష్ నిజంగా కిడ్నాప్ చేశాడా? అని. చెయ్యకపోతే తనే చేశానని ఎందుకు ఒప్పుకున్నట్టు?

"సింధూ నువ్వు నమ్ముతున్నావా? " ప్రశ్నించాడు చైతన్య.

ఆ విషయం నమ్మాలో వద్దో సింధుకి తెలియటంలేదు. అందుకే చైతన్యకు ఏం సమాధానం చెప్పకుండా మౌనంగా ఉండిపోయింది.

"చైతన్యా! ఇపుడు మనం చేయగలిగింది ఏమీలేదు. రేపటి ఉదయం వరకూ ఆగాల్సిందే" అన్నాడు శ్రీనివాస్.

ఈసారి మౌనం వహించటం చైతన్య వంతు అయ్యింది.

"సింధూ! నేను ఇంటికి వెళ్తున్నాను. రేపు ఉదయం వస్తాను. ఈ లోపుగా ఏదైనా అవసరం అయితే ఫోన్ చెయ్యి" అన్నాడు శ్రీనివాస్.

"అలాగే" అంది సింధు.

శ్రీనివాస్, చైతన్య, సింధు ఎవరి దారిన వాళ్లు వెళ్లిపోయారు.

★ ★ ★

ఫోన్ రింగ్ శబ్దానికి నిద్రలోనుండి బయటకు వచ్చాడు శ్రీనివాస్. వాల్ క్లాక్ వైపు చూశాడు. టైము ఏడు గంటలు అయినట్టు సూచిస్తోంది. సింధు అయి ఉంటుందని అనుకొంటూ ఫోన్ తీశాడు.

"హలో" అన్నాడు శ్రీనివాస్.

"ఓయ్ మొద్దు ఇంకా లేవలేదా? ఫోన్ ఎంతసేపు రింగ్ అవుతున్నా తియ్యవేం" అటునుంచి అరుస్తున్నట్టుగా అంది సవిత.

"అది కాదు సవితా!" అంటూ ఏదో మాట్లాడబోయాడు. కానీ సవిత శ్రీనివాస్‌ని మాట్లాడనివ్వలేదు.

"ఏది కాదు. ఇక్కడ నేనేమో నిద్రలేక చస్తుంటే నువ్వు హాయిగా నిద్రపోతున్నావా? నాకు రాత్రంతా ట్రైన్‌లో నిద్రపట్ట లేదు తెలుసా! నువ్వే గుర్తొచ్చావు. అసలు నాలుగు గంటలకు ట్రైన్ దిగిన వెంటనే ఫోన్ చేద్దామనుకొన్నాను. కానీ మంచి నిద్రలో ఉంటావుకదా! డిస్టర్బ్ చేయటం ఎందుకని చేయలేదు. కనీసం ఏడుగంటలకి ఫోన్ చేసినా నిద్రలేవలేదు నువ్వు"

"నేను చెప్పేది విను సవితా! రాత్రి పడుకునేసరికి బాగా లేటయ్యింది"

"ఏం పాపం? ఏం కష్టపడ్డారేంటి తమరు? నేను లేనుకదా అని ఎవరయినా అమ్మాయితో సెకండ్‌షోకి వెళ్లావా? "

"కాదు. 'సింధూ వాళ్ల మదర్, ఫాదర్ కనిపించటంలేదు"

"వ్వాట్... కనిపించటంలేదా? "

"అవును. నిన్న సాయంత్రం ఎవరో సింధూ వాళ్లింటికి ఫోన్ చేసి మీ అమ్మాయికి యాక్సిడెంట్ అయ్యింది. హాస్పిటల్‌లో ఉంది. మీరు వెంటనే రావాలని సింధూ వాళ్ల నాన్నగారికి చెప్పారట. సింధు వాళ్ల అమ్మగారు, నాన్నగారు ఇద్దరూ కలిసి మన కాలేజ్ దగ్గరకు వచ్చారట. అంతే తరువాత ఏమయ్యారో తెలి





యదు"

"పోలీస్ కంప్లైంట్ ఇచ్చారా? "

"ఆ! సింధు కంప్లైంట్ ఇచ్చింది. పోలీసులు నీకు ఎవరి మీదయినా అనుమానం ఉందా అని అడిగితే రమేష్ పేరు చెప్పింది. ప్రస్తుతం రమేష్ సెల్‌లో ఉన్నాడు. తరువాత సింధు మనసు మార్చుకొని కంప్లైంట్ విత్‌డ్రా చేసుకుందామని స్టేషన్‌కి వెళితే రమేష్ వాళ్లని కిడ్నాప్ చేసినట్టు ఒప్పుకున్నాడని ఇన్‌స్పెక్టర్ చెప్పాడు"

"రమేష్... ఒప్పుకున్నాడా? నిన్న ఏ టైమ్‌లో వాళ్ల కిడ్నాప్ జరిగింది? "

"బహుశా ఈవినింగ్ ఫోర్ టు సెవన్ మధ్యలో జరిగి ఉండొచ్చు"

"నిన్న రమేష్ కాలేజ్‌కి వచ్చాడా? "

"వచ్చాడు ఏం? "

"అంటే ఈవినింగ్ ఫోర్ వరకూ కాలేజ్‌లో ఉన్నాడు. తరువాత ఫైవ్ థర్టీనుంచి ఇంచుమించు ఎయిట్ వరకూ నాతోపాటు రైల్వేస్టేషన్‌లోనే ఉన్నాడు. మిగిలిన వన్ అవర్‌లో ఈ పని చేసేటంత నెట్‌వర్క్ రమేష్‌కి ఉందని నేను అనుకోను"

"ఎయిట్ వరకూ నీతోనే ఉన్నాడా? ఎందుకు వచ్చాడు"

"నువ్వు చెప్తే సింధు డెసిషన్ మార్చుకొంటుందట. నువ్వు నా మాటయితే వింటావని నన్ను రిక్వెస్ట్ చేయటానికి వచ్చాడు. నేను నీతో చెప్పనన్నాను. తరువాత నేను ట్రైన్ ఎక్కేవరకూ నాతోపాటే ఉన్నాడు"

"మరి అటువంటప్పుడు తనే ఈ పని చేశానని ఎందుకు ఒప్పుకున్నట్టు? "

"నిజంగా ఒప్పుకున్నాడంటావా? "

"ఒప్పుకోకుండా ఆ ఇన్‌స్పెక్టర్ ఎందుకు చెపుతాడు? "

"ఈ విషయంలో రమేష్ కాకుండా ఎవరి మీదా నీకు అనుమానం రావటంలేదా? "

"యశ్వంత్ మీద అనుమానంగా ఉంది. ఏం? "

"ఓరి మొద్దూ నీ మెదడు పని చేస్తోందా అసలు. వాడు తలుచుకుంటే పోలీస్ వాడితో అబద్ధం చెప్పించటం పెద్ద పనా? "

"అవును. నేను ఆ విషయమే ఆలోచించలేదు"

"అప్పుడే ఆలోచించి డాడీకి ఒక ఫోన్ చేస్తే ప్రాబ్లమ్ సాల్వ్ అయిపోతుంది కదా! డాడీ మధ్యాహ్నాం సింగపూర్ వెళ్తున్నారు. మనం ఏం చేసినా మధ్యాహ్నాం లోపునే చెయ్యాలి. తరువాత డాడీని పట్టుకోవటం కష్టం"

"అయితే ఇప్పుడేం చేద్దాం? "

"ముందు నువ్వు రమేష్ ఉన్న పోలీస్ స్టేషన్ నెంబరు తెలుసుకొని నాకు ఫోన్ చేసి చెప్పు. ఈ లోపున నేను డాడీతో విషయం చెప్తాను" అని సవిత శ్రీనివాస్‌కి తన ఫోన్ నెంబర్ ఇచ్చింది.

"సరే. ఉంటాను" అని ఫోన్ డిస్కనెక్ట్ చేసి హడావుడిగా రడీ అయ్యి పదిహేను నిముషాల్లో సింధూ వాళ్లింటికి బయలుదేరాడు.

★ ★ ★

శ్రీనివాస్, సింధు ఇంటికి చేరుకొనేసరికి ఆమె ఇంటిబయట వాకిలిలో కుర్చీలో కూర్చొని ఆకాశంలోకి చూస్తూ ఏదో ఆలోచిస్తోంది. శ్రీనివాస్ ఆమె దగ్గరకు వెళ్లి ఆమె పరిస్థితి చూసి చలించిపోయాడు.

ఆమె కళ్లు ఎర్రగా అయిపోయి లోపలికి వెళ్లిపోయినట్టుగా ఉన్నాయి. ముఖమంతా పీక్కుపోయి నీరసంగా ఉంది. ఎక్కువ సమయం ఏడ్చినట్టుగా ముఖమంతా ఉబ్బిపోయి ఉంది. ఆమె పక్కనే పిన్ని, బాబాయ్ కూడా నీరసంగా కూర్చొని ఉన్నారు.

"ఏయ్... సింధు ఏంటి ఇలా ఉన్నావు? రాత్రంతా నిద్రపోలేదా? " ప్రశ్నించాడు శ్రీనివాస్.

సింధు మౌనంగా ఉండిపోయింది. అప్పుడప్పుడూ కన్నీరు ఆమె చెంపలపై నుండి నెమ్మదిగా కిందకు జారుతోంది.

"లేదు బాబు. రాత్రి నుంచి తిండీలేదు, నిద్రా లేదు. ఇదిగో ఇలా దిగాలుగా కూర్చునే ఉంది" బాధగా అన్నాడు ఆమె బాబాయ్.

"సింధు, నువ్వు ఇలా దిగాలుగా కూర్చుంటే మనం ఏమీ చెయ్యలేం. లే లేచి ఫ్రెష్ అప్ అవ్వు"

"శ్రీనివాస్! అమ్మానాన్న మళ్లీ నాకు కనిపిస్తారంటావా? " ఆర్ద్రతతో కూడిన గొంతుతో నెమ్మదిగా అడిగింది సింధు. బాధతో మాటలు ముద్దగా వస్తున్నాయి. ఆమె మాటలకు మొట్టమొదటిసారి శ్రీనివాస్ కళ్లల్లో కూడా నీళ్లు తిరిగాయి.

"వాళ్లకేం కాదు. తప్పకుండా నువ్వు వాళ్లని చూస్తావు. ముందు నువ్వు మొహం కడుక్కొనిరా! నీతో మాట్లాడాలి" అన్నాడు శ్రీనివాస్.

"సరే" అని వెళ్లి కొద్దిగా రిఫ్రెష్ అయి వచ్చింది.

"ఇప్పుడేం చెయ్యాలి? " ప్రశ్నించింది సింధు.

"రమేష్‌ని బయటకు తీసుకొని రావటానికి ఒక దారి దొరికింది"

"అంతా రమేష్‌ని బయటకు తీసుకొని రావటం గురించే ఆలోచిస్తున్నారు కానీ అమ్మానాన్నల్ని ఎలా వెతకాలో ఆలోచించటం లేదేంటి శ్రీనివాస్" అతని మాటలు పూర్తికాకుండానే మధ్యలో అంది సింధు.

"సింధూ! నేను చెప్పేది పూర్తిగా విను. రమేష్ నిన్న సాయంత్రం అంతా సవితతోనే ఉన్నాడు. దీనినిబట్టి రమేష్ ఈ కిడ్నాప్ చేసే అవకాశం లేదని తెలుస్తోంది. కాబట్టి ఖచ్చితంగా ఈ పని యశ్వంత్ చేసి ఉంటాడు. సో ముందు మనం రమేష్‌ని బయటకు తీసుకువస్తే యశ్వంత్ టార్గెట్ రమేష్‌గానీ మీ అమ్మానాన్న కాదు కాబట్టి వాళ్లని వదిలేసే అవకాశం ఉంది. అలా కాకుండా మరలా రమేష్‌ని ఏం చెయ్యాలన్నా వాడికి కాస్త టైమ్ పడుతుంది. వాడు ఈ విషయం గురించి ఆలోచించే సమయంలో మనం మీ వాళ్లని వెతకొచ్చు"

"మరి రమేష్‌ని బయటకు తీసుకొని రావటం ఎలా? "

"సవితా వాళ్లు ఫాదర్ ద్వారా! ఇప్పుడు మనం పోలీస్ స్టేషన్‌కి వెళ్లాలి" అని చెప్పి ఫోన్ తీసి చైతన్య ఇంటికి ఫోన్ చేసి చైతన్యని కూడా స్టేషన్‌కి రమ్మని చెప్పాడు.

ముగ్గురూ స్టేషన్‌కి చేరుకొనేసరికి స్టేషన్‌లో ఇన్‌స్పెక్టర్ లేదు. అరగంట తరవాత వచ్చాడు ఇన్‌స్పెక్టర్.

"గుడ్ మార్నింగ్. ఎవరు మీరు? " ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

"అదే సార్! నిన్న రమేష్ అని ఒక అతనిని అరెస్ట్ చేశారు" గుర్తు చేశాడు శ్రీనివాస్.

"ఓ ఆ కేసా! ఏంటిలా వచ్చారు? "

"అతనేమయినా చెప్పాడేమోనని తెలుసుకుందామని"

"అతను ఏమయినా చెప్తే మేమే మీ దగ్గరకు వస్తాంకదా! ప్రస్తుతానికి ఏం చెప్పలేదు. ఇంకా ఇంట్రాగేషన్ జరుగుతోంది. మీరు తరువాత రండి"

"లేదుసార్! నేను కేసు వాపస్ తీసేసుకొంటున్నాను సార్. అతన్ని వదిలేయండి" అంది సింధు.

"ఏం మీ అమ్మానాన్న ఇంటికి రావాలని లేదా? "

"అతన్ని అరెస్ట్ చేసినా వాళ్లు వస్తారని నాకు నమ్మకంలేదు. అందుకే నేను కేసు కంప్లైంట్ విత్‌డ్రా చేసుకుందామనుకొంటున్నాను"

"ఇదేమయినా చిన్న పిల్లలు ఆడుకునే ఆట అనుకొంటున్నావా? నీ ఇష్టం వచ్చినప్పుడు కేసు పెట్టటానికి, ఇష్టం లేకపోతే వాపసు తీసుకోవటానికి. పోలీసు కేసంటే సవాలక్ష ఫార్మాలిటీస్ ఉంటాయి. తరువాత కనిపించు చూద్దాం. అసలే స్టేషన్‌కి డి.జి.పి వస్తున్నాడని మేమంతా టెన్షన్‌లో




ఉంటే మీగోలేంటి. వెళ్లండి... వెళ్లండి" గద మాయించాడు ఇన్‌స్పెక్టర్.

వీళ్ల ముగ్గురికీ మాత్రం స్టేషన్‌లో అటు వంటి ఎట్మాస్ఫియర్ ఏమాత్రం కనిపించ లేదు. అందరూ రిలాక్స్‌డ్‌గా కూర్చొని కబుర్లు చెప్పుకుంటున్నారు. లోపల వస్తువు లన్నీ చిందరవందరగా ఉన్నాయి. 'డి.జి.పి నిజంగా వస్తే ఎట్మాస్ఫియర్ ఇలా ఉంటుందా?' మనసులో అనుకున్నాడు శ్రీనివాస్.

"పదండి. ఇక మనం మామూలుగా మాట్లాడటంవల్ల పని అవ్వదు. సవితా వాళ్ల డాడీతో ఫోన్ చేయించాల్సిందే" వాళ్లకి మాత్రమే వినిపించేలా అన్నాడు శ్రీనివాస్.

మిగిలిన ఇద్దరూ మౌనంగా తలూపారు.

"సరే సార్! మేం వస్తాం" అని చెప్పి ముగ్గురూ బయటకు వచ్చేశారు.

శ్రీనివాస్ సవిత ఇచ్చిన నెంబర్‌కి ఫోన్ చేశాడు.

"హలో" అటువైపు నుంచి వినిపించింది సవిత కంఠం.

"సవితా! నేను"

"ఏంటి శ్రీను... ఇంతలేటు. ఎప్పట్నుంచి వెయిట్ చేస్తున్నానో తెలుసా"

"ఏం లేదు. ముందు ఈ రోజు వదిలేస్తా నన్నాడు కదా! అది కూడా కన్‌ఫర్మ్ చేసు కుంటే బావుంటుంది కదా. అందుకే ఇన్ స్పెక్టర్‌తో మాట్లాడి నీకు ఫోన్ చేస్తు న్నాను. వాళ్ల బిహేవియర్ క్లియర్‌గా తెలి సిపోతోంది. మేము రమేష్‌తో మాట్లాడటా నికే వాళ్లు ఒప్పుకోవటం లేదు. అనుమానం లేకుండా ఇదంతా యశ్వంత్ చేయిస్తు న్నాడు"

"ఆ విషయం నీకు ముందే చెప్పాను నేను. ఇంతకీ స్టేషన్ నెంబర్ చెప్పు. నేను ఆల్‌రడీ డాడీతో విషయం చెప్పాను. నువ్వు నెంబరు చెప్తే ఇక అంతా మనకు ఫేవర్‌గానే జరుగుతుంది"

శ్రీనివాస్ నెంబరు చెప్పాడు.

"సరే అయితే మీరు ఓ ఐదు నిముషాలు ఆగి స్టేషన్‌కి వెళ్లండి"

"అలాగే నువ్వు ఎప్పుడు వస్తున్నావ్"

"ఇప్పుడు బయలుదేరిపోతాను. సాయం త్రానికి అక్కడ ఉంటాను. బై"

"బై" అని ఫోన్ డిస్కనెక్ట్ చేసి బూత్ వాడికి బిల్లు పే చేసి బయటకు వచ్చాడు.

సవిత చెప్పినట్టుగా ఐదు నిముషాలు తరువాత ముగ్గురూ స్టేషన్‌లోకి వెళ్లారు.

"మిమ్మల్ని తరువాత రమ్మన్నానుకదా! అప్పుడే వచ్చేశారేంటి?" ప్రశ్నించాడు ఇన్ స్పెక్టర్. అతని మాటలు పూర్తవుతుండగానే ఫోన్ రింగ్ అయ్యింది.

"ఆ ఫోన్ తియ్యండి. మేమెందుకు వచ్చామో మీకే తెలుస్తుంది" అన్నాడు చైతన్య. ఇన్‌స్పెక్టర్ వీళ్ల వైపు అనుమా నంగా చూస్తూ ఫోన్ లిఫ్ట్ చేశాడు.

"హలో"

"ఎవరు? స్టేషన్ ఇన్‌స్పెక్టరా?" అటు వైపు నుంచి కాస్త గంభీరంగా వినిపించింది స్వరం.

"అవును... నువ్వెవరు?" సిగరెట్ పొగను గాలిలోకి రింగులు రింగులుగా వదులుతూ రెక్‌లెస్‌గా ప్రశ్నించాడు ఇన్‌స్పె క్టర్.

"విజయ ప్రకాష్"

ఆ పేరు వినిపించగానే అతని చేతిలో ఉన్న సిగరెట్ కిందకు జారిపోయింది. కుర్చీలో నిటారుగా కూర్చున్నాడు.

"సార్ గుడ్ మార్నింగ్ సార్. చెప్పండి సార్" చాలా వినయంగా మారిపోయింద తని కంఠం.

"రమేష్ అనే కుర్రాణ్ణి అరెస్ట్ చేశారట. ఆ అమ్మాయి కేసు విత్‌డ్రా చేసుకుంటాననంటే ఒప్పుకోవటం లేదట. ఎవరి హ్యాండ్ ఉంది దీని వెనుక?"

"సార్! ఇది ఎమ్.ఎల్.ఎ రాజేంద్రకుమా ర్‌గారి పర్సనల్ కేసు సార్. ఎట్టి పరిస్థితు

ల్లోనూ ఆ అబ్బాయి బయటకు రాకూడద న్నారు సార్"

"ఎందుకట? "

"ఏమో సార్! అవన్నీ తెలియవు"

"కేసు ఫైల్ చేశారా"

"లేదు సార్"

"అయితే ముందు ఆ కుర్రాణ్ణి విడిచి పెట్టు. ఆ అమ్మాయి రాజేంద్రకుమార్ కొడుకు మీద కంప్లైంట్ ఇస్తుంది. తీసుకొని వాణ్ణి అరెస్ట్ చేయండి. తరువాత ఏం జరిగినా నేను చూసుకుంటాను"

"సరే సర్" అని రిసీవర్ క్రెడిల్ చేశాడు.

"రండి మీరు ఇలా కూర్చోండి. అతనిని నేను పంపిస్తాను" చాలా వినయంగా చెప్పాడు ఇన్‌స్పెక్టర్.

కానిస్టేబుల్స్‌తో రమేష్‌ని బయటకు తీసుకొని రమ్మని చెప్పాడు. సింధు యశ్వంత్ మీద కంప్లైంట్ రాసిచ్చింది.

"ఇప్పుడు మీరు ఎమ్.ఎల్.ఏ కొడుకుని అరెస్టు చేస్తారా? " ప్రశ్నించాడు శ్రీనివాస్.

"అది మీరు చెప్పినంత తేలికకాదు. మీరేమో ఇటువంటి వాళ్ల రికమండేషన్స్‌తో వస్తారు. మిమ్మల్ని కాదంటే ప్రకాష్ గారి దగ్గర వెధవనవుతాను. అలాగని వాడిని పట్టుకుంటే రాజేంద్రగారితో గొడవ. ప్రకాష్ గారి మీద గౌరవంతో ఆయన చెప్పిన పని చెయ్యాలో, రాజేంద్రగారంటే ఉన్న భయంతో ఆయన చెప్పిన పని చెయ్యాలో తెలియటంలేదు. అయినా ఏం చేస్తాం. మా ప్రయత్నం మేము చేస్తాం. వాడెలాగూ మాకు దొరకడు. ఇదే ప్రకాష్‌గారికి చెప్తాం. తరువాత వాళ్లే చూసుకుంటారు" చిన్నగా నిట్టూర్పు విడుస్తూ అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"ఒకవేళ మేం వాడిని పట్టి తీసుకువస్తే మీరు అరెస్టు చేస్తారా? " ప్రశ్నించాడు చైతన్య.

"తప్పకుండా. మాకు రిస్కు తగ్గించిన వారవుతారు"

ఇంతలో ఇద్దరు కానిస్టేబుల్స్ రమేష్‌ని తీసుకొని వచ్చారు. పైకి దెబ్బలేం కనిపించటం లేదుకానీ మనిషి మాత్రం వేలాడిపోయాడు. నడవటానికి కూడా చాలా కష్టపడుతున్నాడు.

"ఏం కంగారు పడకండి. పెద్దగా ఏం కొట్టలేదు. ఇంటికి తీసుకొని వెళ్లి వేడి నీళ్లతో కాపడం పెట్టండి అన్నీ సర్దుకుంటాయి" చెప్పాడు ఇన్‌స్పెక్టర్.

రమేష్ సింధువైపు దీనంగా చూశాడు. అప్పటి వరకూ రమేష్‌ని బాధగా చూస్తున్న సింధు తల పక్కకు తిప్పుకుంది.

శ్రీనివాస్, చైతన్య రమేష్‌ని నెమ్మదిగా నడిపించుకొంటూ స్టేషన్ బయటకు తీసుకువచ్చారు.

"సింధూ నువ్వు ఇంటికి వెళ్లు. నేను రమేష్‌ని వాళ్లింట్లో వదిలి వస్తాను" అన్నాడు శ్రీనివాస్.

"సరే" అని సింధు వెళ్లిపోయింది.

చైతన్య రిక్షాని పిలిచి రమేష్‌ని అందులో కూర్చోబెట్టాడు.



శ్రీనివాస్, రమేష్, చైతన్య, మహేష్, రమేష్ తల్లి పద్మావతి ఉన్నారా గదిలో. పద్మావతి రమేష్‌కి వేడి నీళ్లతో కాపడం పెడుతోంది.





"ఈ ప్రేమలూ, దోమలూ మనకెందుకు చెప్పు. ముందే వద్దురా అని చెప్పాను. విన్నావుకాదు. ఇప్పుడు చూడు నిన్ను ఏ స్థితికి తీసుకు వచ్చిందో" నెమ్మదిగా అనునయిస్తున్నట్టుగా చెప్పింది పద్మావతి.

"అమ్మా! కాపడం పెడితే పెట్టు. లేకపోతే మానెయ్. అంతేగానీ నన్ను చంపకు" చాలా కోపంగా అన్నాడు రమేష్.

"తన్నులు తిన్నా ఇంకా పొగరేం తగ్గలేదు. ఈ పొగరే ఇంతవరకూ తెచ్చింది"

"నాది పొగరు కాదు. నా మీద నాకున్న నమ్మకం. అందరికీ అది పొగరులా కనిపించొచ్చు. ఆ నమ్మకమే లేకపోతే మనిషి బతకటం అనవసరం"

"ఎంత నమ్మకం ఉన్నా సమయానికి తగినట్టు నడుచుకోవాలి. అంతేగానీ ప్రతీ పనిలోనూ మొండిగా పోతే ఇదిగో ఇలాగే జరుగుతుంది"

"అమ్మా! నన్ను కొద్దిసేపు ప్రశాంతంగా ఉండనివ్వు. నాకు ఆకలేస్తోంది. ముందు తినటానికి ఏదయినా చెయ్యి వెళ్లు"

"వెళ్తాను. కానీ నువ్వు మళ్లీ ప్రేమ అంటూ ఆ అమ్మాయి వెనుక తిరిగితే మాత్రం ఊరుకోను" కోపంగా అంది పద్మావతి.

"సరేలే. నువ్వు ముందు వెళ్లమ్మా"

పద్మావతి బయటకు వెళ్లిపోయింది. రమేష్ మంచంపై లేచి కూర్చున్నాడు.

"శ్రీనివాస్! నిజంగా నేనీ పని చేయలేదు" ఎప్పుడూ లేనిది వాళ్లకు సంజాయిషీ చెప్తున్నట్టుగా అన్నాడు రమేష్.

"అది మాకు తెలుసు. నిన్న ఈవినింగ్ అంతా నువ్వు రైల్వే స్టేషన్‌లోనే ఉన్నావని నాకు సవిత ఫోన్ చేసి చెప్పింది. లేకపోతే మేం కూడా నిన్నే అనుమానించే వాళ్లం"

"ఎందుకు అందరూ నన్నే అనుమానిస్తున్నారు"

"అలా అందరూ నిన్ను అనుమానించేలా నువ్వే చేసుకున్నావు. కాలేజ్‌లో అందరి ముందూ శపథం చేశావుగా అదే దీనికంతటికీ కారణం"

"నాకు సింధు అంటే ఎంత ఇష్టమో మీ అందరికీ తెలుసు. సడన్‌గా ఆమె నన్ను మరిచిపో అంటే ఎలా తట్టుకోగలను. కోపం వచ్చేసింది. ఆ కోపంలో ఏదో అనేశాను. అంతేగానీ ఆవేశంలో అన్న ప్రతీ పనీ చేసేస్తాననుకుంటే ఎలా? "

"నువ్వు ఇలాగే ప్రతీ పనీ ఫాస్ట్‌గా చేసేసి పీకల మీదకు తెచ్చుకుంటావు. ముందే నీకు చెప్పాను సింధు నీకు సరిపడదురా అని" అన్నాడు చైతన్య.

"అందరూ ఇదేమాట. సింధు నీకు సరిపడదు. సరిపడదు. ఏం నన్ను చేసుకుంటే తనెందుకు అంత కష్టపడిపోతుంది. నేను అంత వెధవనా? " ఆవేశంగా ప్రశ్నించాడు రమేష్.

"నువ్వు మంచివాడివే. సింధు నీకు సరిపడదు అంటే నీ వల్ల సింధు కష్టాలు పడుతుందని ఎందుకు అనుకొంటున్నావ్. సింధువల్ల నువ్వు కష్టాలు పడొచ్చుకదా" ప్రశ్నించాడు శ్రీనివాస్.

"సింధు వల్ల నేను కష్టాలు పడతానా? " ప్రశ్నార్థకంగా మొహం పెట్టి ప్రశ్నించాడు రమేష్.

"అవును, నీ సైడ్ నుంచి నీ క్యారెక్టరు కరెక్టు. తన కారెక్టరు రాంగ్. ఆమె సైడ్ నుంచి ఆమె కారెక్టర్ కరెక్టు. నీ కారెక్టరు రాంగ్"

"అర్థం కాలేదు"

"నువ్వు ఎటువంటి విషయమయినా స్ట్రెయిట్‌గా చెప్తావు. తనేమో ప్రతీ విషయం గురించి చాలా సీరియస్‌గా ఆలోచిస్తుంది. నువ్వు చిన్న మాట అన్నా తను బాధపడిపోతుంది. అది చూసి నీకే విసుగు పుడుతుంది. నువ్వు ఏ రోజయినా పొరపాటున చెయ్యి చేసుకుంటే తను ఆత్మహత్య చేసుకున్నా ఆశ్చర్యపోనక్కరలేదు. అప్పుడు మీ ప్రేమే మిమ్మల్ని బలితీసుకున్నట్టు అవు



తుంది"

"లేదు, ఆమె మీద నాకు ప్రేమ ఉంది. నేను అడ్జస్ట్ అవగలను"

"మీ ఇద్దరి ప్రేమా ఎంత గొప్పదయినా అడ్జస్ట్ అవుతూ కలిసి బతకటం అన్నది కొంతవరకే. అది ఒకరోజు కావచ్చు, ఒక నెల కావచ్చు, ఒక సంవత్సరం కావచ్చు. అంతేగానీ జీవితాంతం అడ్జస్ట్ అవుతూ బతకడం అన్నది జరగని పని"

"ఒకే మేం ప్రేమించుకోవటంలో తొందర పడ్డాం. ఒప్పుకుంటాను. అందరూ నన్నే ఆవేశపరుణ్ణి అంటున్నారుకదా! మరి ఇప్పుడు సింధు చేసిన పనేమయినా బావుందా. నా గురించి అంతా తెలిసి కూడా ఎలా కంప్లైంట్ ఇవ్వగలిగింది? "

"నువ్వు సింధూ వాళ్ల నాన్నగారు పెళ్లికి ఎందుకు ఒప్పుకోలేదని తనని అడిగినపుడు ఎందుకు చెప్పలేదో తెలుసా! ఆ విషయం చెపితే నువ్వు బాధపడతావని. నువ్వేం చేశావు. ఆమె ఎదుటే వాళ్ల అమ్మానాన్నని చంపయినా పెళ్లిచేసుకుంటానన్నావు. ఆ ఒక్క మాటా చాలు ఆమెకు నీపై ఉన్న ప్రేమంతా చెదిరిపోవటానికి. తను నీకు ముందే చెప్పింది. తన తల్లితండ్రుల తరువాతి స్థానం నీదని. ఆ ప్రేమే ఆమెను కంప్లైంట్ చేసేలా చేసింది. ఆమెకు తల్లి తండ్రులపై ఉన్న ప్రేమను చూసి నువ్వు గర్వపడాలి. అంతేగానీ తల్లితండ్రులకన్నా ఎక్కువగా నిన్ను ఇష్టపడాలని నువ్వు కోరుకోవటం మూర్ఖత్వమే అవుతుంది"

అంటూ ఇంకా ఇలా నచ్చచెప్పాడు శ్రీనివాస్ "చూడు రమేష్! ప్రేమనేది ఒక క్షణంలోనో ఒక రోజులోనో, ఒక నెలలో కలిసి మెలిసి తిరిగితేనో పుట్టడం ఆశ్చర్యంకాదు. ఎందుకంటే అప్పుడు ఇద్దరూ ఒకరి స్వభావాన్ని ఒకరు అర్థం చేసుకోగలమా, సర్దుబాటు చేసుకోగలమా అని ఆలోచించేంత తీరిక లేని ఆకర్షణలో కొట్టుకుపోతారు ప్రేయసీప్రియులు. అలాగే సింధు నిన్ను ప్రేమించింది నువ్వు సింధుని ప్రేమించావు. నువ్వు సింధును చేసుకోనా వద్దా అని ఆలోచించే అవసరం లేదు. ఎందుకంటే సింధు శాంత స్వభావురాలు. కానీ సింధు నిన్ను గురించి ఆలోచించే ఎన్నో సంఘటనలు ఈ కొద్ది రోజులలోనే ఆకళింపు చేసుకుంది నీ విషయంలో. ఆవేశపరుడు ఎంత చెప్పినా సౌమ్యత వహించలేడు. సౌమ్యుని ఎంత ప్రేరేపించినా ఆవేశపరుడు కాలేడు. అందుకే సింధు మీ ఇద్దరి స్వభావాలూ కలవ్వని నిర్ణయించుకొంది. జీవితాంతం సమాంతర రేఖల్లా బతికేకన్నా ఆదిలోనే తనకు నచ్చిన స్వభావంగల వ్యక్తిని ఎన్నుకుంటే సుఖపడగలననుకుంది సింధు. ఆలోచిస్తే ఇందులో నీకూ తప్పు కనిపించదు. ప్రేమంటే ఆకర్షణే కాదు, ఆజన్మాంతం అవినాభావ సంబంధాన్నివ్వగల శక్తి" అంటూ ముగించాడు శ్రీనివాస్.

శ్రీనివాస్ మాటలకు ప్రతిగా రమేష్ ఏం మాట్లాడలేకపోయాడు. అతనికి కూడా తప్పు చేస్తున్నానేమోననే ఫీలింగ్ ప్రారంభమయ్యింది. కానీ ఇప్పుడు సింధుని మరిచిపోవటం కూడా సులభం కాదు. మరి ఇప్పుడు ఏం చెయ్యాలి" అని ఆలోచించసాగాడు.

సింధు ఆలోచనలో పడి ఆమె తల్లిదండ్రుల విషయమే మరిచిపోయాడు రమేష్.

"రేయ్ ఇప్పుడు నువ్వు ఆలోచించాల్సింది సింధు గురించి కాదు. ఆమె తల్లి తండ్రుల గురించి. నీ వల్లే వాళ్లు కిడ్నాప్ చేయబడ్డారు. కాబట్టి వాళ్లని వెతికి తీసుకొని వచ్చి సింధుని అప్పగించాల్సిన బాధ్యత కూడా నీదే" అన్నాడు చైతన్య.

"అయితే ఇప్పుడేం చేద్దాం" ప్రశ్నించాడు రమేష్.

"ప్రస్తుతానికి నువ్వు రెస్ట్ తీసుకో. మేం ముగ్గురం బయటకు వెళ్లి అరగంటలో వస్తాం. ఏం చెయ్యాలన్నది తరువాత ఆలోచిద్దాం" అని రమేష్ తిరిగి మాట్లాడే ఛాన్స్




ఇవ్వకుండా చైతన్యని, మహేష్‌ని బయటకు లాక్కొని వచ్చేశాడు శ్రీనివాస్.

"ఏంట్రా! ఎక్కడికి వెళ్లాలి మనం?" ప్రశ్నించాడు చైతన్య.

"ఎక్కడికీ వెళ్లనక్కర్లేదు. మీ వాడు ప్రస్తుతం కదిలే పరిస్థితిలో లేడు. వాడి ముందు నువ్వు అలా మాట్లాడితే మళ్లీ ఆ యశ్వంత్ మీదకి బయలుదేరతాడు. అది రమేష్ ప్రాణానికే ప్రమాదం. కాబట్టి ఇక ఏం చేసినా మన ముగ్గురమే చెయ్యాలి"

"సరే" అన్నారు చైతన్య, మహేష్.

ముగ్గురూ మరలా రమేష్ ఉన్న గదిలోకి వెళదామని వెనక్కి తిరిగేసరికి గుమ్మంలో రమేష్ నిలబడి ఉన్నాడు.

"శ్రీనివాస్... నేను చేసిన తప్పును దిద్దు కోవటానికి నాకు ఉన్న ఈ ఒక్క అవకా శాన్ని నన్ను వినియోగించుకోనివ్వరా" దీనంగా ప్రశ్నించాడు రమేష్.

"అదికాదు రమేష్... నువ్వు ఈ పరిస్థి తిలో"

"ఏం పరవాలేదు. ఈ నొప్పిని నేను ఓర్చుకోగలను. ఈ విషయంలో నయినా నా మాట వినండి"

శ్రీనివాస్ ఏమీ మాట్లాడలేకపోయాడు.

ఇంతలో పద్మావతి హడావుడిగా వీళ్లున్న చోటకి వచ్చింది. ఆమె ముఖంలో ఆందో ళన స్పష్టంగా తెలుస్తోంది.

"ఏంటమ్మా? ఏం జరిగింది? ఎందుకలా ఉన్నావు?" ప్రశ్నించాడు రమేష్.

"నీ కోసం మళ్లీ పోలీసులు వచ్చార్రా" చెప్పింది పద్మావతి.

ఆ మాట వినగానే నలుగురికీ మెదడు మొద్దుబారిపోయింది. ఇది బహుశా యశ్వంత్ వేసిన మరో ఎత్తుగడ అయి ఉంటుందని అనుకొన్నారు. అంటే వాడు తమకంటే ఫాస్ట్‌గా ఆలోచిస్తున్నాడన్న మాట. అనుకొంటూనే నలుగురూ బయ టకు వచ్చారు.

"వాట్ ఇన్‌స్పెక్టర్. ఆ అమ్మాయి కంప్లైంట్ విత్‌డ్రా చేసుకుంది కదా! మళ్లీ ఎందుకు వచ్చారు?" ప్రశ్నించాడు చైతన్య.

"ఇప్పుడు కేసు పెట్టింది ఆ అమ్మాయి అమ్మానాన్న" చెప్పాడు ఇన్‌స్పెక్టర్.

ఇన్‌స్పెక్టర్ చెబుతున్నదేమిటో అక్కడ ఎవరికీ అర్థం కాలేదు. సింధు వాళ్ల అమ్మా నాన్న కేసు పెట్టటం ఏమిటి? అసలు వాళ్లె పుడు వచ్చారు?

"అంటే వాళ్లు ఇంటికి వచ్చేశారా?" ఆశ్చ ర్యపోతూ ప్రశ్నించాడు రమేష్.

"ఏంటంత ఆశ్చర్యపోతున్నావ్? నువ్వు వాళ్లనింకా విడిచిపెట్టలేదా"

"నేను విడిచిపెట్టటమేంటి ఇన్‌స్పెక్టర్. అసలు ఈ గొడవతో నాకు సంబంధం లేదని చెపుతున్నానుగా! అయినా వాళ్ళు తిరిగివస్తే వాళ్ళే చెపుతారుగా ఈ పని ఎవరు చేశారో" అన్నాడు రమేష్.

"అయినా ఇదంతా ఎమ్.ఎల్.ఏ. రాజేం ద్రకుమార్ చేస్తున్నారని మీరేకదా ఇంతకు ముందు ప్రకాష్‌గారితో చెప్పారు. మళ్ళీ ఇదేంటి?" ప్రశ్నించాడు శ్రీనివాస్.

"బాబూ మీరందరూ ఏవో కలలు గంటు న్నట్టు ఉన్నారు. నేను ప్రకాష్‌గారితో చెప్పటం ఏమిటి? అసలు అంత పెద్ద బిజి నెస్ మాగ్నెట్ నాతో ఎలా మాట్లాడతాడని అనుకొంటున్నారు మీరు. ఇతనే ఈ పని చేసుంటాడనటానికి బలమైన ఆధారాలు దొరికాయి. అందుకే ఇతనిని అరెస్టు చేస్తున్నాం. ఇతనిని మీరు కాపాడుకోవా లంటే కిడ్నాప్ అయిన వ్యక్తులు తిరిగిరా వటం తప్ప వేరే మార్గం లేదు"

"అంటే వాళ్లింకా రాలేదా? అటువంట ప్పుడు వాళ్ళు నామీద కేసు ఎలా పెట్టారు" ప్రశ్నించాడు రమేష్.

"ఆ అమ్మాయి తండ్రి స్వయంగా రాసిన లెటర్ ఒకటి ఈరోజు స్టేషన్‌కి వచ్చింది. ఆ లెటర్‌మీద ఉన్నది ఆయన దస్తూరీనే అని నిర్ధారించుకున్న తరువాతే నిన్ను అరెస్టు చేయటానికి వచ్చాం" అని ఆ లెటర్

తాలూకు జిరాక్స్ కాపీ అందించాడు.

రమేష్ ఆ లెటర్ ఓపెన్ చేసి చదివాడు.

ఇన్‌స్పెక్టర్‌గారికి,

నా పేరు సత్యనారాయణ. మేం ఈ ఊరిలో డి.నెం. 2-33/2 నెంబరు గల ఇంట్లో ఉంటున్నాం. నా కూతురి పేరు సింధు. ఆమె పక్క ఊరి కాలేజ్‌లో బి.యస్.సి. చదువుతోంది. ఈ ఊరికే చెందిన రమేష్ అనే కుర్రాడు అదే కాలేజీలో ఎమ్.ఎస్.సి. చదువుతున్నాడు. మా అమ్మాయి, ఆ అబ్బాయి ప్రేమించుకున్నారు. పెళ్ళి కూడా చేసుకోవాలనుకొన్నారు. అందుకు నేను ఒప్పుకోలేదు. నాపై గౌరవంతో మా అమ్మాయి అతనితో తనని మరిచిపొమ్మని చెప్పింది. కానీ అతను అందుకు ఒప్పుకోక అందరిలోనూ నా కూతురిని నిందించటమేకాక నాకు ఫోన్ చేసి ఈ పెళ్ళికి నేను ఒప్పుకోకపోతే నన్ను చంపుతానని బెదిరించాడు. కాబట్టి ఇకమీదట నాకు ఎటువంటి అపాయం జరిగినా అందులో అతని ప్రమేయం ఉండగలదని భావిస్తున్నాను. కాబట్టి తమరు ఈ విషయంలో నాకు సహకరించగలరని భావిస్తున్నాను.

ఇట్లు

తమ విధేయుడు,

సత్యనారాయణ

ఆ లెటరు చదివి రమేష్ శిలలా ఉండిపోయాడు. అసలు నేను ఆయనకి ఎప్పుడు ఫోన్ చేశాను? ఆయనని ఎప్పుడు బెదిరించాను? ఖచ్చితంగా ఇది కూడా యశ్వంత్ పని అనుకున్నాడు రమేష్.

"ఇప్పుడేమంటావు మిస్టర్ రమేష్?" ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

"ఇదంతా ఎవరో ప్లాన్డ్‌గా చేయిస్తున్నారు. నేను అసలు ఆయనకు ఎప్పుడూ ఫోన్ చెయ్యలేదు సార్. నన్ను నమ్మండి" ప్రాధేయపడ్డాడు రమేష్.





"మా నమ్మకంతో ఏం పని జరగదు. ముందు స్టేషన్‌కి నడు"

రమేష్ పోలీసుల్ని అనుసరిస్తూ దీనంగా మిగిలిన వాళ్ళవైపు చూశాడు. అందరూ అతనివైపు జాలిగా చూడటం తప్ప ఏమీ చేయలేకపోయారు.

తరువాత శ్రీనివాస్ ఏమాత్రం ఆలస్యం చేయలేదు. లోపలకు పరిగెత్తుకొని వెళ్ళి ఫోన్‌తీసి సవిత ఇచ్చిన నెంబర్ డయల్ చేశాడు.

ఎలాగయినా సవితా వాళ్ళ ఫాదర్‌తో చెప్పి యశ్వంత్‌తో మాట్లాడించాలన్నది అతని ప్లాను.

చాలాసేపు రింగ్ అయినా తరువాత లిఫ్ట్ చేశారు ఫోను.

"హలో..." ఎవరిదో మగగొంతు వినిపించింది అటువైపునుంచి.

"అక్కడ సవిత ఉంటే ఒక్కసారి పిలుస్తారా?" రిక్వెస్ట్ చేశాడు శ్రీనివాస్.

"లేదండి. సవిత బయలుదేరిపోయిందండి"

"థాక్సండి" అని చెప్పి లైన్ కట్‌చేసి సవితా వాళ్ళింటికి ఫోన్ చేశాడు. కానీ అక్కడ ఎవరూ ఫోన్ లిఫ్ట్ చేయలేదు. తరువాత సింధుకి ఫోన్ చేశాడు.

"హలో..." అటువైపునుంచి వినిపించింది సింధు గొంతు.

"సింధూ! నేను శ్రీనివాస్‌ని. ఆ లెటర్‌లో ఉన్నది నిజంగా మీ నాన్నగారి దస్తూరీయేనా?"

"అవును. ఇన్‌స్పెక్టర్ వచ్చి నాన్న రైటింగ్ ఉన్న పుస్తకం ఏదో ఒకటి ఇమ్మన్నాడు. నేను ఇచ్చాను. తరువాత నాకు లెటర్ గురించి చెప్పి రైటింగ్ కంపేర్ చేసుకున్నాడు"

"అయితే మీ అమ్మగారు, నాన్నగారు హండ్రెడ్ పర్సెంట్ యశ్వంత్ దగ్గరే ఉన్నారు"

"నేను, చైతన్య మీ ఇంటికి వస్తాం. ఈరోజు రాత్రిలోపు వాళ్ళని మీ ఇంటికి

తీసుకువచ్చే బాధ్యత మాది. నువ్వు ఏం కంగారుపడకు"

"సరే"

"ఉంటాను" అని ఫోన్ డిస్కనెక్ట్ చేసి మళ్ళీ సవితా వాళ్ళింటికి ఫోన్ చేశాడు. మరలా సేమ్ రెస్పాన్స్.

శ్రీనివాస్ రిసీవర్ క్రెడిల్ చేసి చైతన్య, మహేష్‌లతో కలిసి సింధు ఇంటికి బయలుదేరాడు.

శ్రీనివాస్, చైతన్య, మహేష్, సింధు ఇంటికి చేరుకునేసరికి అక్కడ సింధు వాళ్ళ పిన్ని మాత్రమే ఉంది.

"ఆంటీ! సింధు లేదా? " ప్రశ్నించాడు శ్రీనివాస్.

"లేదు బాబు. వాళ్ళ అమ్మా, నాన్న యశ్వంత్ అని ఎవరి దగ్గరో ఉన్నారట. అతనితో మాట్లాడాలని తను, వాళ్ళ బాబాయ్ వెళ్ళారు" చెప్పిందావిడ.

"యశ్వంత్. ఇంటికా? " ఆశ్చర్యంతో ఒకే సారి అన్నారు ముగ్గురూ.

"అవును. మీరు వస్తే ఇక్కడే ఉండమని చెప్పమంది. ఏదయినా అవసరం అయితే ఫోన్ చేస్తానంది"

శ్రీనివాస్ ఏం చెయ్యాలా అన్న ఆలోచనలో పడ్డాడు. తను ఇక్కడ ఉండటం మంచిదా, సింధుకోసం యశ్వంత్ ఇంటికి వెళ్ళటం మంచిదా అనేది నిర్ణయించుకోలేక పోతున్నాడు తను.

ఎలాగయినా సింధు వాళ్ళ ఫాదర్‌ని పట్టుకొని రమేష్‌ని బయటకు తీసుకురావాలన్నది అతని ప్లాను. టైమ్ ఆల్ రెడీ పన్నెండుగంటలు అవుతోంది. ఇప్పుడు సింధుకోసం వెళితే సింగపూర్ వెళ్ళేలోపు సవితావాళ్ళ ఫాదర్‌ని పట్టుకోవటం కష్టమవుతుంది. ఇలా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు.

"మహేష్! నువ్వు ఎలాగూ ఇంటికి వెళతావుకదా! అలా యశ్వంత్ ఇంటికి వెళ్ళి సింధూవాళ్ళు తిరిగి బయలుదేరే వరకూ వాళ్ళతోనే ఉండు. ఏ అవసరం వచ్చినా వెంటనే ఫోన్ చెయ్యి" చెప్పాడు శ్రీనివాస్.

"అలాగే" అని మహేష్ వెళ్ళిపోయాడు.

తరువాత శ్రీనివాస్ అక్కడే కూర్చొని ప్రతీ పదినిమిషాల కొకసారి సవితా వాళ్ళింటికి ఫోన్ చేస్తూనే ఉన్నాడు. కానీ ఎవరూ ఫోన్ లిఫ్ట్ చేయటం లేదు.

చైతన్యకి మాత్రం చాలా టెన్షన్‌గా ఉంది. ఎంత త్వరగా వీలయితే అంత త్వరగా రమేష్‌ని బయటకు తీసుకొని రావాలని ఆలోచిస్తున్నాడు. ఎక్కువ సమయం స్టేషన్‌లోనే ఉంటే అన్నయ్యని ఏ పరిస్థితిలో చూడాల్సివస్తుందోనని అతని భయం.

★ ★ ★

యశ్వంత్ ఇంటిలో అతనికి ఎదురుగా కూర్చొని ఉన్నారు సింధు, ఆమె బాబాయ్.

"ఇలా వచ్చారేంటి? " ప్రశ్నించాడు యశ్వంత్.

"మా అమ్మా, నాన్న నీ దగ్గర ఉన్నారేమోనన్న అనుమానంతో నీ దగ్గరకు వచ్చాం" వచ్చిన కారణాన్ని స్ట్రయిట్‌గా చెప్పేసింది సింధు.

"ఊ... నీ అనుమానం కరెక్టే. వాళ్ళు నా దగ్గరే ఉన్నారు అయితే? "

"ప్లీజ్... వాళ్ళను పంపించేయవా? " చాలా దీనంగా ప్రశ్నించింది సింధు.

"తీసుకువచ్చింది పంపించేయటానికా? " నవ్వుతూ అన్నాడు యశ్వంత్.

"ప్లీజ్... యశ్వంత్. అయినా నీ కోపం రమేష్‌మీదే కానీ నా మీద కాదుకదా! మరి మా అమ్మా నాన్నను బాధపెట్టడం ఎందుకు? "

"చూడు సింధూ! నిన్నుగానీ, మీ వాళ్ళను గానీ బాధపెట్టడం నా ఉద్దేశం కాదు. కేవలం రమేష్‌మీద ప్రతీకారం తీర్చుకోవటం కోసమే నీ అమ్మా నాన్నను తీసుకొని రావాల్సివచ్చింది. వాళ్ళను బాధపెడుతున్నానని నువ్వు అంటున్నావు. కానీ వాళ్ళు మీ ఇంటి దగ్గరకంటే ఇక్కడే చాలా సుఖంగా

ఉన్నారు. ఎ.సి. రూమ్, కలర్ టివి, టైమ్‌కి తిండి, ఇంతకంటే ఏం కావాలి వాళ్ళు హ్యాపీగా ఉండటానికి? "

"నేను ఒకసారి అమ్మా నాన్నతో మాట్లాడొచ్చా? "

"అలాగే! పద" అని యశ్వంత్ వాళ్ళిద్దరినీ సింధు అమ్మా, నాన్న ఉన్న గదికి తీసుకుని వెళ్ళాడు.

ఆ గదిలో సింధు అమ్మా, నాన్న మంచంపై దిగాలుగా కూర్చొని ఉన్నారు. వాళ్ళను చూడగానే సింధుకి దుఃఖం ఆగలేదు. ఏడుస్తూ పరిగెత్తుకొంటూ వెళ్ళి తల్లిని గట్టిగా కౌగలించుకొంది.

"ఏయ్... సింధూ. ఏడుస్తున్నావెందుకు? ఇప్పుడేమయిందని? మేం బాగానే ఉన్నాం కదా! ఊరుకో" ఓదార్చింది సింధు తల్లి పార్వతి.

"అమ్మా... నన్ను క్షమించండి. ఇంకెప్పుడూ ఇలాంటి పనిచేయను. నేను బావనే పెళ్ళి చేసుకుంటాను. ఛీ... నావల్లే అన్ని కష్టాలూ వచ్చాయి" వెక్కి వెక్కి ఏడుస్తూనే అంది సింధు.

"అయిపోయిన దాని గురించి ఎందుకు? ఆ విషయాలన్నీ మరిచిపో. నువ్వు ఏడిస్తే నేను చూడలేను సింధూ. నవ్వు" అన్నాడు ఆమె తండ్రి సత్యనారాయణ.

"నాన్న..." అంటూ ఏదో అనబోయింది సింధు. యశ్వంత్ ఆమె మాటలకు అడ్డుపడ్డాడు.

"సింధు... బయటకు పద" ఆర్డర్ చేశాడు యశ్వంత్.

సింధు భారంగా ఆ గదిలోనుండి బయటకు వచ్చింది.

"మాట్లాడావుకదా! ఇక వెళ్ళు" అన్నాడు యశ్వంత్.

"రమేష్‌ను ఆల్‌రడీ స్టేషన్‌లో పెట్టి కొట్టించావుకదా! నీ కసి తీరిపోయిందిగా. ఇక అమ్మా నాన్నల్ని పంపించేయవా? "

"నిన్నటివరకూ వాడి కాలో, చెయ్యో విరవాలని మాత్రమే ఉండేది. అందుకే మొదట కేసు ఫైల్ చేయనివ్వలేదు. కానీ తరువాత ఆలోచిస్తే వాడికది సరిపోదని అనిపించింది. అందుకే ఈసారి కేసు ఫైల్ చేయించాను. కేసు కోర్టుకి వెళ్ళిన తరువాత మీ అమ్మా, నాన్నలను నేనే తీసుకొచ్చి నీకు అప్పగిస్తాను"

"అమ్మా, నాన్న బయటకు రాకుండా కేసు కోర్టుకి ఎలా వెళ్తుంది? "

"ఓసి పిచ్చిదానా! ఆమాత్రం నాకు తెలియదంటావా? మీ వాళ్ళు ఈరోజు నా దగ్గర ఉంటారు. రేపు బయటకు వచ్చి పోలీస్‌స్టేషన్‌లో కేసు పెట్టినట్టు పోలీసులు రాస్తారు. కానీ అప్పుడు కూడా వీళ్ళు నా దగ్గరే ఉంటారు. కేసు కోర్టుకి వెళ్ళినరోజున వీళ్ళను నేనే కోర్టుకి తీసుకువచ్చి సాక్ష్యం చెప్పించి ఇంటికి పంపుతాను"

"అది కాదు..."

"ఏదీ కాదు. ముందు నువ్వు బయటకు వెళ్ళు" చాలా కోపంగా చేతిని ఎత్తి బయటకు వెళ్ళేదారివైపు చూపిస్తూ చెప్పాడు యశ్వంత్.

యశ్వంత్ మాటలో వచ్చిన మార్పుకి, ముఖంలో కనిపించిన కోపానికి భయపడి సింధు ఏం మాట్లాడలేకపోయింది.

సింధు, ఆమె బాబాయ్ ఇంటిలోనుండి బయటకు వచ్చేశారు. సింధుకి తల్లిదండ్రులను క్షేమంగా చూసినందుకు ఆనందంగానూ, వాళ్ళను తనతో తీసుకొని వెళ్ళలేకపోతున్నందుకు బాధగానూ ఉంది.

సింధు బయటకు వచ్చేసరికి మహేష్ అక్కడకు చేరుకున్నాడు.

"సింధు... ఏమయినా తెలిసిందా? " ప్రశ్నించాడు మహేష్.

సింధు జరిగినదంతా వివరించి చెప్పింది.

"సరే... నే వెళ్తున్నా" అని చెప్పి సింధు, ఆమె బాబాయ్‌తో ఇంటికి బయలుదేరింది.

★ ★ ★

సింధు ఇంటికి చేరుకొనేసరికి చైతన్య





శ్రీనివాస్ ఆమె కోసం ఎదురు చూస్తు న్నారు.

"సింధూ... మీ అమ్మా, నాన్న అక్కడే ఉన్నారా? " ప్రశ్నించాడు చైతన్య.

"ఆ... ఉన్నారు" అని జరిగినదంతా మళ్ళీ వీళ్ళకు చెప్పింది సింధు.

"మనం వాడు రేపు మీ అమ్మానాన్నలతో కేసు పెట్టించటానికి ముందే వాళ్ళను తీసు కువచ్చేస్తే అన్నయ్య క్షేమంగా బయటకు వస్తాడన్నమాట" ఏదో ఆలోచిస్తూ అన్నాడు చైతన్య.

"అది అనుకున్నంత తేలిక కాదు. ఇంటికి నాలుగు అల్సేషియన్ కుక్కలు, దాదాపు పదిమంది వరకూ సెక్యూరిటీవాళ్ళు కాపలా ఉన్నారు" చెప్పాడు సింధూ వాళ్ళ బాబాయ్.

"మరి ఇప్పుడేం చేద్దాం? "

"సాయంత్రానికి సవిత ఊరినుంచి వచ్చే స్తుంది. ఆమె వస్తే వాళ్ళ డాడీ ఫోన్ నెంబరు తెలుస్తుంది. కాబట్టి అప్పటివరకూ మనం ఆగాలి" చెప్పాడు శ్రీనివాస్.

"ఇక అదొక్కటే మనకున్న ఆధారం" అంది సింధు.

"సరే... అయితే అమ్మ కంగారుపడుతూ ఉంటుంది. నేను ఇంటికి వెళతాను. సవిత వస్తే నాకు వెంటనే ఫోన్ చెయ్యండి" అన్నాడు చైతన్య.

"అలాగే" అన్నాడు శ్రీనివాస్.

చైతన్య వెళ్ళిపోయాడు. శ్రీనివాస్ ప్రతి ఐదు నిముషాలకొకసారి సవిత ఇంటికి ఫోన్‌చేస్తూనే ఉన్నాడు. కానీ ఎటువంటి ప్రయోజనం లేకపోయింది.

★ ★ ★

సమయం సాయంత్రం ఆరుగంటలు అవుతుండగా సింధూ వాళ్ళింటికి వచ్చింది సవిత. సవిత డైరెక్ట్‌గా ఇక్కడకు వస్తుం దని ఊహించని శ్రీనివాస్ ఆమెను చూడ గానే ఆశ్చర్యపోయాడు.

"ఏయ్... నువ్వెప్పుడొచ్చావ్? " ఆశ్చ ర్యంగా ప్రశ్నించాడు శ్రీనివాస్.

"ఇప్పుడే వస్తున్నాను. ఫ్రెండ్ కారు వేసు కొని వచ్చేశాను. మన ఊరు కూడా వెళ్ల లేదు. హైదరాబాద్‌నుంచి డైరెక్ట్‌గా ఇక్క డకే వచ్చాను. అది సరే. అసలు సంగతి ఏమయ్యింది? మేటర్ ఎంతవరకూ వచ్చింది? " ప్రశ్నించింది సవిత.

శ్రీనివాస్ ఉదయంనుంచి జరిగిన సంఘ టనలన్నీ ఆమెకు వివరించాడు.

"మధ్యాహ్నంనుంచీ మీ ఇంటికి ట్రైచేస్తు న్నాను. ఫోన్ ఎవరూ లిఫ్ట్ చేయటంలేదు"

"ఆ... మమ్మీ కూడా ఇంట్లో లేదు"

"మీ డాడీ సింగపూర్‌కి వెళ్ళిపోయారా? "

"లేదు... టూర్ రేపటికి పోస్ట్‌పోన్ అయ్యింది. ముందు నేను డాడీతో మాట్లా డతాను" అని ఫోన్ తీసి నెంబరు డయల్ చేసింది.

విజయప్రకాష్ లైన్లోకి వచ్చిన తరువాత సవిత జరిగినదంతా చెప్పి ఏదో ఒకటి చేయమని చెప్పి ఫోన్ కట్‌చేసింది.

"అదేంటి? ఏదో ఒకటి చేయమని ఫోన్ కట్ చేసేశావు. ఇప్పుడు మీ డాడీ ఏం చేస్తారో మనకు తెలిసేదెలా? " ప్రశ్నించాడు శ్రీనివాస్.

"డాడీ ఏదో మీటింగ్‌లో ఉన్నారు. అందుకే త్వరగా కట్ చేసేశాను. మన అవ సరం ఉంటే డాడీనే ఫోన్ చేస్తారు"

"మరి నెంబరు? "

"నేను మాట్లాడింది డాడీ సెల్ నెంబ రుకే. సెల్ కాబట్టి ఈ నెంబరు రికార్డు అయిపోతుంది. నో ప్రాబ్లమ్".

"సరే... ముందు చైతన్యకు ఫోన్ చేసి ఈ విషయం చెప్పాలి. వాడు చాలా కంగారు పడిపోతున్నాడు" అని చైతన్య ఇంటికి ఫోన్ చేశాడు శ్రీనివాస్.

"హలో" అటువైపునుంచి వినిపించింది లేడీ వాయిస్.

"ఆంటీ... నేను శ్రీనివాస్‌ని. చైతన్య లేడా ఆంటీ!"

"లేదమ్మా! బయటకే వచ్చాడు. నేనింకా మీ దగ్గరే ఉన్నాడనుకొంటున్నాను"

"ఎంతసేపయ్యిందాంటి వెళ్ళి"

"ఇంచుమించు అరగంట అవుతోంది"

"సరే ఆంటీ ఉంటాను" అని లైన్ డిస్కనెక్ట్ చేసి ఆలోచనలో పడ్డాడు.

ఈ టైమ్‌లో బయటకు ఎక్కడకు వెళ్లుంటాడు అని ఆలోచిస్తుండగా చైతన్య మాటలు గుర్తుకువచ్చాయి శ్రీనివాస్‌కి. ఒకవేళ తన అన్నయ్యకోసం యశ్వంత్ ఇంటికిగానీ వెళ్ళలేదు కదా? అనుకొంటుండగా ఫోన్ రింగ్ అయ్యింది. సింధు ఫోన్ లిఫ్ట్ చేసి మాట్లాడింది.

"శ్రీనివాస్... ఫోన్ మహేష్ నుంచి" అని రిసీవర్ శ్రీనివాస్‌కి అందించింది.

"హలో... మహేష్ చెప్పు" రిసీవర్ అందుకొని అన్నాడు శ్రీనివాస్.

"ఇప్పుడే చైతన్య నాకు ఇక్కడ కనిపించాడు. ఎవరిదో బండిమీద చాలా ఫాస్ట్‌గా వెళుతున్నాడు. నేను పిలిచినా వినిపించుకోలేదు. నాకు వాడు యశ్వంత్ ఇంటికిగానీ వెళుతున్నాడేమోనని అనుమానంగా ఉంది"

"నా అనుమానం కూడా అదే. నువ్వు వెంటనే యశ్వంత్ ఇంటికి వెళ్లు. వాడు యశ్వంత్‌ని కలుస్తున్నాడో లేక దొంగతనంగా ఇంట్లోకి వెళ్ళి వాళ్లను తప్పించటానికి ప్రయత్నాలు చేస్తున్నాడో చూసి వాడిని శాంతపరుచు. ఈలోపు నేను కూడా అక్కడకు వస్తాను" అని రిసీవర్ క్రెడిల్ చేశాడు.

"సింధూ... సవిత వాళ్ల ఫాదర్ దగ్గర నుంచి ఏదయినా ఫోన్ వస్తే నువ్వు మాట్లాడు" అని చెప్పి "సవితా... పద మనం వెంటనే బయలుదేరాలి" అన్నాడు శ్రీనివాస్.

అప్పటికే చీకట్లు పూర్తిగా కమ్ముకున్నాయి.

సవిత, శ్రీనివాస్ హడావుడిగా బయటకు వచ్చి వారికి ఎదురుగా నడుచుకుంటూ వస్తున్న సింధూ వాళ్ళ అమ్మానాన్నలను చూసి ఆశ్చర్యపోయారు. కానీ వారిని కుశల ప్రశ్నలు వేయటానికి సమయం ఇది కాదని ఓ నవ్వు విసిరేసి ఇద్దరూ కారులో వెళ్ళిపోయారు.

తల్లిదండ్రులను చూడగానే సింధు ఆనందానికి అవధుల్లేవు. చిన్నపిల్లలా ఎగిరి గంతులేసింది. ఇక తన కష్టాలన్నీ తీరిపోయాయని చాలా ఆనందించింది.

"సింధూ... అత్తయ్యకు ఫోన్ చేసి రేపు ఇక్కడకు రమ్మని చెప్పు" అన్నాడు సత్యనారాయణ.

"ఎందుకు నాన్నా" ప్రశ్నించింది సింధు.

"నీ పెళ్ళి ఎంత త్వరగా వీలయితే అంత త్వరగా జరిగిపోవాలి. ఆ విషయం మాట్లాడాలి రమ్మను"

"అలాగే నాన్నా" అని సింధు ఫోన్ వద్దకువెళ్ళింది. ఆమె ముఖంలో ఎటువంటి బాధా లేదు. ఆమెను అలా చూసి సత్యనారాయణ చాలా సంతోషించాడు.



**ఎమ్.**ఎల్.ఏ రాజేంద్రకుమార్ ఇల్లు ఊరుకి కొద్దిగా దూరంగా ప్రశాంతమైన వాతావరణంలో ఉంది. దానిని ఇల్లు అనటంకంటే ఇంద్రభవనం అంటే సరిగ్గా సరిపోతుంది. రకరకాల హంగులతో, విద్యుద్దీపాల అలంకరణలో చాలా రిచ్‌గా ఉంది.

చైతన్య ఆ ఇంటికి కొద్దిదూరంలో బైక్ ఆపేశాడు. రోడ్డుపక్కన ఉన్న ఖాళీ స్థలం లోనుంచి బండిని నెట్టుకుంటూ ఇంటి వెను కభాగానికి చేరుకున్నాడు. అక్కడ ప్రాంత మంతా చెట్లతో నిండి ఉంది. ఎవరికీ కని పించదనుకున్న ప్లేస్‌లో బైక్‌ని దాచిపెట్టి ఇంటి ప్రహారీగోడను చేరుకున్నాడు.

ఆ గోడ మనిషి ఎక్కగలిగే ఎత్తులో లేదు. దానికితోడు గోడపై ముళ్లతీగతో వేసిన ఫెన్సింగు. గోడ ఎక్కి లోపలకు వెళ్ళటం జరగని పని అని భావించి చైతన్య ఎక్కడయినా లోపలకు వెళ్ళటానికి దారి ఉంటుందేమోనని చూస్తూ ఇంటి ముందు భాగానికి వచ్చాడు.

మెయిన్‌గేటు దగ్గర వాచ్‌మన్ నిలబడి ఉన్నాడు. అతనిని చూడగానే చైతన్య గోడ పక్కకు తప్పుకొని ఇంటిలోపలికి వెళ్ళటానికి మార్గం గురించి ఆలోచించసాగాడు.

అతని ప్రయత్నానికి టైమ్ కూడా హెల్ప్ చేస్తున్నట్టుగా అప్పుడే కరంటు పోయింది. ఆ భవనం పూర్తిగా చీకట్లో మునిగిపోయింది.

చైతన్య ఆ అవకాశాన్ని వదులుకోకూడదని అనుకొన్నాడు. గోడచాటు నుంచి బయటకు వచ్చాడు. అప్పుడే వాచ్‌మెన్ గేట్ తీసుకొని లోపలకు వెళుతూ కనిపించాడు. చైతన్య ఇక ఆలస్యం చేయలేదు. చాలా వేగంగా పరుగెత్తి గేట్‌ని సమీపించాడు. అక్కడ ఎటువంటి వెలుతురూ లేకపోవటంతో చైతన్య ధైర్యంగా లోపలకు ప్రవేశించి ఒకచెట్టు పక్కన దాక్కొన్నాడు. ఒక నిముషం తరువాత పెద్ద శబ్దంతో జనరేటర్ ఆన్ అయ్యింది.

అప్పుడు చూశాడు చైతన్య తను దాక్కొని ఉన్న చెట్టుకి కొద్దిదూరంలో ఉన్న సెక్యూరిటీగార్డ్స్‌ని. ఇక తను అక్కడ ఉండటం అంత శ్రేయస్కరం కాదని అనుకొని సేఫ్ ప్లేస్ కోసం అటూ ఇటూ చూశాడు. పక్కనే వరుసలో పెరిగిన రకరకాల పూల మొక్కలు, ఇతర క్రోటన్స్ మొక్కలు కనిపించాయి. వాటిమధ్యకు చేరుకోగలిగితే తనకు ఎటువంటి ప్రమాదం ఉండదని అనుకొన్నాడు.

వెంటనే రెండు అడుగులు పరిగెట్టి, కుడి కాలితో నేలను బలంగా తన్ని గాలిలోకి లేచి ఆ చెట్లమధ్యకు పడ్డాడు. కింద ఉన్న ఎండుటాకులమీద పడేసరికి దబ్‌మంటూ శబ్దం అయ్యింది. కాకపోతే జనరేటర్ శబ్దంలో ఆ శబ్దం కలిసిపోవటంతో చైతన్య ఊపిరి పీల్చుకున్నాడు.

చైతన్య పైకి లేవకుండా నేలమీద ప్రాకుకుంటూ కొంతదూరం వెళ్లాడు. ఇక సెక్యూరిటీగార్డ్స్‌కి తను కనిపించనని నిర్ధారించుకున్న తరువాత లేచినిలబడి ఇంటివెనుకవైపుకు నడక ప్రారంభించాడు. ఇంతలో ఇంటిలోని లైట్లన్నీ ఒకసారి ఆరిపోయి వెంటనే వెలిగాయి. వాటితోపాటు జనరేటర్ శబ్దం కూడా ఆగిపోయింది.

ఇక మీదట తను చాలా జాగ్రత్తగా ఉండాలి. ఏ చిన్న శబ్దం అయినా తన ప్రాణాలు పోవటం ఖాయం అనుకున్నాడు చైతన్య.

బిల్డింగ్ పైకి వెళ్ళటానికి ఆధారంకోసం వెతుకుతూ నడుస్తున్న చైతన్యకు ఇంటిపైవరకూ ఉన్న వాటర్‌పైపు కనిపించింది. ఇప్పటివరకూ సినిమాల్లోను, నవలల్లోను చూసిన పైప్‌ని పట్టుకొని ఎగబాకే దృశ్యాలు గుర్తొచ్చాయతనికి. తనకి కూడా బిల్డింగ్ పైకి చేరుకోవటానికి అదే మంచి దారి అనుకున్నాడు చైతన్య.

ఇంతలో కరకరమంటూ ఏదో శబ్దం వినిపించేసరికి శ్రద్ధగా పరిసరాలను గమనించాడు చైతన్య. అప్పుడు చూశాడతను సరిగ్గా వాటర్‌పైప్‌కింద కూర్చొని మాంసం ముక్కను ఉత్సాహంగా తింటున్న ఆల్సేషియన్ డాగ్‌ని. దాని ఆకారాన్ని చూడగానే చైతన్య పైప్రాణాలు పైనే పోయాయి.

చైతన్య ఆలోచనలోపడ్డాడు. వాటర్‌పైప్‌కి, ఆ కుక్కకి మధ్య తను వెళ్లి పైకి ఎక్కటానికి సరిపోయే స్థలం ఉంది. కాకపోతే ఏ చిన్న శబ్దం అయినా అదే తనకు ఆఖరి నిముషం

అవుతుంది. అయినా తప్పదు. ఇప్పుడు ఏదో ఒకటి చేయాలి అనుకొని రిస్క్ తీసుకోవటానికే నిర్ణయించుకున్నాడు చైతన్య.

ఏమాత్రం శబ్దం రాకుండా కాలివేళ్లపై నడుచుకుంటూ వాటర్ పైప్‌ని సమీపించాడు. డిన్నర్‌లో బిజీగా ఉన్న అల్సేషియన్ చైతన్య ఉనికిని గుర్తించలేకపోయింది.

చైతన్య పైప్‌ని పట్టుకొని నెమ్మదిగా పైకి పాకసాగాడు. అలా ఎక్కటం పుస్తకాలలో చదివినంత తేలికకాదనిపించిందతనికి. కొద్దిగా పైకి ఎక్కేసరికి చేతులు మంటపుట్టటం ప్రారంభం అయ్యింది. పైప్‌ని పట్టుకోవటానికి సరిగా గ్రిప్ కూడా దొరకటంలేదు.

అలాగే కష్టపడి కొంతదూరం ఎక్కాడు. తరువాత కిటికీకి ఉన్న సన్‌షేడ్‌ని పట్టుకోవటానికి ఒక చేతిని చాచాడు. అంతే అతను ఏదయితే జరగకూడదనుకున్నాడో అదే జరిగింది. సన్‌షేడ్‌ని పట్టుకునే లోపు పైప్‌ని పట్టుకొని ఉన్న రెండవచేయి పట్టు సడలింది.

అంతే మరుక్షణం ఆల్సేషియన్‌కి రెండు అడుగుల దూరంలో నేలమీద పడ్డాడు. తన డిన్నర్‌ని డిస్టర్బ్ చేసిన చైతన్యవైపు పళ్లన్నీ బయటపెట్టి కోపంగా చూసింది. అంతటితో ఆగకుండా ఆ ప్రాంతమంతా దద్దరిల్లిపోయేలా మొరుగుతూ తన కోపాన్ని ప్రదర్శించింది.

ఇక తన ప్రాణాలు దక్కవనే అభిప్రాయానికి వచ్చిన చైతన్య కనీసం పరిగెత్తే ప్రయత్నం కూడా చేయలేదు. కళ్లు మూసుకుని నేలపై పడుకొని ఉండిపోయాడు. కానీ ఆల్సేషియన్ అరుపు ఆగకుండా వినిపిస్తుందేకానీ అది తనవద్దకు వస్తున్న దాఖలాలు ఏవీ కనిపించకపోయేసరికి కళ్లు తెరిచి చూశాడు చైతన్య.

అక్కడ ఆల్సేషియన్ అరుస్తూనే మెడకు ఉన్న చైన్‌ని తెంపుకోవటానికి శక్తికొలదీ ప్రయత్నిస్తోంది. అది చూసి చైతన్య ముఖంలో నవ్వు వచ్చి వెంటనే మాయం అయ్యింది. దొరికిన ఛాన్స్‌ని వదులుకోకూడదని లేచి పరుగు ప్రారంభించాడు.

కానీ అప్పటికే ఆల్సేషియన్ అరుపుతో అలెర్ట్ అయిన సెక్యూరిటీగార్డు ఒకడు ఇంటివెనుకకు వచ్చేశాడు. పరిగెడుతున్న చైతన్యను చూడగానే అతని చేతిలోని పిస్టల్ నిప్పులు కక్కింది. అదృష్టవశాత్తు ఆ బుల్లెట్ చైతన్య పక్కనుంచి వెళ్ళి ఎదురుగా ఉన్న గోడలో దిగబడింది.

చైతన్య బలాన్నంతా కాళ్లలోకి తెచ్చుకొని పరిగెత్తాడు. కానీ అతని ప్రయత్నం ఫలించలేదు. ఎదురుగా మరొక సెక్యూరిటీగార్డు తనవైపే పరిగెత్తుకొని వస్తూ కనిపించేసరికి అతని కాళ్లు కదలలేదు.

ఒకవైపు ఎత్తయిన ప్రహారీగోడ, రెండవ వైపు అంతకంటే ఎత్తయిన బిల్డింగ్ ముందు, వెనక సెక్యూరిటీగార్డ్స్. ఎటు పోవాలో అర్ధంకాలేదు చైతన్యకి. సెక్యూరిటీ గార్డ్స్ ఇద్దరూ దగ్గరకు వచ్చేస్తున్నారు. చైతన్యకు తప్పించుకొనే మార్గం కనిపించలేదు. అందుకే రెండు చేతులూ పైకెత్తి లొంగిపోతున్నానని వాళ్లకు సంకేతం ఇచ్చి మోకాళ్లపై కూర్చుండిపోయాడు.

చైతన్య లొంగిపోతున్నాడని భావించిన సెక్యూరిటీగార్డ్స్ చాలా క్యాజువల్‌గా అతనిని సమీపించారు. వారిలో ఒకడు చైతన్యను పట్టుకోవటానికి ముందుకు వంగాడు. అంతే అప్పటివరకూ మోకాళ్లపై కూర్చొని ఉన్న చైతన్య ఒక్కసారి పైకి లేచి సెక్యూరిటీగార్డు ముఖంమీద గుద్దాడు. ఊహించని చర్యకు బ్యాలెన్స్ చేసుకోలేక వెనక్కి పడ్డాడు. పిస్టల్‌తో కాల్చటానికి రడీ అవుతున్న రెండోవ్యక్తిని వెనక్కి నెట్టి పరుగు ప్రారంభించాడు. అయినా ఆ గార్డ్స్ టార్గెట్‌నుంచి తప్పించుకోవటానికి అతనివేగం సరిపోలేదు.

కొద్దిగా ఆలస్యం అయితే ఆ గార్డ్స్ చేతిలో ఉన్న పిస్టల్‌నుంచి వచ్చే బుల్లెట్స్ చైతన్య శరీరాన్ని జల్లెడలా మార్చేసేవి. ఆ సమయంలో వెనుకనుంచి "డోన్ట్ షూట్"




అంటూ యశ్వంత్ కంఠం వినిపించేసరికి గార్డ్స్ తమ ప్రయత్నం విరమించుకున్నారు.

రెండవవైపునుంచి వచ్చిన గార్డ్స్ చైతన్యను పట్టుకొని తీసుకొని వచ్చారు.

చైతన్య యశ్వంత్‌తోపాటు శ్రీనివాస్, మహేష్‌లను చూసి ఆశ్చర్యపోయాడు.

"రేయ్... నీకు, నీ అన్నయ్యకు ఆవేశం ఎక్కువ ఆలోచన తక్కువ. నేను వాళ్లను వదిలేసిన తరువాత ఎవరికోసం వచ్చావురా నువ్వు ఇక్కడికి? " అన్నాడు యశ్వంత్.

"వాళ్ళని వదిలేశావా? ఎప్పుడు? " ఆశ్చర్యంగా ప్రశ్నించాడు చైతన్య.

"అది తెలుసుకోకుండానే నువ్వు వచ్చేశావు. మీ అన్నయ్యకు, నీకు ఏదో అదృష్టం ఉందిరా. ఆరోజు మీ అన్నయ్యను ఏమీ చేయకుండా ప్రకాష్ అంకుల్ కాపాడారు. ఈరోజు నువ్వు శ్రీనివాస్‌వల్ల బతికిపోయావ్"

"మా అన్నయ్య మీద నీకెందుకంత పగ. నెలల తరబడి గుర్తుపెట్టుకొని మరీ గొడవ పడుతున్నావు. మా అన్నయ్యే కాదు నువ్వు కూడా చాలా తప్పులు చేస్తున్నావు"

"ఆవేశపడకు నాయనా. నేను తప్పులు చేయటంలేదని అనను. నేనూ తప్పులు చేస్తాను. నన్ను ఇంతవరకూ ఎవడూ కొట్టలేదు. చివరకు మా నాన్న కూడా. మొదటిసారి వాడు నన్ను కొట్టాడు. నెలల తరబడి గుర్తుంచుకొని ప్రతీకారం తీర్చుకునే పద్ధతి కాదు నాది. ఆరోజే వాడు అయిపోయేవాడు. కానీ తప్పించుకున్నాడు. తరువాత కేవలం ప్రకాష్ అంకుల్ మూలంగా మీ వాడు బతికిపోయాడు. లేకపోతే వాడు ఎక్కడున్నా వెతికి మరీ కాళ్ళు రెండూ లేకుండా చేసేవాణ్ణి. ప్రకాష్ అంకుల్ మీద ఉన్న గౌరవంతో ఇంతకాలం సైలెంట్‌గా ఉన్నాను. కానీ మళ్లీ మీవాడే ఈ గొడవను కదిపాడు. నాకు కోపం వచ్చేలా చేశాడు. ఎదుటివాడు నన్ను రెచ్చగొట్టినప్పుడు సహనంగా ఉండటానికి నేనేం మహాత్ముడిని కాదు"

చైతన్య మౌనంగా ఉండిపోయాడు.

"నాకు మీతో ఎటువంటి గొడవా లేదు. నా శత్రుత్వం కేవలం రమేష్‌తో మాత్రమే. ఇప్పుడు శ్రీనివాస్ వచ్చి నన్ను రిక్వెస్ట్ చేయకపోయినా నీ ప్రాణానికేం హాని జరగదు. కాకపోతే తగలాల్సిన కొన్ని దెబ్బల్ని తప్పించుకున్నావంతే. ఇక ఇక్కడ నీ పనేం లేదుగా ఇంటికి వెళ్ళు" చైతన్యతో అన్నాడు యశ్వంత్.

"మరి మా అన్నయ్య"

"అది మాత్రం అడగొద్దు. పో ఇక్కడ నుంచి" అంటూండగానే యశ్వంత్ చేతిలోని సెల్ రింగ్ అయింది.

"హలో..." అన్నాడు యశ్వంత్.

"హలో... యశ్వంత్" అటువైపునుంచి ప్రశ్నించాడు విజయప్రకాష్.

"అవునంకుల్... నేనే చెప్పండి"

"నేను మొన్న రిక్వెస్ట్ చేసిందే మళ్ళీ చేస్తున్నాను. ఆ రమేష్‌ని వదిలేయ్"

"మీరు చెప్పారనే నేను సైలెంట్‌గా ఉంటే వాడు రెచ్చిపోతున్నాడంకుల్. ఈసారి మాత్రం వదిలే ప్రసక్తే లేదు. సారీ అంకుల్"

"యశ్వంత్ ఈ ఒక్కసారికి నామాట విను. మరొకసారి ఏదయినా గొడవ జరిగితే నీ ఇష్టం. ఏమంటావు? "

"అంకుల్... మీలాంటి పెద్దవాళ్ళు ఇటువంటి చిన్న విషయాల గురించి ఆలోచించటం నాకేం నచ్చలేదంకుల్"

"తప్పట్లేదు. కూతురు సెంటిమెంటు. నా కోసం ఈ పని చేస్తావుగా"

"చేస్తానంకుల్" అని లైన్ డిస్కనెక్ట్ చేశాడు.

"రేయ్ చైతన్యా! మీ అన్నయ్యకు ఇన్‌ఫ్లుయన్స్ ఎక్కువైపోయిందిరా. నువ్వు శ్రీనివాస్ ఫ్రెండ్‌వి కావటం, సవిత, శ్రీనివాస్ లవర్స్ కావటం వాడికి అడ్వాంటేజ్ అయి

పోయింది. సరే ఏం చేస్తాం... మీ వాడికి నేనో ఛాన్స్ ఇస్తున్నాను. రేపు ఉదయం కాలేజీకి వచ్చి అందరి ముందూ నా కాళ్ళు పట్టుకొని నాకు క్షమాపణ చెపితే మీవాడు సేఫ్‌గా బయటకు వస్తాడు. లేకపోతే అంతే. తరువాత మీ ఇష్టం"

"వాళ్ళు ఇంటికి వచ్చేసేకా అన్నయ్యను పోలీస్‌స్టేషన్‌లో ఎలా ఉంచుతారు. ఈ పని అన్నయ్య చేయలేదని వాళ్ళతోనే చెప్తాను" కాస్త ఆవేశంగా అన్నాడు చైతన్య.

"ఓ.కే. ప్రయత్నించు. పని జరిగితే హ్యాపీ. లేకపోతే నేను చెప్పినట్టు చేయాల్సిందే. అంతకంటే నీకు వేరే ఛాన్స్ లేదు. మీవాణ్ణి ఒప్పిస్తావో, నీకు అన్నయ్య లేడను కొంటావో నీ ఇష్టం" అని చెప్పి వెనక్కి తిరిగి చూడకుండా నడుచుకుంటూ లోపలకు వెళ్ళిపోయాడు యశ్వంత్.

"శ్రీనివాస్, మహేష్, చైతన్యను తీసుకొని బయటకు వచ్చేశారు.

★ ★ ★

శ్రీనివాస్, చైతన్య, మహేష్ సింధు ఇంటికి చేరుకున్నారు. చైతన్య నేరుగా సింధు తండ్రి సత్యనారాయణ వద్దకు వెళ్ళాడు.

"అంకుల్... మా అన్నయ్య ఈ పని చేయలేదని పోలీసులకి చెప్పండి. అంకుల్ ప్లీజ్" ప్రాధేయపడ్డాడు చైతన్య.

సత్యనారాయణ ముఖంలో ఎటువంటి ఫీలింగూ లేదు. ఆ విషయం తనకు అవసరం లేని విషయంలా ప్రవర్తించాడతను.

"ఏంటంకుల్! నిజం చెప్పటానికి భయపడతారెందుకు? నేనేం అబద్ధపు సాక్ష్యం చెప్పమనటం లేదుకదా. ప్లీజ్ అంకుల్"

"నిజం నాకు ముఖ్యం కాదు. నా కూతురి ప్రాణాలే నాకు ముఖ్యం" అన్నాడు సత్యనారాయణ.

అప్పుడు విషయం అర్థమయింది అందరికీ. వెంటనే రమేష్ కోసం పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళారు ముగ్గురూ. సింధు తండ్రి చెప్పడని తెలిపోయింది కాబట్టి రమేష్‌తో సారీ చెప్పించటానికి ఒప్పించాలన్నది వారి ప్లాను. ముగ్గురూ స్టేషన్‌కి వెళ్ళి ఎస్.ఐ.ని కలిశారు.

"సార్ ఒకసారి రమేష్‌తో మాట్లాడాలి" అడిగాడు చైతన్య.

"వెళ్లండి..." అన్నాడు ఇన్‌స్పెక్టర్.

ఇంతకుముందు వరకూ రమేష్‌ని చూడటానికే పర్మిషన్ ఇవ్వని వ్యక్తి ఇప్పుడు మాట్లాడటానికి పర్మిషన్ ఇచ్చాడంటే విషయం ఇక్కడకు వచ్చేసిందన్నమాట అనుకున్నారు ముగ్గురూ.

చైతన్య రమేష్‌తో విషయం అంతా చెప్పాడు.

"ఇంత బతుకూ బతికి ఇంటి వెనకాల చచ్చినట్టు పోయి... పోయి వాడి కాళ్ళే పట్టుకోవాలా? ఆ పని నేను చేయలేనురా" చాలా మామూలుగా చెప్పాడు రమేష్.

అసలు ఆ మాట వినగానే అందరినీ తిడుతూ పెద్దగా అరుస్తాడని భావించిన ముగ్గురికీ రమేష్ ప్రవర్తన ఆశ్చర్యం కలిగించింది.

"అది కాదురా! మేం చెప్పేది కొద్దిగా విను. నువ్వు వాడికి క్షమాపణలు చెప్పటం వల్ల నీకు ఎటువంటి నష్టమూ రాదు. ఎలాగూ ఇంకో నెలరోజుల్లో కాలేజీ వదిలి వెళ్ళబోయేవాడివి నీకెందుకు సిగ్గు" అన్నాడు చైతన్య.

రమేష్‌నుంచి ఎటువంటి రెస్పాన్సూ లేదు.

"చూడరా నీవల్ల ఎంతమంది బాధపడుతున్నారో! నువ్వు ఒక్క నిమిషంపాటు నీ మనసుని చంపుకుంటే తరువాత అందరం హ్యాపీగా ఉండొచ్చు. ఒప్పుకోరా" అంటూ బతిమాలాడు చైతన్య.

"సరే..." కొద్దిసేపటి తరువాత అన్నాడు రమేష్.

అతను అంత త్వరగా ఒప్పుకుంటాడని ఊహించలేదు వాళ్ళు. అందుకే ముగ్గురూ





ఎంతో సంతోషపడ్డారు. వెంటనే చైతన్య యశ్వంత్‌కి ఫోన్‌చేసి విషయం చెప్పాడు. మరుక్షణమే రమేష్ సెల్ లోనుండి బయటకు వచ్చాడు.



రమేష్ క్లాస్‌రూమ్‌లోకి ఎంటర్ అవగానే అప్పటివరకూ హుషారుగా కబుర్లు చెప్పుకుంటున్న స్టూడెంట్స్ అంతా వారి మాటలను ఆపేసి రమేష్‌వైపే చూడటం ప్రారంభించారు. రమేష్ వెనుక చైతన్య, శ్రీనివాస్ లోపలకు వచ్చారు.

రమేష్‌ని చూడగానే యశ్వంత్ ముఖంలో శాడిస్టిక్ హ్యాపీనెస్ కనిపించింది. వాడు బెంచ్‌పై కూర్చొని కాళ్ళను డెస్క్‌పై పెట్టాడు. రమేష్ నెమ్మదిగా యశ్వంత్‌ని సమీపించాడు.

చైతన్యకు టెన్షన్ పెరిగిపోతోంది. క్షమాపణ చెప్పటానికైతే ఒప్పుకున్నాడు కానీ అది నిజంగా చెప్తాడని మాత్రం చైతన్యకు నమ్మకం కుదరటంలేదు. మళ్ళా ఏ గొడవ జరుగుతుందోనని లోలోపల భయంగా ఉందతనికి.

రమేష్, యశ్వంత్ కూర్చొని ఉన్న బెంచ్ వద్ద నిలబడ్డాడు.

అంతా చాలా టెన్షన్‌గా వీళ్ళవైపే చూస్తున్నారు.

రమేష్ తన చేతులతో యశ్వంత్ కాళ్ళను తాకాడు. చైతన్యకు ఆ దృశ్యం ఎంతో బాధగా అనిపించింది. చూడలేక కళ్ళు మూసుకున్నాడు.

"అయామ్ వెరీ సారీ యశ్వంత్" బాధ నిండిన గొంతుతో చెప్పాడు రమేష్.

వెంటనే యశ్వంత్ కాళ్ళను డెస్క్‌పై నుంచి తీసేసి లేచి నిలబడ్డాడు. రమేష్ చేతుల్ని తన చేతులతో పట్టుకుని,

"అయామ్ ఆల్‌సో వెరీ సారీ" అన్నాడు యశ్వంత్.

ఆ డైలాగ్ విని అందరూ ఆశ్చర్యపోయారు. యశ్వంత్, రమేష్‌ని తిడుతూ మాట్లాడతాడని అందరూ అనుకున్నారు. కానీ అందుకు విరుద్ధంగా అతను కూడా క్షమాపణ చెప్పేసరికి అందరి పరిస్థితి అయోమయంగా తయారయింది.

"ఈరోజు నుంచి ఈ గొడవలు ఏమీ వద్దు. మనం ఫ్రెండ్స్. ఏమంటావ్?" ప్రశ్నించాడు యశ్వంత్.

ఆ మాటలకు రమేష్ కూడా షాక్ తిన్నాడు.

"సరే..." షాక్‌తోనే అన్నాడు రమేష్.

ప్రాబ్లం చాలా ఈజీగా సాల్వ్ అయిపోయినందుకు చైతన్య, శ్రీనివాస్‌లకు చాలా ఆనందంగా ఉంది.

రమేష్, చైతన్య, శ్రీనివాస్ క్లాస్‌రూమ్‌లో నుండి బయటకు వచ్చేశారు.

"ఏరా! ఈరోజు క్లాసుకి వెళ్ళవా?" ప్రశ్నించాడు చైతన్య రమేష్‌ని.

"లేదు ఇప్పుడు సింధు ఇంటికి వెళ్ళాలి" ఏదో ఆలోచిస్తూ చెప్పాడు రమేష్.

"సింధు ఇంటికా! ఎందుకు?" కంగారుగా ప్రశ్నించాడు చైతన్య.

"నువ్వేం కంగారుపడకు. ఇకమీదట ఎటువంటి గొడవలూ జరగవు. నా ఆఖరి ప్రయత్నం చేద్దామని" అన్నాడు రమేష్.

వాడిలో వచ్చిన మార్పుకి సంతోష ప

డాలో, వాడి పరిస్థితికి జాలిపడాలో అర్థం కాలేదు చైతన్యకి.

★ ★ ★

"నమస్తే అంకుల్" సత్యనారాయణకి నమస్కరిస్తూ అన్నాడు రమేష్.

సత్యనారాయణ రమేష్ వైపు కోపంగా చూడటం మినహా ఎటువంటి రెస్పాన్స్ ఇవ్వలేదు.

"అంకుల్ నన్ను క్షమించండి. నేను తప్పు చేశాను. నా వల్లే మీ అందరూ కష్టాలు పడ్డారు. అయినా మీరు నన్ను క్షమించి సింధుని నాకిచ్చి పెళ్ళి చేస్తారనే ఉద్దేశంతో మిమ్మల్ని అడగటానికి వచ్చాను" మళ్ళీ తనే అన్నాడు.

"నువ్వు ఆవేశంలో అన్న ఒక్కమాట కారణంగా మేమందరం ఇంత బాధ పడాల్సివచ్చింది. అటువంటిది నా కూతురిని జీవితాంతం నీతో కలిసి ఉండటానికి నేను ఒప్పుకుంటే ఎన్ని కష్టాలు పడాల్సివస్తుందో తలుచుకుంటేనే భయంగా ఉంది" అన్నాడు సత్యనారాయణ.

"అది కాదంకుల్..." అంటూ రమేష్ ఏదో మాట్లాడబోయాడు. కానీ సత్యనారాయణ అతనికి అడ్డుపడ్డాడు.

"చూడు బాబూ. నువ్వు ఎన్ని కారణాలు చెప్పినా ఈ పెళ్ళి జరిగే ప్రసక్తే లేదు. మమ్మల్ని ప్రశాంతంగా బతకనివ్వు" అర్థిస్తున్నట్టుగా అన్నాడు సత్యనారాయణ.

రమేష్ భారంగా వెనక్కి తిరిగాడు.

అప్పటివరకూ వీళ్ళ మాటల్ని చాటుగా వింటున్న సింధు కళ్ళల్లోనుంచి కన్నీటిబొట్టు కిందకు జారింది. వెంటనే తండ్రి మనసులో మెదిలి కన్నీటిని చేత్తో తుడిచేసుకుంది.

★ ★ ★

కొన్ని నెలల తరువాత...

"ఏరా! నువ్వు రావా పెళ్ళికి" రమేష్‌ని ప్రశ్నించాడు చైతన్య.

"లేదురా! ఆ పెళ్ళి చూసి తట్టుకునే గుండెధైర్యం నాకు లేదు" బాధగా అన్నాడు రమేష్.

చైతన్య, శ్రీనివాస్, మహేష్, సింధు, సవిత అతనివైపు జాలిగా చూశారు.

"ఏయ్... ఏంటంతా అలా అయిపోయారు. నేనేం బాధపడటం లేదు. దగ్గరుండి ప్రియురాలి పెళ్ళి జరిపించేటంత ధైర్యం లేదంతే. ముహూర్తానికి టైమ్ అవుతోంది. మీరు వెళ్ళండి" అన్నాడు రమేష్.

అందరూ సింధు ఇంటివైపు నడక ప్రారంభించారు.

"రమేష్‌ని చూస్తుంటే నాకు చాలా బాధగా ఉంది" శ్రీనివాస్‌తో అంది సవిత.

"కానీ ఏం చేయగలం. ముందే అన్ని విషయాలూ ఆలోచించుకుంటే ఈ పరిస్థితి రాదుకదా! పోనీలే వాళ్ళ జీవితంలో ప్రేమ ఓ తీపిగుర్తుగా మిగిలిపోతుంది" అన్నాడు శ్రీనివాస్.

"తీపి గుర్తు కాదు. ముళ్ళగుర్తు. ఎప్పుడూ బాధిస్తూనే ఉంటుంది"

"ఎంత పెద్ద ముల్లు అయినా ఒకరోజు జీవం కోల్పోతుంది"

అందరూ సింధు ఇంటికి చేరుకున్నారు. అప్పటికి పెళ్ళి తతంగం మొదలైపోయింది.

సింధు, సింధు పక్కన రాఘవ పెళ్ళి పీటలపై కూర్చొని ఉన్నారు. వీళ్ళందరినీ చూడగానే చిరునవ్వు నవ్వింది సింధు. ప్రతిగా అందరూ నవ్వారు.

"బాబూ మాంగల్యధారణ చేయండి" అని పంతులుగారు అనటంతో వరుడు రాఘవ సింధు మెడలో అగ్నిసాక్షిగా, పంచభూతాల సాక్షిగా, బంధుమిత్రుల ఎదుట పంతులు గారి పర్యవేక్షణలో మూడు ముళ్ళు వేశాడు.

పెళ్ళికి వచ్చిన పెద్దలంతా అక్షింతలతో వాళ్ళను ఆశీర్వదించారు.

రమేష్ మాత్రం తన ప్రియురాలు ఎక్కడున్నా క్షేమంగా ఉండాలని కన్నీటితోనే ఆశీర్వదించాడు.






# ఏరినముత్యాలు

✲ బాధని నివారించే మందు ఒకే ఒకటుంది - నిరంతరం ఏదో ఒక పనిలో లీనమవ్వడం.

- బెంజిమన్‌డిస్రేలీ

✲ నోరు జారడంకన్నా, కాలుజారి పడడమే మంచిది.

- బెంజిమన్ ఫ్రాంక్లిన్

✲ ఒక స్నేహితుణ్ణి ఎంచుకోకముందు నెమ్మదిగా ఆలోచించి ఎన్నుకో. స్నేహితుణ్ణి వదిలిపెట్టదలచుకున్నప్పుడు బహు నెమ్మదిగా ఆలోచించి వదిలిపెట్టు.

- టాల్‌స్టాయ్

✲ ఒక దొంగను పట్టుకోవడానికి మరొక దొంగనే నియమించు.

- ఒక సూక్తి

✲ ఇంటిలోనికి జాలువారే సూర్యకిరణాలవంటివి ఇంట్లో కురిసే చక్కటి నవ్వులు.

- విక్టర్‌హ్యూగో

✲ అదృష్టం వలన బంధువులు ఏర్పడతారు. స్నేహితులను మాత్రం విజ్ఞతతో మనం ఎన్నుకోవాలి.

- ప్లేటో

✲ పెద్దవయసు ఆలోచిస్తుంది. యౌవనంలోవున్న వయసు సాహసిస్తుంది.

- బ్రౌనింగ్

✲ నీకు నువ్వే ఒక మంచి స్నేహితునిగా రూపొందు. పిమ్మట అంతా నీకు స్నేహితులవుతారు.

- వోన్‌మోల్‌టికీ

✲ ఎవ్వరికీ బాకీ లేని వ్యక్తి ఒక ధనవంతుడే.

- గ్లాడ్‌స్టోన్

✲ తాను చేసిన తప్పిదాలు కప్పిపుచ్చుకోడానికి మానవుడు ఎంతో శ్రమపడి ముసుగులు తయారుచేయాలి. అయితే మంచిగా మారడానికి మాత్రం అతను శ్రమపడనవసరం లేదు.

- బెంజిమన్ ఫ్రాంక్లిన్

✲ ఒక అబద్ధం ప్రస్తుతాన్ని మాత్రం భద్రపరుస్తుంది. అయితే అది రాబోయే కాలాన్ని భద్రపరచలేదు.

- టాల్‌స్టాయ్

✲ చిన్న చిన్న త్యాగాల వలన మంచి ప్రవర్తన అలవడుతుంది.

- రాల్ఫ్ వాల్డో ఎమర్సన్

✲ అందం ఓ నిజం. నిజం ఓ అందం.

- జాన్ కీట్స్

సేకరణ: **కొడిమెల శ్రీరామమూర్తి**

# చతుర కతలు

## ఫ్రీ

ఆఫీసులో బిజీగావున్న భర్తకి ఫోన్ చేసి "ఇవాళ ఆఫీసునుంచి త్వరగా వచ్చేయండి" అంది ముక్తేశ్వరి.

"ఆడిట్ జరుగుతోంది, వీలుపడదు" అన్నాడు బ్రహ్మానందం. అతని అనుమానం నిజమైంది.

"బర్మాస్‌లో పట్టుచీరెలు అమ్ముతున్నారు. ఒక చీర కొంటే ఇంకో చీర ఫ్రీయట. సేల్స్ ఈ సాయంత్రమే మొదలవుతాయి. ఫస్ట్‌డే వెళ్తేనే మంచి డిజైన్లు, క్వాలిటీ దొరుకుతాయి. తర్వాతంతా మిగిలిపోయిన సరుకుంటుంది" అంది భార్యామణి.

"నీకు బోలెడు పట్టుచీరలున్నాయిగా. ఇంకా ఎందుకు? " అన్నాడతను విసుగ్గా.

"ఎన్నున్నా ఫ్రీగా వచ్చే చీరని విడిచిపెట్టుకుంటారేమిటి? "

"సారీ, అవసరమైతే మరో రోజున వెళదాంలే" అన్నాడు పళ్లు కొరుక్కుంటూ.

"సరే. ఇవాళ మీకు పుద్దూ, బెద్దూ రెండూ గడ్డే" అనేసి కోపంగా రిసీవరు పెట్టేసిందామె.



సెక్షన్లో తననెవరూ చూడ్డంలేదని కన్ఫర్మ్ చేసుకుని నుదురు బాదుకున్నాడు బ్రహ్మానందం. భార్య ఫ్రీ గిఫ్ట్స్ పిచ్చి నానాటికీ ముదిరిపోతోంది. సబ్బు ఫ్రీ అంటే చాలు ఏ గబ్బు వస్తువునైనా కొనేస్తుంది. పిన్ను నుంచి పియానో వరకూ ఫ్రీ గిఫ్టు ఆఫర్ దేనికున్నా అప్పుచేసి మరీ కొనేస్తుంది. అసలు ఈ దేశంలో ఫ్రీగా వచ్చేదంటూ ఏదీ వుండదనీ, పూచికపుల్లని కూడా అమ్మి సొమ్ముచేసుకునే కల్చర్

మనదనీ, ఫ్రీ ఆఫరంటే దాని ఖరీదు అసలు వస్తువుతో యాడ్ అయివుంటుందనీ ఎంత గానో నచ్చచెప్పబోతాడు బ్రహ్మానందం. 'ఇంకానయం, ఓ భర్తని కొంటే ఇంకో భర్త ఫ్రీ అన్న స్కీం రాలేదు. లేకుంటేనా, అమ్మో' అంటూ ఒక్కోసారి గుండెలు బాదు కోవడం కద్దు. భర్త అమాయకత్వానికి నవ్వేసి వూరుకుంటుంది ముక్తేశ్వరి. ఆమెని తెలిసున్నవారు ఆమె పేరుని 'ముఫ్తేశ్వరి'గా మార్చేశారు. ఫ్రీ గిఫ్టులూ, వాటికోసం ఆమె కొన్న వస్తువులతో గదంతా నిండిపోవడం చూసి 'పార్ట్‌టైమ్ బిజినెస్‌గా ఓ ఫ్యాన్సీ షాపు పెడితే బావుంటుంది బ్రదర్' అంటూ బ్రహ్మానందానికి సలహా కూడా ఇచ్చారెవరో.

పెళ్లయి పదేళ్లయినా సంతానం లేని కారణంగా దిగులు చెందుతుంటుంది ముక్తేశ్వరి. అందువల్ల ఏదోవిధంగా ఆమె సంతోషంగా వుంటే చాలనుకున్న బ్రహ్మానందం, ఆమె ఏంచేసినా పెద్దగా పట్టించుకోడు. ఆమె తెలివితక్కువతనానికి నవ్వుకోవడమో, జాలిపడటమో చేస్తుంటాడు.

ఇలా వుండగా ఓ రోజున హఠాత్తుగా శుభవార్త ఒకటి భర్త చెవినవేసింది ముక్తేశ్వరి. ఆనందం పట్టలేక ఆమెని ఎత్తి గిరగిరా తిప్పసాగాడతను. ఆ తర్వాత డాక్టర్ చేత పరీక్షచేయిస్తే ముక్తేశ్వరి గర్భవతని నిర్ధారణ చేసింది.

అప్పట్నుంచీ భార్యని అపురూపంగా చూసుకోసాగాడు బ్రహ్మానందం. ఆ సమయంలో ఆమె మనసు కష్టపెట్టడం ఇష్టం లేక ఫ్రీ గిఫ్టుల పేరుతో ఆమె ఏం కొన్నా అభ్యంతరం చెప్పడంలేదు.

చూస్తుండగానే తొమ్మిది నెలలూ గడిచిపోయాయి. ముక్తేశ్వరి మెటర్నిటీ హాస్పిటల్లో అడ్మిటయింది. ఏ కాంప్లికేషన్సూ లేకుండా సుఖ ప్రసవం జరగాలని గుర్తున్న దేవుడికల్లా మొక్కుకున్నాడు బ్రహ్మానందం. లేబర్‌రూంలోంచి భార్య అరుపులు వినిపిస్తూంటే గది బయట కాలు కాలిన పిల్లిలా తిరగసాగాడు. క్షణక్షణానికీ టెన్షన్ పెరిగిపోతోంది. కేక కేకకూ దేవుళ్లని తలచుకుంటున్నాడు.

చివరికి సిజేరియన్ తప్పలేదు. కొంతసేపటి తర్వాత బయటకి వచ్చింది డాక్టరు. బ్రహ్మానందాన్ని కంగ్రాచులేట్ చేసింది.

తల్లీపిల్లా క్షేమమే కదా డాక్టర్? " ఆత్రుతగా అడిగాడతను.

"పిల్ల కాదు, పిల్లలు అనండి, కవలపిల్లలు పుట్టారు" అందామె నవ్వుతూ.

"ఆ? !" అన్నాడు బ్రహ్మానందం షాక్‌తో. అంతలోనే ఏదో స్ఫురించడంతో "ఓ... నో! ఇందులో కూడా ఫ్రీ గిఫ్ట్ బేరమేనా ముక్తేశ్వరీ? !" అంటూ తల పట్టుకుని బల్లమీద చతికిలబడిపోయాడు.

– సత్యనారాయణ పి.వి.వి.

---

## సంపాదన

ఉదయం తొమ్మిది గంటలైంది.

మరో పది నిమిషాల్లో ఆఫీస్‌కి చేరిపోవాలి.

అంతకన్నా లేటయితే పనిష్మెంట్‌గా సిఎల్ అప్లయ్ చేయాల్సి ఉంటుంది.

వేగం పెంచాను.

నెమ్మదిగా వెళ్తే... లీవ్ ఖర్చుచేయాలి. తొందరగా వెళ్ళాలనుకుంటే వేగం పెంచాలి. వేగం పెంచితే ప్రమాదం జరిగే అవకాశాలు ఎక్కువ. దురదృష్టవశాత్తూ ప్రమాదం జరిగిందా అలాంటి శలవులు చాలా ఖర్చవుతాయి. జాగ్రత్తగా ఉంటూనే బండి వేగం పెంచాను.

ఫాస్ట్ రైడ్ ఆర్ లాస్ట్ రైడ్...
దిసీజ్ హైవే... నాట్ ఎ రన్‌వే...
స్పీడ్ థ్రిల్స్... బట్ కిల్స్...
ఇలా చాలా చాలా స్లోగన్స్ తూటాల్లా

చెవుల్లో పేలుతున్నాయ్.

ఇప్పుడు నేను వేగం పెంచింది నిజానికి థ్రిల్ పొందాలని మాత్రంకాదు. ఎవరి ముందో నేనో గొప్ప డ్రైవర్‌నని చాటుకొం దామని కాదు కేవలం అవసరం. ఆల స్యాన్ని అధిగమించాలనే ఒకే ఒక్క కార ణంతో...

పెట్రోలు బంక్ వచ్చింది.

పరుగుతీస్తున్నవేళ అకస్మాత్తుగా బండి అటూఇటూ ఊగిసలాడ్డంతో అదుపుత ప్పింది. అతికష్టంమీద బ్యాలన్స్ చేసుకుని కొంత దూరం పోయాక ఆపగలిగాను.

బ్రేక్ అప్లయ్ చేసినా ఫలితం శూన్యం. ఏక్సిలరేటర్ డౌన్‌చేసి, ఇంజిన్ ఇగ్నిషన్ ఆపాను. అయినా కాళ్ళతో బలవంతంగా ఆపితేకానీ అదుపులోకి రాలేదు వాహనం.



ఇతర వాహనాల తాకిడి కూడా మొద లైంది. ఆ ట్రాఫిక్‌లో ఇరుక్కున్నామా ఆ పద్మవ్యూహంలోనుండి బయటపడడం అదీ తక్కువ టైంలో అందర్నీ ఛేదించుకుని రావడమంటే కత్తిమీద సామే.

ఇక లాభంలేదని... మరింత స్పీడ్ పెంచాను. అడకత్తెరలోని పోకచెక్కలాంటి సున్నితమైన స్థితి. వేగంగా వెళ్తే ప్రమా దాల భయం. లేటుచేస్తే శలవు వ్యర్థమవు తుందని భయం. అయినా తప్పనిసరి పరిస్థితిలో వేగంగా వెళ్ళక తప్పలేదు. సరిగ్గా అదే సమయంలో ఉరకలు వేస్తూ

ఏం జరిగిందో కొంతసేపు అర్థంకాలేదు. స్టాండ్‌వేసి పరిశీలించాను. ముందుచక్రం టైర్ పంక్చరైంది. గాలంతా బయటకు పోయి నొక్కుకుపోయి వెక్కిరిస్తోంది టైర్.

తొందరకు ఆలస్యం మొగుడంటే ఇదే నేమో. ఇక చేసేదేంలేక...

టైర్ రిపేర్ చేసే షాపుకోసం వెదకసా గాయి నా కళ్ళు. ఎక్కడో ఉందని వెతికితే పోయిన వస్తువు కాళ్ళకి తగిలినట్లు కరె క్ట్‌గా నా బండి ఆగిన ప్రదేశానికి ఎదురు గానే ఉంది ఆ షాపు.

నేను పిలుద్దామనుకునే లోపలే ఆ షాపులోని కుర్రాడు పరుగెత్తుకుని వచ్చాడు.

"సార్ మీ టైర్ ట్యూబ్‌కి ప్యాచ్ చేయ మంటారా? " అడుగుతూనే ఆగి ఉన్న బండి చక్రం తిప్పి "ఇదిగోన్సార్ మేకు గుచ్చుకుంది" అని చూపించాడు.

"నాక్కొద్దిగా అర్జెంట్‌గా చేసి పెట్టాలి" బతిమిలాడాను.

"అర్జెంటుగా అయితే ఏభై రూపాయల వుతుంది సార్" చెప్పాడు.

"అదేంటి అర్జంటన్నానని ఏభయ్యా? మామూలుగానైతే ఇరవైకదా" రెట్టించాను.

కుదరదని చెప్పి "నలభై" ఇమ్మన్నాడు.

"పది నిమిషాల్లో చేసివ్వాలి." కండిషన్ పెట్టాను. సరేనన్నాడు. గబగబా టైర్ ఓపెన్ చేశాడు. టైర్‌కున్న మేకులాగి రోడ్డు పైకి విసిరాడు.

నాకు అనుమానం కలిగింది వీడు ఆ మేకును మళ్ళీ రోడ్డుమీదకు ఎందుకు విసిరాడాని. బయటకు నేనేమీ పట్టించు కోనట్లుగా మౌనంగానే పరిశీలించసా గాను. వాడు అంటే ఆ షాపు ఓనర్ పని కుర్రాడిని పిలిచి ఏవో గుసగుసలాడుతు న్నాడు.

"ఏంటంత సీక్రెట్‌గా చెప్తున్నాడు? " అని ఒక చెవిని అటుగా ఉంచాను.

"ఏంర్రా మేకు కరెక్ట్‌గా వేశావా? చాలా స్కూటర్స్ వెళ్తున్నాయి కానీ ఇంత టైమ యినా వేటికీ ప్యాచ్ చేయడాన్కి టైర్స్‌కి కన్నం పడడంలేదు? టీకి వెళ్ళినప్పుడు మరో రెండు తీసుకొని వెళ్ళి రోడ్డుకి మధ్యలో నిటారుగా ఉండేలా పెట్టు" పని కుర్రాడికి వివరిస్తున్నాడు.

నాకు చాలా కోపం వచ్చింది.

రోడ్డంతా వెదికాను. కొంతదూరం పరిశీ లిస్తేనే... తొమ్మిది మేకులు దొరికాయి.

పట్టరాని కోపంతో ఊగిపోయాను. పరు గుపరుగున వచ్చి ఛడామడా తిట్టాను. షర్ట్ పట్టుకుని లాగి కొట్టాను.

"నీకొచ్చే ఇరవై, ముప్ఫై రూపాయల కోసం నువ్వు ఇంతకి దిగజారిపోవడం సిగ్గుగా లేదూ. నీ దుర్మార్గం వలన నేను ఈరోజు డ్యూటీకి శలవు పెట్టుకోవాల్సివ చ్చింది. అంతకన్నా బిక్షమెత్తుకుంటే ముష్టి వేస్తారుకదా. రాజకీయ నాయకుల్ని కాదు ముందు నీలాంటివార్ని ఉరితియ్యాలి" అంటూ కేకలు వేశాను. చుట్టూ అంతా చేరారు. చేరినవాళ్ళంతా తలొకటి కొట్టి చీవాట్లు పెడుతున్నారు ఆశ్చర్యపోతూ. ఆ గుంపు మరింతగా పెరుగుతోందే తప్ప తగ్గడంలేదు. ఆఫీస్‌కు ఎలాగైనా తొంద రగా చేరుకోవాలని కనీసం ఒక అవినీతిని అందర్కీ తెలియచేయగలిగాననే ఆత్మసం తృప్తితో అక్కడనుండి బయటపడ్డాను.

*– ఎం.వి.జె. భువనేశ్వరరావ్*

---

## ఆనవాలు

జాతీయ 'పతివ్రతల దివసం' సంద ర్భంగా టౌన్‌హాల్లో మీటింగు జరుగు తోంది. రంగుల సీతాకోకచిలుకల్లా తిరుగు తున్న మహిళలతో నిండుగా వుంది వెన్యూ. దీపాల తోరణాలమధ్య ముఖ్య అతిధి వేదికనలంకరించింది.

పూలదండలతో సభాకార్యక్రమానికి శ్రీకారం చుట్టబడింది. మొదట అమ్మాయిల ప్రార్థనాగీతం, తరువాత ఆహ్వానాలు, సమితి కార్యదర్శి నివేదిక. అది పూర్తికాగానే సమితి అధ్యక్షురాలు సుమతీదేవి మైక్‌ముందుకొ చ్చింది. ముందుగా ముఖ్య అతిథిని గురించి ప్రశంసావర్షం కురిపించింది. అటుపిమ్మట ఆడజన్మ ప్రాశస్త్యం, సావిత్రి, అనసూయ, సుమతి, శకుంతలవంటి పతివ్రతలను గూర్చి వివరించింది. భర్తను దైవంగా పూజించే భారతనారీ సాంప్రదాయమూ, సంస్కృతీ గురించి నొక్కి వక్కాణించింది. ఆమె ఆవే శంగా ఇంకా ఏమేమో చెబుతూంటే ప్రేక్ష కులు ఆసక్తిగా ఆలకించసాగారు.



అదే సమయంలో సెక్రటరీ హడావుడిగా వేదికమీదకి వచ్చింది. స్పీకర్‌నుంచి మైక్‌ని దాదాపు లాక్కుని ఇలా ప్రకటించింది... "ఓ ముఖ్యమైన ప్రకటన. ఈ సభకు విచ్చేసిన సోదరీమణులలో ఒకరి భర్త పరాయి స్త్రీతో నెక్లెస్‌రోడ్‌లో ప్రేమకలాపాలు సాగిస్తుంటే పోలీసులు పట్టుకున్నారు. తన భార్య ఈ సభకు విచ్చేసినట్లు చెప్పి ఇక్కడికి కబురు పంపించాడు ఆమె భర్త. పబ్లిక్‌లో పేరుచెప్పడం సభ్యతకాదు కనుక ముఖ్యమైన అతని ఆనవాలొకటి చెబుతాను. 'పెళ్ళాంచేత రోజూ మొట్టికాయలు తినే' అలవాటున్న కారణంగా అతని తల నిండా గొప్పులుంటాయి. అతని భార్య ఎవరో దయచేసి తక్షణమే వెళ్ళవలసిందిగా కోరుతున్నాం. ఆ సోదరికి ఇబ్బంది కలుగకుండా అయిదు నిమిషాలపాటు హాల్లో లైట్స్ ఆర్పివేయబడతాయి"

సభలో కలకలం రేగింది. హాల్లో లైట్సు ఆరిపోయాయి.

అయిదు నిమిషాల తరువాత లైట్స్ మళ్ళీ వెలిగాయి.

హాలువంక చూసిన ముఖ్య అతిథి ఉలిక్కిపడింది.

హాలు సగం ఖాళీ అయిపోయింది. ప్రసంగిస్తున్న సమితి అధ్యక్షురాలు సుమతీ దేవితోసహా!

– తిరుమలశ్రీ

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2476685; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 220901; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd. No. H/HD/965 /2003 RN1/32186/78



